

కన్నడ మూలం:

ఆద్య రంగాచార్య

తెలుగు సేత:

అయాచితుల హనుమచ్ఛాస్త్రి



సాహిత్య అకాడెమీ

న్యూఢిల్లీ

EKANKA SANGRAHAM—Telugu translation by Ayachitula Hanumat Sastry of EKANKA SANGRAHA (Anthology of Kannada one act plays) compiled by Adya Rangacharya - Sahitya Akademi, New Delhi, 1978—Price Rs 10-00



*First Edition :* 1978.

SAHITYA AKADEMI
Rabindra Bhavan, New Delhi-1.

*Regional Offices :*
Madras-6, Calcutta-29 & Bombay-14

వెల : రూ.10-00

Published by Sahitya Akademi and Printed at Weldun Press, 7/1, Mannappa Mudali Street, Madras-600 021.

# వి ష య సూ చి క

# పరిచయం

ఏకాంక సంగ్రహాన్ని సంపాదించేవారి మొదటి బాధ్యత 'ఏకాంకము' అంటే ఏమిటో తెలిసికోడం. కన్నడంలో ఈ బాధ్యత ఇంకా ఎక్కువ జాగరూకతతో వహించవలసి వుంటుంది. దీనికి కారణాలు రెండు: ఒకటి, ఏకాంక మనేది అధునిక కన్నడానికి కొత్తది. రెండవది—ఏకాంకిక కొన్ని విశిష్ట కారణాలవల్ల ఎక్కువ ఉపయోగకరమైనది; ఉపయోగకరమైనదానికి, వాడుక హెచ్చు, వాడుక ఎక్కువైతే నిమ్నస్థాయికి చేరుకొనే భయమూ వుంది. ఇంతేగాక, రచయితలనుండీ మనకాస్తే సహాయ సహకారాలు దొరకవు. నేడు అనేకులు 'ఏకాంకిక' అని తాము రాసేదానికి నామకరణం చేస్తారు. నిజానికి అది ఎల్లా చూసినా, ఏకాంకికకు దూరదూరంగా కూడా సంబంధించి వుండదు; ఉండే యోగ్యత దానికి లేదు: ఇందుకు తోడు విమర్శకు లనబడేవారు, ఈ గొడవ ఏదీ విచారించకుండా, రచయిత చెప్పిందాన్ని నమ్మి, 'ఏకాంకిక'ను విమర్శిస్తూ వుంటారు. ఏకాంకిక అంటే త్రికాలాబాధితమైన నిర్వచనం ఇవ్వకపోయినప్పటికీ, నేడు పరిచితములా కొందరి నాటక కర్తల కృతులను, ఏ కారణాలచేత, 'ఏకాంకిక' అని ఇక్కడ సంకలన పఱచామో, ఆ విషయమైనా మున్నుడిగా విశదపఱచవలసి వుంటుంది.

ఏకాంకిక కన్నడానికి కొత్త అని చెప్పడంలో, భారతీయ సాహిత్య సంప్రదాయంలోనే ఏకాంక ముండియుండలేదని చెప్పడం మా ఉద్దేశం కాదు. అల్లా చెప్పడం సాధ్యమూ కాదు; స్థూలదృష్టితో చూసినప్పుడు సంస్కృత రూపకాల్లో ఏకాంకికలూ ఉన్నాయి; అనేక రకాలుగా స్వీకరింపబడిన ఏకాంక ప్రక్రియలున్నాయి. వ్యాయోగం, భాణం, అంకం, వీథి అని నాల్గు రకముల రూపకాలు, ఏకాంకికల క్రిందనే చేరుతాయి. వాని లక్షణాలను పరికించండి:—

వ్యాయోగం:—ఖ్యాతేతి వృత్తో వ్యాయోగః

ఖ్యాతోద్ధత నరాశ్రయః

అస్త్రీ నిమిత్త సంగ్రామో జామదగ్న్య జయే

ఏకాహా చరితైకాంకః

భాణః :—భాణస్తు ధూర్తచరితం
స్వానుభూతం పరేణవా
యత్రోప వర్ణయదేకో, సంబోధనోక్తి
ప్రత్యుక్తీ కుర్యాదాకాశ భాషితైః

అంకః :—ఉత్సృష్టికాంకే ప్రఖ్యాతం
వృత్తం బుద్ధ్యా ప్రపంచయేత్,
....నేతారః ప్రాకృతా నరాః

వీథి :—ఏవం వీథీ విధాత వ్యాద్వ్యేక పాత్ర ప్రయోజితా ॥

సాహిత్య దర్పణంలో చెప్పబడిన ఈ లక్షణాలు, సామాన్యంగా అన్ని నాట్య శాస్త్ర గ్రంథాలూ చెబుతాయి. రసం, పాత్ర సంఖ్య, పాత్రల హోదా, స్త్రీ పాత్ర లేకుండుట – ఇటువంటి వివరాలతో ఈ రూపకాలు వర్ణింపబడ్డాయి. వీటిల్లో ఏ ఒక్క మాటా నేటి 'ఏకాంకికలకు' అన్వయించదు మరి. అంచేత ఈ ఏకాంక సంప్రదాయానికీ, మన ఏకాంకికలకు, సమంజస మైన పొత్తు గలపడం జరిగేపని కాదు. వ్యాయోగానికిచ్చిన లక్షణంలో ఓ మాట వుంది. 'ఏకాహ చరితై కాంకః' అంటే ఓ రోజులో జరిగిన వృత్తాంతాన్ని గురించి, ఓ అంకముండాలి అని. కాని నేడు 'ఏకాంకిక' అన్నంత మాత్రాన, ఒకే రోజులో జరిగిన ఘటన గురించి వస్తువుండాలి అని నిర్దేశించడానికి వీల్లేదు. ఈ ప్రకారంగా సంప్రదాయబద్ధంగా ఏకాంక నాటకాలుంటాయి, అని ఇక్కడ సందర్భానుసారంగా కూడా చెప్పడానికి వీల్లేదు.

'ఏకాంకిక' కన్నడానికి కొత్త అనే మాటలోని అర్థమే వేరు. నేటి మన 'ఏకాంకం' పూర్తిగా మన నేటి జీవితంనుండే ప్రేరితమై వుంటుంది, నేటి జీవితానికి ప్రతిబింబంగా వుంటుంది. నేటి మన జీవితం ఎంతమట్టుకు కొత్తదని మనం గుర్తించుతామో, అంతమట్టుకు మన 'ఏకాంకిక' ప్రక్రియ కూడ కొత్తది. మన జీవితం ఏ విధంగా కొత్త రూపు ధరిస్తూ పోతుందో, ఆ వైఖరిని ప్రతిబింబింపజేసేదే నేటి మన శ్రేష్ఠమైన ఏకాంత సాహిత్యం. అటువంటి ఉత్తమ ఏకాంకికలే ఇక్కడ సంకలితాలైనాయి

కన్నడ 'ఏకాంకిక' పుట్టుక, పాశ్చాత్య సాహిత్య సంపర్క ఫలితం. కన్నడుల సాంఘిక జీవన ప్రభావితాలై దాని వికాసాభివృద్ధులు నడిచాయి,

నడుస్తున్నాయి. పాశ్చాత్య సాహిత్యం–ప్రత్యేకించి ఆంగ్ల సాహిత్యం–తోటి పరిచయం మూలంగా కన్నడంలో 'ఏకాంకిక' తలెత్తింది. నేటి సామాజిక జీవితంలో సామాన్య నాగరికునికి ఎక్కువ విశ్రాంతి సమయం దొరకదు. అంచేత నాటకంయొక్క స్థూలరూపం సన్నం కావొడగింది. పాశ్చాత్యుల్లో స్వల్పావధికములైన ప్రక్రియలే హెచ్చు. ఇంచేత, ఆంగ్ల శిక్షితమైన మన సుశిక్షితవర్గం తానూ ఏకాంకిక ప్రక్రియను కల్పించుకొన్నది. బడి–కాలేజి–సంస్థ – సమ్మేళనం మొదలైన సంస్థలలో, విద్యార్థులు చేరే చోట్లల్లో, ఏకాంకికల ప్రచారం ప్రబలింది.

ప్రదర్శనలు ఎక్కువైన కొలది, 'పూరింపు సృష్టి' ఎక్కువైంది. ఎక్కువగా రాయడంతో వస్తువులోని సత్త్వం – యోగ్యతా రెండూ శిథిలం కాజొచ్చాయి. ఒకచోట అయిదారు దృశ్యాలలో వర్ణించిన చిన్న కథ, మరో చోట చిట్టి పొట్టి, వట్టి సంభాషణ–ఇవే ఏకాంకిక లనిపించుకొని ప్రసిద్ధికెక్క సాగాయి. జీవితానికీ, ఏకాంకికకూ సంపర్కం తప్పింది. భావనకంటె బౌద్ధిక చర్చ, నాటక కళకంటె సంభాషణలోని చాతుర్యం ఎక్కువ కాజొచ్చాయి. ఇందుకు కారణమేమంటే - ఏకాంకిక కోరే వారెక్కువైనారు. కళాకారులవల్ల పొందవలసిన సమృద్ధి, మిగతావాళ్లు పూరించడానికి పూను కొన్నారు, పూరించారు.

'ఏకాంకిక' నాటకం. అందుచేత ఏకాంకిక కళాత్మకమైన సాహిత్య ప్రక్రియ అనే విషయాన్ని మనం ముందుగా గుర్తుంచుకోవాలి. **Woman is a mutilated man** అని అరిస్టాటిల్ చెప్పినట్లు **an one-act is a mutilated play of more acts** (అపూర్ణమైన పురుషుడు అంటే స్త్రీ అన్నట్లు, అపూర్ణ నాటకమే ఏకాంకిక) అనకూడదు. ఇందులో గాత్ర ప్రశ్న, పాత్రల సంఖ్య, వస్తు విన్యాసంలోని రీతి – మొదలైనవి గౌణ విషయాలు. ఏకాంకిక అనేది నాటకమేనని తెలుసుకోవడం చాలా అవసరం. రంగ భూమియందు ప్రదర్శించేటప్పుడు జనుల మనస్సును తాత్కాలికంగా, ముగ్ధ పఱచే రీతిగా కళాకృతి వుండాలి. కళాకృతి అనడంతోనే ముఖ్యమైన ఇంకో సంగతి—ఏమంటే ఏకాంకికయొక్క పరిమాణం. నాటకాలలో ఇది ఒక విశిష్టమైన ప్రక్రియకదా! అందుకనే పరిమాణ మహత్త్వం! మరి పరిమాణం

అల్పమైనంత మాత్రాన ఏకాంకిక అనిపించుకోదు. చిన్న నాటకం వేరు ఏకాంకిక వేరు అని కూడ మనం చెప్పవచ్చు.

ఏకాంకికకు ప్రత్యేకమైన కొన్ని లక్షణాలున్నాయి. ఏకాంకిక అని పించుకోవాలంటే కొన్ని వైశిష్ట్యాలు ఆ కృతిలో మనకు లభించాలి. ఇందులో వస్తుప్రాధాన్య మంతగా లేదు. విధానానికి, రచనాతంత్రానికి ప్రాముఖ్యం హెచ్చు. తంత్రదృష్టితో చూచినప్పుడు, ఏకాంకిక నాటకంకంటె కొన్ని మహత్త్వ పూర్ణసందర్భాలలో వేరుగా వుంటుంది; వేరుగానే వుండితీరాలి కూడా. ఉదాహరణకు–నాటకంలో వుండవలసినట్టే, ఏకాంకికలో ఉపవస్తు వుండడానికి వీలే లేదు. ఏకాంకిక కూడా సాహిత్య ప్రక్రియల్లో నాటకమే అవడంచేత నాటకంలో లాగానే ఇందులోనూ కథావస్తువు, పాత్ర పరి పోషణ, సంభాషణ, సన్నివేశం, ఇవి ఉండాలి కదా? కాని ఏకాంకిక స్వల్పావధిక ప్రయోగ కృతియౌటచే, నాటకంలోని అన్ని అంగాలూ ఏకాం కంలో ఉండ నక్కర్లేదు. పాత్ర సృష్టి, మరి వికాసం, నాటకంవలెనే నిదా నంగా సాగడానికి వీల్లేదు. (నిర్జీవ పాత్రలను సృష్టించడానికి అసలే వీల్లేదు) రస వైవిధ్యానికి చోటు లేదు; కథా చమత్కృతి ముఖ్యమైనచో, సంభాషణా చమత్కృతికి మహత్త్వమున్నచో, రంగ సన్నివేశానికి ప్రాధాన్యం లేదు– –ఈ విధంగా అనేక విషయాలు చెప్పవచ్చు. అయితే ముఖ్యమైన మాట ఏమి టంటె ఒక్క గంటకు తక్కువైన అవధిలో ఏకాంకికా రచయిత తాను కోరిన దాన్ని ప్రేక్షకులందు బింబింపచేయాలి. ఇందుచేత, నాటక కర్త దృష్టిలో నాటకంకంటె గూడా, ఏకాంకికను రచించడం కష్టసాధ్యమైన విషయం. వస్తువుయొక్క ఉపక్రమోప సంహారాలు, ఇవి నాటకంకంటెనూ వేరుగా వుండవలసి వుంటుంది. సూటిగా ఒకే ఘటన, ఒకే అనుభవం, ఒకే పాత్ర, ఒకే సందర్భం, వీనిని ప్రేక్షకుల ఎదుట వుంచవలసి వుంటుంది; గతి యందు వేగముండి తీరాలి.

ఏకాంకిక లక్షణాల్ని వివరించడం వేరు, నిర్దుష్టమైన ఏకాంకికలను విమర్శించడం వేరు; మొదటిది సాధ్యం, రెండవది ప్రయత్నసిద్ధమయ్యే విషయం; సాధ్యాన్ని సాధించేసామని చెప్పడం మనుష్య స్వభావమే కాదు (లేకపోతే ప్రగతి స్తంభించిపోతుంది). ఇక్కడ సంగృహీతాలైన పదునొకండు

ఏకాంకికలూ, 'ఏవంగుణ విశిష్టా'లైన కృతులనిగాదు; లేక ఈ పదునొకండు మినహాయిస్తే వేరే అటువంటి కృతులు లేవనీ కాదు; కన్నడంలో ఏకాంకిక లను రాసేవారు ఇంకా ఎందరో ఉన్నారు. అయితే ఏకాంకికలను వ్రాయ డంలో చేయితిరిగిన సిద్ధహస్తుల కృతులనీ, వానివల్లనే కన్నడ ఏకాంకికల లోని వైవిధ్యం చూపించగలమనీ, ఈ పదునొకండు ఏకాంకికలను ఇక్కడ సంకలించడమైంది. ఈ ఏకాంకికా రచయితలు, ఆధునిక సాహిత్య ప్రపం చంలో ఒక విశిష్టస్థానాన్ని సంపాదించుకొని వున్నారు.

'బిరుదెంతెం బరగండ' అనే దాన్ని రాసిన కీర్తిశేషులైన 'సంసరు' అనేకములైన చారిత్రక నాటకాల్ని రచించి వున్నారు. మైసూరు రాజ్య చరిత్ర చక్కగా చదువుకుని, నాటక రూపంలో ఆ చరిత్రకు జీవకళను ప్రసాదించి వున్నారు. వస్తువు కనురూపమైన శైలీవిన్యాస మొనరించడం వీరి వైశిష్ట్యం. మైసూరు రాజుల బిరుదముల సార్థకతను ప్రదర్శించడంకోసం నంజశెట్టివంటి పాత్రను సృష్టించారు 'సంసరు'. దృశ్యం ప్రారంభం కాగానే 'అప్పణ్ణ'ను పేరుపెట్టి పిలవడం, ఆ 'అప్పణ్ణే' నంజశెట్టి అని వెంటనే తెలపడానికి అతని ప్రవేశం, రాజులూ, మహా రాజులూ, సైనికులు, సేనాపతులు, కలహాలు, వీని యందంతటా, నంజశెట్టి వ్యక్తిత్వం పురోభాగమందే నిలబడి వుండే లాగున సృష్టించడం, ఏకాంకిక కళాదృష్టితో దీనియందలి వైశిష్ట్యములని చెప్పవచ్చు.

దివంగతులైన టి. పి. కైలాసంగారి ఏకాంకికలో మరో ప్రత్యేకత మనకు కానవస్తుంది. ఇందులో మొదటినుంచీ చివరవరకూ నడిచిన సంభాషణల ఆర్భాటం చాటున ఒక చమత్కారం అణగిమణగి వుంది. ప్రారంభంలో సుబ్బణ్ణ చేతులు కడుగుకొనడంలోని 'మర్మం' చివరికి తెలు స్తుంది. కైలాసంగారు ఆంగ్ల కన్నడ భాషలలో అనేక నాటక కృతులను వెలార్చినవారు. కన్నడ సామాజిక నాటకాల్ని వ్రాసిన వారిలో మొట్టమొదటి వారు; వ్యక్తియొక్క అంతరంగాన్ని కరుణాపూరితమైన నవ్వుతో బహిర్గత మొనరిస్తారు. ఒక చమత్కారాన్ని కేంద్ర బిందువుగా పెట్టుకొని, సామాజిక జీవితాన్ని విమర్శిస్తుందీ ఏకాంకిక 'వైద్యన వ్యాధి'.

గడిచిన 20 సంవత్సరాలలో భారతదేశం జీవితంలో ఎంతో క్రాంతి, పరివర్తనాలు జరిగాయి. మహాత్మా గాంధీగారి నేతృత్వంలో ప్రారంభమైన

స్వాతంత్ర్య సంగ్రామం, సాహిత్యంయొక్క హృదయాన్ని ప్రతిభను చూఱ గొనే మాట సహజమే. దీనికి నిదర్శనమే శ్రీ జి. పి. రాజరత్నంగారి 'గండు గొడ్డలి. కథ పౌరాణికం. కాని ఆ కథాసందర్భాన్ని నాటక కర్తలు చిత్రిం చిన రీతియే మరొక్క తీరుగా వుంది.

పరశురాముని తల్లి చెప్పే
"మాతృముక్తియే మనకు స్వర్గ"

మనేదీ, కశ్యపుడు పరశురామునికి చెప్పే

"రోషమ్మ, నింద మోసమ్మ
నాశంపు నిసుగు, క్రోధమ్మ"

అనేదీ గాంధీ యుగాన్ని ప్రతిబింబిస్తాయి.

సామాజిక జీవితంలో ఎటువంటి తిరుగుబాటు నడుస్తున్నదో! వేల సంవత్సరాలుగా శాస్త్ర సంప్రదాయాల అధికారాన్ని, మద్దత్తునీ పొందిన జాతి పద్ధతి అసహనీయమైందని, అన్యాయమనీ తెలుపబడుతోంది. తోడ్తో అందరూ సరిసమానులే అనే తత్త్వం, ప్రచారం చేయబడుతోంది శ్రీ కే. వి. పుట్టప్పగారి 'శూద్ర తపస్వి', శ్రీ కారంతుగారి 'నమ్మ జాతి' ఈ రెండు ఏకాంకికలూ, ఈ విప్లవకాహళిని ప్రమోగిస్తున్నాయి. ఒకే విషయాన్ని కావ్య శైలితో గూడిన గాంభీర్యంతో శ్రీ పుట్టప్పగారు, కళాత్మకమైన వ్యంగ్య శైలిలో శ్రీ కారంతుగారు చిత్రించారు.

ఆధునిక విద్యావిధానంవల్ల అవిభక్త కుటుంబం మనకు తెలిసో తెలియ కుండానో మహత్త్వపూర్ణమైన పరిణామానికి గురి అవుతోంది. సాహిత్యం కూడా ఆ మహత్వాన్ని గుర్తించింది. ఓ పక్క నౌకరీ చేయడానికని, విద్యా భ్యాసం చెయ్యవలెననే పిచ్చి, మరోపక్క చదువుకుతప్ప మరోపనికి పనికి రాడనిపించుకోడం, మరోపక్క నౌకరీ చిక్కగానే స్వతంత్ర దాంపత్యజీవనం సాగించాలనుకోడం – ఈ విధంగా అనేక రీతుల్లో అవిభక్త కుటుంబానికి వ్యాఘాతాలు తగులుతున్నాయి. చివరికి నేటి విద్యకూ, నేటి మన జీవితా లకూ మధ్యనున్న వైషమ్యం మూలంగా మన యువకుల్లో నిరాశ, అవిధే

యత చోటు చేసికొంటున్నాయి. మనుష్యుని అంతరంగాన్ని చిత్రించే నాటకం, దీన్ని గ్రహించింది. నౌకరీలోని నిరర్థకతను వ్యంగ్యంగా శ్రీ కృష్ణకుమార గారు 'సాముద్రిక సామ్రాజ్య'మందు హృదయంగమంగా చిత్రించి వున్నారు. ఎటువంటిదే కానీ నౌకరీ వుండాలి, స్వతంత్ర జీవితం సాగించాలి; ఏమి నేర్చినా, ఎంత చదివినా కుటుంబ హోదాకు తగిన నౌకరీ వుండాలి అనే పరస్పరం విరోధించే మనః ప్రవృత్తుల్ని శ్రీ రం. శ్రీముగళిగారి 'ఎత్తిదకై' ఎత్తి చూపిస్తుంది. ఇంతా చదువుకొనేది ఇంకోరిమాటపైని చేయెత్తడానికే! నేటి విప్లవం, నేటి నవచైతన్యం. ఇవి కేవలం ఇంకొకరి నుండి ఎరవుతెచ్చేవి కావు. మన పరంపరలో ఉదాత్త జీవితం, ఉదాత్త ఆదర్శం అనేవి ఎప్పటి నుంచో ఉన్నాయి – అనే కన్నడిగుని స్వాభిమానానికి ప్రతీకగా వుంది. శ్రీ అ. న. కృష్ణారావుగారి చిన్న చారిత్రక ఏకాంకిక 'అనుగ్రహ'.

స్త్రీ విద్యతో స్త్రీల యందు వ్యక్తి స్వాతంత్ర్య భావం వృద్ధి పొందు తుందనే మాట నేటి విద్యావంతుడైన యువకుడు తత్త్వతః సమ్మతిస్తాడు. కాని 'పెనిమిటిని ఛాయలా వెన్నంటి వుండే పాతివ్రత్యమే పెళ్ళాంధర్మం' అనే సంప్రదాయంలో పుట్టి పెరిగిన యువకునికి ఆ సిద్ధాంతాన్ని తన జీవితంలో ఒప్పుకొనే ధైర్యం లేదు. వైదిక, వ్యావహారిక జగత్తులలోని ఈ వైషమ్యాన్ని మార్మికంగా చిత్రిస్తుంది శ్రీరంగగారి 'దాంపత్యద దొంబె' అనే ఏకాంకిక. కేవలం శ్రద్ధతోనే ఒక విషయాన్ని నమ్మి దాని అర్థాన్ని తెలుసుకోకుండా పోతే ఎటువంటి **Tragedy** గా పరిణమించడాని కవకాశ ముందో, శ్రీ ద. రా. బేంద్రెగారు రచించిన 'సాయో ఆట' మనకు తెలియజేస్తుంది.

కన్నడంలో ఏకాంక ప్రక్రియ వివిధ రూపాలు ధరించింది. శ్రీ పు.తి. నరసింహాచారిగా రంతటి కవి కలం నుండి, ఏకాంకిక లనదగు గేయ నాటికలు పుట్టాయి. ఈ సంకలన మందలి 'హరిణాభిసరణి' అందుకో మచ్చు తునక.

ఇంతకు ముందు చెప్పినట్లు ఉపయోగకర మనిపించే ఏకాంకికల వృద్ధి, కళాదృష్టితో చూసినప్పుడు తృప్తిదాయకంగా లేదు. ఏకాంకికా సాహిత్యం కన్నడంలో తలెత్తి సుమారు 40–50 సంవత్సరాలైంది. కాని ఏకాంకిక ప్రక్రియ నేటికీ విద్యార్థులకే భోగ్యవస్తువుగా వుంది. ఏకాంకికల

రంగభూమి, నాట్యవిలాసాల రంగభూమిగా వుంది; అదీ సంఘటితంగా, సువ్యవస్థితంగా పెరుగ లేదు. ఏకాంకికల పెంపుకు ప్రబుద్ధమూ, జాగరూకమూ నైన విమర్శ అవసరం. అదింకా తలెత్త లేదు. అయినప్పటికీ క్షీర సాగర, పర్వతవాణి, కైవార రాజారావు, ఎం. ఎస్. బాబు, ఎస్. కే. కులకర్ణి మొదలైన పలువురు ఏకాంకికలను రాయడంలో హెచ్చు అభిరుచిని కనబరుస్తూ వుండడం చేత భవిష్యత్తు ఆశాజనకంగా వుంది. 'ఏకాంకిక పుష్టితో బాటు సంతుష్టి కలిగిస్తూ కన్నడంలో పెరిగిందనడానికి ఈ సంకలనంలోని ఏకాంకికలు నిదర్శకాలు.

—శ్రీరంగ
[ ఆద్య రంగాచార్య ]

## పాత్రల పరిచయం

శ్రీ ఇమ్మడి తిమ్మరాజ ఒడెయరు —— మహీశూర మహారాజు.

నంజసెట్టి —— మహీశూర పురంలోని వ్యాపారి

బోరె, బల్లప్ప —— మహీశూర (మైసూరు) సైనికులు.

మహీశూర మహారాజుగారి పరివారంలోనివారు, సైన్యాధిపతి, సేవలోని సైనికులు, వందిమాగధులు

రాజయ్య అరసు —— సింధువళ్ళి పాళెయగాడు

సిద్ధ రాజయ్య —— హుణసనాళికి చెందిన పాళెయగారు.

నంజనగూడ పెద్ద రథోత్సవం జాత్రకు వచ్చిన అసంఖ్యాకులైన పలువురు, గుడి కావలా వాళ్లు, మైసూరు రాజ్యానికి ప్రతిపక్షులైన గౌడులు, ప్రభువులు, రాజులు, పాళెయగాండ్రు, వీళ్ళ కుటుంబంలోనివాళ్ళు, వీరులూ ప్రోత్ర పాఠకులూ.

శ్రీ వీరమల్ల రాజ ఒడెయ —— ఉమ్మత్తూరు ప్రభువు.

జగ్గయ్య నాయకుడు —— ఉమ్మత్తూరులోని ఓ సేనాధికారి.

ఉమ్మత్తూరు రాజచిహ్నాలు ధరించిన శివభక్తులు, బ్రాహ్మణులు, మత ధర్మాధికారులైన సామాజికులు, కావలి మల్లురు, యోధులు, వాహకులు, కైవారం చేసేవాళ్ళు.

మా దేవమ్మణ్ణి —— శ్రీ వీరమల్ల రాజప్రభువుల రాణి.

ఆమెకు చెందిన పరిచారికలు.

# బిరుదు మగడు

(నాంద్యంతంలో సూత్రధారుని ప్రవేశం)

[ సభకు చేతులు జోడించి ]

శ్రీమాన్యం ప్రభువీర మన్త్ర మహిమోదాత్తం మదోద్వృత్తరు
ద్ధామత్వం తమతెందె పొంగి చపళర్ పూర్ణేందుగా తారగళ్
భ్రామం చోదిసె మార్కెళర్వ మినుగెంతెం తాగె తేజస్వియం
తామే రిప్పవొలాళ్ద దేవనోసగీ గుద్యద్య శ్రశ్రేయమం.

గిరిసుత యిడె మై సూరన
వర యాదవ రాజధానిఁ బట్టిన నృపుడా
'బిరుదెంతెంబరగండం'
ఠరయ మహీశూర పురమునాఁ బేరొసఁగెన్.

[పోవును]

[స్థానం-నంజనగూడు, నంజుండేశ్వరుని దేవాలయంమహాద్వారం ముందుప్రక్కల ఈశాన్యపు దిశ మూల. సర్వసిద్ధమై వుండిన నాల్గైదు చిన్న పెద్ద రథాలు; కట్టి చక్కగా అలంకరింపబడ్డ చప్పరాలు వరుసగుళ్లు, తోరణ కలశం చాందినీ తెరలు, చలివేంద్రాలు, నటగాయకుల రమ్యమైన రంగు తీరులు మొదలైనవి. పెద్ద రథోత్సవానికి చెందిన - లెక్కలేనన్ని దేశ ప్రాంత మత వర్ణ జాతి కుల భాషా భేదాల - నానా వేషభూషణాల - అనేకానేక లక్ష్య లక్షణాల, వివిధకృతుల జాతరగాంద్ర సంత (తిరునాళ్ల) కోలాహలం; అప్పటికప్పుడే పల్లకీల్లోనూ, అశ్వారోహులుగానూ, ఏను గంబారీలమీదనూ వచ్చి, ఆ మూలనున్న స్థలంలోనే వాహనాలనుంచి దిగి ఐహికమైన తమ తమ వాద్యాల నన్నిం

టినీ, బిరుదాలనీ,రాజ లాంఛనాలనూ నిలిపి, పరమేశ్వరుని సన్నిధి లోని బహిర్ద్వారానికి పాదచారులుగా సవ్రమభావంతో సపరివారంగా నడిచివెళ్లే గౌడులు, ప్రభువులు, అరసులు పాళెయగాండ్రు మొదలైన పాలకవర్గానికి చెందిన వీరవరులు; అక్కడక్కడ కంబళి, గోనిసంచి, చీర, దుప్పటి, వీటిచే అలంకరింపబడి చిన్న పందిళ్లు వేసిన పటగృహాలు (శామియానాలు) గాలికి తూగాడుతూ వుంటాయి. అటువంటి ఒక తెల్లని గుడారంలోపల సెట్టిగారి లావాదేవీ వ్యాపారం లేక పాడైపోతూవున్న దుకాణంలో ఉప్పు సెనగల కుప్పనూ, కొబ్బరి సంచులనూ, బూరా చక్కెర సంచులనూ, బల్లప్పా బోరెగాడు, కడు జాగ్రత్తగా కాపలా కాస్తూ వుంటారు.]

[హఠాత్తుగా ఉత్తర దిశనుండి పెద్ద కేక రేగి కొంచెం కొంచెంగా స్పష్టమై వినవస్తుంది]

ఓ యాత్రికుడు: (అటు పక్క పరికించుతూ) దొంగతనమో, దొమ్మియో, దోపిడో, దాడో, రాజపరివారమో – ఏదో వస్తోంది!
(పరుగెత్తిపోవును)

ఉన్నవాళ్లు: (తమ తమ నడుములకు కట్టుకొన్న ఆయుధాల్ని ఒర నుంచి దూసి చూసుకొంటారు. జాతరకు వచ్చినవాళ్లూ ఆశ్చర్యంతో కూడిన ఆదుర్దాతో తమ తమ వ్యాపారాల్ని సవరించుకొన్న వ్యాపారస్థులూ, ఇతరులూ వెనక్కు తిరిగి చూసుకొంటూ త్వరత్వరగా పోయి గుడిలో చేరుకున్నారు.)

గుడి కావలా వాళ్ళు: (ఓ మాటు చుట్టూ పరీక్షించి చూసి దడదడా పరుగెత్తి శ్రీద్వారం తలుపుల్ని లాగి మూసి, లోపల ఇనుప గొలుసుల గొళ్ళెములను ధ్వని అయ్యేటట్లుగా గట్టిగా వేసిపెట్టారు.)

బోరె[1]: అప్పన్నను తిరిగి ఇక్కడికే పట్టుకొని లాగుకొని రావాల్సినట్టుంది.

బల్లప్ప[2]: ఔను. (నవ్వి) అతన్ని ఎక్కడ ఎట్లా లాక్కొని వస్తారో, అప్పణ్ణి

1. బోరె = బట్టతలవాడు అని శబ్దార్థం.
2. బల్లప్ప= తెలివిసవాడు, సమర్థుడు.

ఎవరికీ లొంగే ఘటం కాదు.

బోరె: మా రాజులు, పొద్దు గ్రుంకే సమయానికి, 'కొడకొళ' లో వుండి బైల్దేరిన మా రాజులుంగారు, ఇంత పొద్దు పోయినా ఇక్కడికి రాలేదప్పా! నా కేమిటో అనిపిస్తోంది.

బల్లప్ప: వారి నింకా ఆలస్యంగానే రానీ తమ్ముడా! అప్పణ్ణ మనం ఎటువంటి వాళ్ళమో చక్కగా తెలియజేస్తాడుగా!

బోరె: అవును; అట్లాగే.

[మెల్లి మెల్లిగా వెనక క్రమ్మి ఉన్న జనసమ్మర్దం ప్రవేశం]

బల్లప్ప: ఏం తొక్కిసలాట తమ్మయ్యా! అరే! అటు ప్రక్కకైనా పో.

బల్లప్ప, బోరె: (గుంపును కష్టంమీద అటూ ఇటూ పడత్రోసి, వాళ్ళ కాళ్ళ త్రొక్కిళ్ళ నుండి తమరు కాపలా కాస్తూ వున్న ఉప్పుసెనగల కుప్పనూ, సంచులనూ రక్షించుకొంటూ వుంటారు.)

[అహిత వీరుల చేతిలో బందీయై పరివార సమేతులైన పాళెయగాండ్రు చుట్టూ వృత్తాకారంగా వుండగా మధ్యలో వుంటూ నంజశెట్టి ప్రవేశం]

బల్లప్ప: (నవ్వి) ఏ మప్పణ్ణా! నువ్వేమి శెట్టి జాతి వాడవయ్యా! ఈ గొర్రెల మందలో-గొర్రె కాపరిగా తయ్యారైపోయినావు!

నంజశెట్టి: ఔనన్నా ఔను. దారి తప్పిన పేద ముండావాళ్ళను పసుల దొడ్డికి నడిపించి అప్పగించవద్దా?

ప్రతిపక్షు లందరు: (కోపగించుకొని, పెద్ద పెట్టున గర్జిస్తారు).

ఒక పాళెయగాడు: (ముందుకు వచ్చి చెయ్యి పైకెత్తి) చాలు!

అందరూ: (నిశ్శబ్దం).

పాళెయగాండ్రు: అతగాణ్ణి ఒదిలేసెయ్యండి. మనల్ని వాడు హీనపఱచి, వ్యంగ్యంగా మాట్లాడి, ఎక్కడికి పారిపోతాడు?

ప్రతిపక్షంవారు: అటు

ఆ సెనగ కుప్ప దగ్గిఱ

ఆ సంచుల వెనక

అదే ఆ గట్టు క్రింద
ఆ గుడారం లోపల.

పాళెయగాండ్రు: అక్కడికి తీసుకొనిపోయి నిలబెట్టండి వాణ్ణి.

నంజశెట్టి: (ఎవరికీ పట్టువడక చిఱునవ్వు నవ్వుతూ పోయి తన అంగడిలో కూచుంటాడు).

పాళెయగాండ్రు: ఊఁ. ఇప్పు డతని భయంకరమైన ఔద్ధత్యానికి అతనిచేత క్షమాపణ చెప్పించి, అతని ముక్కుతో ఆ మైసూరు సెనగల రాశిపై రాయించి, అతని తలను మండిపడే మిట్టమధ్యాహ్నపు యెండలో బోడి గొట్టించి, అల్లాగే వున్న బోడి బుర్రమీద కొత్తగా కాల్చిన సున్నంతో తన మహారాజుది మాత్రమే నని అతడు నోట విప్పి అరుచికరమైన ఆ బిరుదు పలకడంలో వచ్చే అక్షరాల్ని అదే మంగలివాడి చేత రాయించి, మైసూరువాడు తన చేతికి జిక్కిన నిస్సహాయులైన శత్రువీరు లందర్నీ ముక్కులు గోసి, మానభంగం చేసి, పళ్లు పటపట కొరకడం పరమ రణధర్మ మనేదాన్ని మే మెవ్వరమూ మఱచిపోలేదని అతనికి జ్ఞాపకం చేయడానికి ఆ కడు వింతైన వైశ్య వీరునికి నాసాచ్ఛేదం చేయించి, అటువంటి ఉద్దండ స్థితిలో అతన్ని ఒక కుక్కగానే తలచి, నాల్గు కాళ్లమీద పరుగెత్తింప జేసి, మైసూరు చుట్టూ ఉన్న ప్రాకార ద్వారం వెలుపలికి తరిమిగొట్టి వద్దాం (జనులంతా హసన్ముఖు లౌతారు).

బల్లప్ప: ఏమప్పన్నా! ఈ బైలాట చూడడానికి నా ఆవిడ ఇక్కడుంటే అట్టే విరగబడి నవ్వేదటయ్య తమ్మయ్యా! (కహ కహ నవ్వుతాడు. నంజశెట్టి కళ్ళు మిటకరించి తల ఆడిస్తాడు. బోరె గంభీరుడై వుంటాడు).

పాళెయగాండ్రు: నీ ఉద్దండతనం దోషాన్ని ఇప్పటి కిప్పుడే ఒప్పుకొంటావా మరి?

నంజశెట్టి: ఏమన్నా! ఏమిది! దండన అంతా సాంగోపాంగంగా రాసి ఒప్పించి అప్పుడే ప్రాణాలు తీసేస్తున్నాడే! ఇప్పుడు నేను నా అపరాధాన్ని ఒప్పుకొంటున్నానని ఎప్పుడు విన్నావో! – ఏమి న్యాయం?

ఏమి నీతి? ఏమి ధర్మం? ఏమి విచారణ? కానైతే మీరు మైసూరు వాళ్ళు కాదని మీరే ఒప్పుకున్నట్లయింది గదా!

[ప్రతిపక్షంవాళ్లు కుపితులై ఝుంకరిస్తారు]

పాళెయగాండ్రు: కానీ, అంతా మొదటినుంచీ యథాక్రమంగానే నడవనీ. ఏ వూరు నీది ?

బిల్లప్ప: నా అరచేయి చూడు తమ్మయ్యా! దాన్ని మీ రెవ్వరూ ఎన్నటికీ మరిచిపోవడానికి లేదు. ఏ వూరా? అప్పణ్ణ మైసూరు.

ప్రతిపక్షంలోని వీరుడొకడు: దున్నపల్లి.

నంజశెట్టి: ఆ దున్న మీ తాత. దాన్ని సంహరించి, దేశమే తనకు పూజ చేసేటట్లుగా మానసంరక్షణ చేసుకొన్న ఆ మహాతల్లి* మా కులదేవత.

[ఆ వీరుడు నంజశెట్టి గుండెలకు తన చిన్న కటారిని రంయిమని తాకిస్తాడు. నంజశెట్టి ఆయుధాన్ని చేబట్టిన ఆ వీరుని పిడికిలిని విద్యుద్వేగంతో హఠాత్తుగా పట్టుకొని లేచి నిలబడి, దాన్ని అతని వెన్నువైపుకు మడిచి భుజం త్రిప్పి, ఆ శస్త్రాన్ని కింద పడేయించి, అతన్ని వెనక్కు పడద్రోచి మొగం పగిలేటట్లు క్రింద పడేస్తాడు.]

బిల్లప్ప: (నవ్వి) తమ్మయ్యా, ఇంక ఈ పిడుగుకు నీవు బాణం సంధించ కూడదు, తెలిసిందా!

ప్రతిపక్షంవారు: (క్రుద్ధులై కత్తుల్ని ఒరనుండి బైటికి లాగుతారు.)

నంజశెట్టి: నేను చెప్పింది వెనకటి పురాణగాథనే అన్నా! ఇప్పుడు మన ఊరికి మైసూరన్న పేరే లేదు. అది ఇప్పుడు–అంటే మన మహా రాజులుంగారి పట్టాభిషేకం జరిగి రాజధాని అయినప్పటినుండి మహీ శూర పురమని ప్రసిద్ధి వచ్చింది.

---

* మహిషాసురమర్దని.

మరో వీరుడు: అక్కడుండే కుక్కలూ, పిల్లులూ, పాములూ, బల్లులూ, పురుగులూ పుట్రలూ, అన్నీ అందరూ శూరులేట గదూ!

నంజశెట్టి: ప్రత్యక్షంగా పరీక్షించి చూసుకోండన్నా!

రెండో వీరుడు: అటువంటి శూరుల శిబిరమైన మహా నగరిని ఏలుతున్న ప్రభువు ఇక్కడికి అంటే ఈ నంజగూడికి–దేవ సందర్శనార్థం బైలు దేరి రావాలంటే, ఈ ఒకే ఒక్క గవ్యూతి* శూర ప్రయాణాన్ని సాధించడం కోసంగా, తన దారిలో జమీందారులైన ఇద్దరు యఃకశ్చిత్ ప్రభువుల సమ్మతీ, అనుజ్ఞా తొలిప్రసాదంగా వారికి మొట్టమొదటే సిద్ధించి వుండాల్సింది. ఔనా?

నంజశెట్టి: అది ఓబీరాయని కాలంనాటి చరిత్ర అన్నా!

పాళెయగాండ్రు: మరి....నీ పేరేమి?

నంజశెట్టి: 'బిరుదెంతెంబర గండ' శ్రీ మన్మహీశూర పురవరాధీశ్వర శ్రీమన్మహారాజ శ్రీ ఇమ్మడీ తిమ్మరాజ ఒడెయ మహాస్వామివారి ప్రజను.

పాళెయగాండ్రు: (కనుబొమలు ముడిచి) అది నీ పేరా ఏమిటి?

నంజశెట్టి: నేను తేటతెల్లంగానే చెప్పానని నాకు జ్ఞాపకమన్నా.

[ప్రతిపక్షం వారందరూ రౌద్రాకారం పూని ఆయుధాన్ని ఎత్తి ఝళిపిస్తారు.]

బోరె: కాదు, కాదు, అతడు మా అప్పణ్ణ, నంజశెట్టి–సెనగల నంజశెట్టి.

బల్లప్ప: అబ్బా! ఆగు! నోరుముయ్యి! (పాళెయగాండ్రవైపు గిర్రున తిరిగి) మై–మహీశూర పురవాసుల కందరికీ అదొక్కటే పేరు. ఔను.

పాళెయగాండ్రు: ఏమిటా ఒక్క పేరు?

బల్లప్ప: (నిగిడి నిల్చి చేతిలోని కత్తిపిడిని నుదుటికి తాకించుకొని ఎత్తి పట్టుకొని ఘంటా ఘోషంగా) 'బిరుదెంతెంబర గండ' శ్రీ మన్మహీ

* గవ్యూతి – రెండుక్రోసుల దూరం.

శూర సింహాసనాధీశ్వరులు శ్రీ ఇమ్మడి తిమ్మరాజ ఒడెయ మహా స్వామివారి సొమ్మై, ఏక మనస్కమై, కప్పం చెల్లించే ప్రజ— అదే పేరు.

పాళెయగారు: మీ తల్లి తండ్రులు అల్లాగే నామకరణం చేసారా ఏమిటి?

నంజసెట్టి: మా తల్లిదండ్రులూ, మరి ఊళ్లోవారి తల్లిదండ్రుల వతనే వివేకం లేనివాళ్లు, పిచ్చివాళ్లు. తమ ప్రీతికనీ, ముద్దుకనీ, తమకు గల కండూతి కనుకూలంగా ఆ యీ పేళ్ళను మాకు అంటగట్టి, బాధ కలిగిస్తూ వుండడం కద్దు.

మరో పాళెయగారు: ఏం పంచాయతీ ఇది! ఈ మూడు పురుగుల్ని ఎడం కాలితో రాచి చంపి పారేయక, వాటితో సమాన స్కంధుల మన్నట్లుగా ఇంత పొద్దు ఈ వాద వివాదాలా?

నంజసెట్టి: (కత్తిని ఒరనుంచి బైటికి లాగుతూ) ఔను, మాకూ అది పర మాశ్చర్యమే!

ఒక యాత్రికుడు: ఇప్పుడు అసహాయులై వున్న ఈ ముగ్గురూ మీకు సరి సాటిగా లేకుండవచ్చు; కాని వాళ్ళ వెనుక - వాళ్ళ ఉత్సాహానికై - వాళ్ళకు అభయద రక్షకై మైసూరు మహారాజుల వంశమూ, వారి సప్తాంగ శక్తిమంతమైన ప్రచండ రాజ్యమూ? సజ్జితాలై సిద్ధంగా వున్నాయనే విషయాన్ని మఱచిపోకండి. మీరు మఱువనూ లేరు. (అందరూ నిశ్శబ్దం)

ఆ యాత్రికుడు: క్షణ క్షణానికి విజృంభించి ఐశ్వర్య శక్తి వైభవాలతో కీర్తిమంతుడై వెలుగొందు సమర్థుడా మైసూరు ప్రభువుగారి మున్నూరు నన్నూరు లెక్క గల పరివార మండలినీ, అంగరక్షక దళమునూ ఆయన సేనాసాధన సన్నాహముఽనూ, రీతి నీతులనూ చూచి, ఇతరు లందరూ మాత్సర్యంతోనూ, కడుపు మంటతోనూ కుంగిపోతూ వుంటారనే విషయం జగద్విదితమై వుంది.

[ప్రతిపక్ష వీరులు, చేతిలోని ఆయుధాల్ని, ఆ యాత్రికునీ, పాళెయగాండ్రనీ తిరిగి తిరిగి చూస్తూ వుంటారు]

బల్లప్ప: ఈ దొరల దొరల మధ్య సంఘర్షణ, మీ కెందుకు మెదలకుండా పొండి.

నంజసెట్టి: మహీశూర మహా ప్రభువులవారు నీ అభిప్రాయాభినందనల ప్రోత్సాహంతో, అనుమోదంతో, ప్రశంసలతో జీవించవలసిన పని లేదు! నడు బైటికి!

ఒక వీరుడు: అతడూ దున్నపల్లి నాగరికుడై వుంటాడు.

ఆ యాత్రికుడు: కాదు; మాది ఐగూరు – మరి ఛప్పన్న దేశాలనుండీ వచ్చి గుమిగూడి వున్న ఈ యాత్రికుల మహాసభలో ఈషదపి, అన్యాయం, మోసం, కృత్రిమం, దౌష్ట్యం, అధర్మం – ఏమైనా తలెత్తుతే, మీకూ ప్రభువుల కందరికీ ఆ చంద్రార్కస్థాయిగా, అపఖ్యాతి తప్పదని గుర్తు పెట్టుకోండి.

మరో వీరుడు: ఆ బోడి బోడన్నను పట్టుకొని చేతులూ, కాళ్లూ తలా అన్నింటినీ ఒక్కొక్కటిగా లాగి పెటికి, ఈ ఊరి కోట గుప్తద్వారానికి తోరణంగా కట్టి మరీ విడిచిపెట్టాల్సి వుంటుంది.

ఇంకో వీరుడు: ఔను. ఏమి వాగడం!

మరో వీరుడు: ఇతన్ని ఇక్కడికి పిలిచిన వారెవరు?

పాళెయగారు: నువ్వేం ఆ ఆర్భాటం బిరుదు మీ ఊరి రాజుగారిది మాత్రమే అని ఇప్పటికీ మొండిగా మంత్రం వేసి దండోరా మోగించి చెబుతున్నావా?

నంజసెట్టి: కాక మరేమిటి?

బల్లప్ప: (నవ్వి) ఔను.

పాళెయగారు: ఏమిటా బిరుదు?

నంజసెట్టి: మా శ్రీ మహారాజులుంగారి ఆ బిరుదు ఏమిటి అని ప్రశ్న వేసే గర్విష్ఠి అయిన వీరునికి తనదంటూ ఒక్కటైనా బిరుదు ఉండి వుండాలి. అట్లైనచో ఆ ప్రశ్నవేసి ఆర్భాటాలు చేసే ఎవరు కూడా, మేముగా విచారింపనిదే మౌనంగా వుండవలసి వుంటుందని, ఖచ్చితమైన కఠోరాజ్ఞ!

పాళెయగరు: మాకూ బిరుదులున్నాయి బోలెడు.

నంజసెట్టి: (ముసిముసి నవ్వుతో) ఎక్కడ – స్తోత్ర పాఠం కానీ!

[ఆ పాళెయగారి పాఠకులు చేయెత్తి]

స్వస్తిశ్రీ మన్మహా ప్రచండ యుద్ధోద్దామ విజయశ్రీ విలాస!
పరాక్రమ ప్రతాప కవి కుమార!
వైరి రాజ గజ కంఠీరవ!
అప్రతిమ శూర!
శరణాగత సంరక్షక!
సాహిత్య విద్యాధర!
చతుఃషష్టి కలాప్రవీణ దేవోత్తమ!
ఆదిత్య సమాన తేజ!
శ్రీమన్మహా రాజాధిరాజ!

నంజసెట్టి: అయిందా? (సర్వులూ మౌనంగా వుంటారు)

నంజసెట్టి: (గంభీర స్వరంతో)అట్లా అనేవాళ్లకు మొగుడొక్కరే శ్రీమన్మహీ శూర పురవరాధీశ్వర శ్రీమన్మహారాజ శ్రీ ఇమ్మడి తిమ్మరాజ ఒడెయ మహా ప్రభువులు. పలు పదాల్ని తనయందొదిగించుకొనే ఏనుగు పదంవలె, ఎన్నో ఏఱులను, నదులను అంతర్భూతం చేసికొనే మహా సాగరంలా, అనేక బిరుదుల వృథా ప్రలాపాన్ని నిరాకరించి, కోటి కోటి బిరుదులను ఏకాపోశన చేసి ఆనందపడి ప్రకాశించు–'బిరుదం తెంబర గండ' అనే మహా బిరుదు శ్రీమన్మహీశూర మహారాజ వంశానికే గాక ఇతరులెవ్వరికీ చెల్లదండీ! (చుట్టూ చూసి) వినిపించిందా?

బల్లప్ప: ఊఁ! ఔను; నిజమంతే!

నంజసెట్టి: బిరుదున్న మరెవ్వరైనా తిరిగి వినేటట్లు దయచూపాలి అన్నా! (రెండవ పాళెయగారు కళావిహీనుడై ఔడుగఱిచే ముందే, పాళెయగారిని తిరస్కారదృష్టితో అవలోకించి, తనవారికి కనుసైగ చేసి, కరవాలం చేబూనును)

[రెండవ పాళెయగారి స్తోత్ర పాఠకులు]

స్వస్తిశ్రీ మచ్చుతుస్సముద్రాధీశ్వర సార్వభౌమ!
ఉద్దణ్డ భూపాల నీలోత్పల వన మార్తాండ!
అన్యరాజన్య హృదయభేదన సింహనాద విజృంభణా
ధీరోదాత్త ధరాధిప లలాట పట్టాంచిత బ్రహ్మ లేఖన!
వీర చూడామణి! సద్ధర్మ నీతి సదాచార పరిపాలక!
పరమ శృంగార కలా విచక్షణ! సులక్షణ సౌన్దర్య సాంగ మన్మథ!
బిరుదెంతెంబర గండ!

నంజసెట్టి: అంతు - ఎంబర - గండ, అంతెంబర* గండ, శ్రీమన్మహీశూర సింహాసనాధీశ్వర శ్రీ ఇమ్మడి తిమ్మరాజ ఒడెయ మహాప్రభూ!

[లీలగా వంగి, సెనగలరాశిలో వున్న వెదురు పల్లికనుండి, కొల పాత్ర ఎడమచేతితో చటుక్కున తీసికొని, కుడిచేతి కటారుతో దాని అడుగున దడదడ వాయించుతూ, శ్రుతి రాగ తాళ లయాదు లలో ఏ ఒకటీ లేకుండ, వికారస్వరంతో పాడ నారంభిస్తాడు]

అంతెంబర గండ - శ్రీ మహీశూర తిమ్మరాజ ఒడెయరు!
బిరుదెంతెంబర గండ - మహీశూర తిమ్మరాజ ఒడెయరు!

బల్లప్ప: (మొగం విప్పారజేసి, ఖడ్గముయొక్క పిడితో ఎడమ మోచేతిమీద తాళము వేస్తూ, నేపథ్యగానంగా అక్లే అనే కేకపెట్ట నారంభిస్తాడు)

నంజసెట్టి, బల్లప్ప: తమ బిరుదు - అంతు - ఇంతు - ఎంబెర గండ! బిరుదం తెంబర గండ - మహీశూర తిమ్మరాజ ఒడయరు! ఓహో! అంతెం బర గండ - శ్రీమన్మహీశూర మహారాజ శ్రీ ఇమ్మడి తిమ్మరాజ ఒడెయరు మహాప్రభూ! (తిరిగి తిరిగి, ఊగ్గడిస్తారు)

[పాళెయగాండ్రు, వారల పరివారజనం, వీరులు కోపావేశంతో ఆయుధాల్ని దూసి, ఝళిపించి నంజసెట్టి, బల్లప్పల వైపు దూకు

---

* అంతు = అట్లు ఇంతు = ఇట్లు ఎంతు = ఎట్లు ఎంబర = అనువారికి గండ = మగడు. మా బిరుదు లిటువంటివి, అటువంటివి అనే వాళ్ళకందరికీ మగడు-అని అర్థం.

—అనువాదకుడు.

తారు. మిగిలినవారు అనేకులు పలాయనమంత్రం పఠిస్తారు. కొందరు దూరంగా ప్రేక్షకులుగా నిలబడి నిరీక్షిస్తుంటారు. తమ తమ ఆయుధాల్ని సిద్ధపరచికొని, కొందఱు పాళెయగాంద్ర వైపూ, పలువురు స్త్రీ బాల వృద్ధ నిరాయుధులను రక్షించుకో డానికి అనువుగా పోయి నిలబడివుంటారు. నంజసెట్టి కటారు, కొలపాత్ర వెనగల కుప్పపై పడేసి, సమీపంలోనున్న శత్రువుల ఇరువురి చేతులనుండి రెండు ఖడ్గాల్ని విద్యుద్వేగంగా లాగివేసి కొని, పట్టావరస త్రిప్ప నారంభిస్తాడు. బల్లప్ప. బోరె, ఇరు వురూ వామ భుజాలపైనుండి నారిగూర్చిన ధనువులనూ, వీపులపై నుండి అంప పొదుల్ని క్రిందికి జార్చి, కత్తి పిడిని రెండుచేతుల్లో పట్టుకొని కత్తి వరసలు త్రిప్పుతూ వుంటారు. ప్రతిపక్షంవారంతా ఆ మహీశూర యుద్ధ విద్యా విశారదులను చుట్టుముట్టి, వారు వెనక్కూ ముందుకూ ఎడమవైపుకూ కుడివైపుకూ స్వేచ్ఛగా పోయినట్టల్లా తామూ వెనక్కుపోతూ, ముందుకు వస్తూ, ఇటు నటు పరుగెత్తుతూ మౌనంగా నుంటూ, అదలింపుల్ని అవాచ్యా లైన శాపనిందాదికాల్ని కూసి, అరచి వినిపిస్తూను ప్రచండమైన వేగంతో థళథళలాడుతూ ఆ వరసలు దిరుగు యోధమండలాల్ని కొట్టి ఛేదించి విడువాలనే ఆశతో వాని లోపలికి ఖడ్గాల్ని, కట్టారు లను, ఢాలు తూణీరం, ఒర మొదలైనవాటిని సరభసంగా వేయ డానికి ప్రయత్నిస్తూ, బల్లెములతో విల్లులతో బొడువ సాహ సిస్తూ పోరాడుతుంటారు. కొందరు ఆ వరస సాధనాల ఝళిపింపు లలో ఏదోవిధంగా చిక్కువడి హతాహతులై బొబ్బలిడికొంటూ ధరాశాయులగుతూ వుంటారు. బైట యుద్ధ నినాదాలూ, కోలా హలమూ రేగుతుంది. మహీశూర సైన్యాధిపతియొక్క నేతృ త్వంలో సర్వాయుధ సజ్జితులైన సైనికులు నెత్తురోడు శస్త్రము లను ప్రయోగిస్తూ పడద్రోసికొంటూ వస్తారు.

మహీశూర సైన్యం రెప్పపాటులోపలనో యన్నట్లు ప్రతిపక్షం వారితో కదనమాడి, వారినందర్నీ నిరాయుధులుగా నొనర్చి గట్టిగా కావలిగాస్తూ వుంటారు.

సపరివారంగా శ్రీమన్మహీశూర మహారాజ శ్రీ ఇమ్మడి తిమ్మ రాజ ఒడయని ప్రవేశం. మహీశూర సైన్యం వీరవందన మొన రిస్తుంది. ఆగతులెల్లరూ రుధిర ప్లావితములైన స్వీయాయుధ తతిని నూరి నిలబడి ఆ మహోశ్చర్యకరమైన పటావరసల వేగ విజ్ఞాన చమత్కారాల్ని అవలోకిస్తూ వుంటారు. నంజసెట్టి, బల్లప్ప, బోరె తటాలున తమ అభ్యాసాల్ని నిలిపి, ఖడ్గతతిని దాచి, జోడించిన సుదీర్ఘ హస్తాలతో వంగి నమస్కరిస్తారు. ఈష త్కాలం నిశ్శబ్దం.]

మహారాజు : ఏమిది ?

బల్లప్ప : బుద్ధిమంతులదైన ఈ ఊరి రాజప్రాసాదమునకై నియుక్తులమైన రక్షకభటులం మేం మహాప్రభు !

మహారాజు : ఎవరు ?

బల్లప్ప : నేను, ఈ బోరె మహాప్రభు !

మహారాజు : ఇప్పు డీక్కడ ?

బల్లప్ప : ఈ ప్రభువులు పాళెయగాండ్రు. మీ రెల్లరు తమ సహస్ర బిరుద ముల అంతెంబర గండ, బిరుదెంతెంబర గండ అంటూ పొగడించు కొంటున్నారు మా ప్రభు ! అది మాకు మనస్కరురాక, సైరింపలేక, ఆ బిరుదు బుద్ధిమంతులకు గాక, కుర్రవాండ్రకు చెందదని ప్రతిఘటి స్తున్నాం. మహాప్రభు అందుకై ఇదంతా మే మీ విధంగా దర్పించి వుండడం (చుట్టు చేయి విసురుతాడు)–

మహారాజు : అత డెవరు ?

బోరె : అతడు మన అప్పణ్ణ మహాప్రభు !

మహారాజు : అప్పణ్ణ ! ... ఏ వూరు మీది ?

నంజసెట్టి: మహీశూరపురం – మా స్థలం మహాప్రభు.

మహారాజు: మహీశూరపురం!

నంజసెట్టి: మహాప్రభూ! బిరుదెంతెంబర గండ శ్రీమన్మహీశూర పురవరాధీశ్వర శ్రీమన్మహారాజ శ్రీ ఇమ్మడి తిమ్మరాజ ఒడయ మహాప్రభువుల వారి ప్రజ – నేను.

మహారాజు: (ప్రఫుల్లంగా) ఊఁ. నువ్విక్కడ చేయుచున్న దేమి?

నంజసెట్టి: (చేయి చూపించి) మాది సెనగల వ్యాపారం మహాప్రభు.

మహారాజు: అనగా నీవే నంజసెట్టివా ఏమి?

[ నంజసెట్టి చేతిలోని ఆయుధాల్ని క్రిందపడేసి, వంగి ముకుళితాలైన దీర్ఘీకృత హస్తాలతో నమస్కరిస్తాడు. ]

మహారాజు: మరి అప్పణ్ణ అనగా?

బోరె: (సంతోషంతో) అవును మహాప్రభు. అతడు మన అప్పణ్ణ (నంజసెట్టి మొగం ఎర్రవడి మెడ శ్రద్ధగా వంచుతాడు).

బల్లప్ప: (నవ్వి) మహాప్రభూ! ఆయన తండ్రిగారు ఆయనకు నంజసెట్టి అంటూ నామకరణం చేసారు. ముద్దుపేరు అప్పణ్ణ. ఇప్పు డింట్లో మే మందరమూ అప్పణ్ణ, అప్పణ్ణ అనే పిలుస్తాం మహాప్రభు.

మహారాజు: అప్పణ్ణ. ఏ పేరులోను మూలతః సారమేమి లేదు. ఒక పేరు ధరించిన ఒక వ్యక్తి యొక్క గుణదోషముల సత్త శక్తుల గూడి, దాని కొక వైశిష్ట్యం కలిగి, అది లోకం యొక్క కృతజ్ఞతకో, నిందకో గురి అవుతుంది. (చిర్నగవుతో) ఉదాహరణకుగా ఇంక ఈ నిమిషం నుండి అప్పణ అను పెద్దవాళ్ళు పెట్టిన ఆ ముద్దుపేరుకు మహీశూర బిరుదెంతెంబరణ గండ' అను విశేషణం సొంపైన స్వారస్యంగా వుంటుంది.

నంజసెట్టి: నాకే! ఆ బిరుదే? మహాప్రభు. శాంతం పాపం! శాంతం పాపమ్!!

మహారాజు: (నవ్వి) ఆదుర్దా అప్పణ్ణ. మహీశూర సింహాసనాధీశ్వరులకు గాక చెల్లదు, బిరుదు–అంతు–ఇంతు–ఎంబర–గండ, బిరుదెంతెంబర

ప్రాసాదమునకు చెందిన పంచకలశాల అందలం ప్రవే శిస్తుంది. ]

వాహకులు: [అందలము దింపి, వెనకతట్టుగా నిలబడుతారు].

[మొదటి పరిచారిక అందలంలోని రాణిగారి ఎర్ర మకమల్లు మేలిముసుగునెత్తి సవరిస్తుంది. మాదేవమ్మణ్ణి దిగి వస్తుంది. అందరు నత శిరస్కులై వుంటారు పరిచారికలు చుట్టూ బలిసి కొని ఆమె వస్త్రాభరణములను సరిదిద్ది సరిచేస్తూ వుంటారు. మరి యొక పరిచారిక పసుపు, కుంకుమ, గంధ, పుష్పతాంబూల ఫలాక్షతాదికములున్న బంగారు తట్టను మా దేవమ్మణ్ణి ఎడమ చేతినుండి తీసికొని అటువంటిదే పూజాసామగ్రులున్న కలశము, అద్దము, ముఖవస్త్రము మొదలైన వున్న తట్ట, రాగిపళ్లెము లను ఇతర స్త్రీల కిచ్చి, తానూ ఒక దానిని తీసుకొంటుంది.

మాదేవమ్మణ్ణి మహారాజునూ, పాళెయాగాంద్రనూ చూచి ముత్యాల మేలి ముసుంగు చెరగు లాగుకొనుచు మెడవంచి వెలు వడుతుంది. ]

కైవారజనము: (నిలబడి బాహుదండముల నెత్తి) ఓహో! 'అవధాన'! ఓహో! 'సావధాన!' స్వస్తిశ్రీ మహామండలేశ్వర! గజబేణ్టెకార! జవాదికోళాహళ! ఘేణాంక చక్రేశ్వర! అరసంకసానెగార! పేసాళి హనుమ! సంగ్రామభీమ! చేర చోళ పాండ్య మూవరు రాయర గండ!

నీలగిరి సాధకరొడెయ! సౌరాష్ట్రపురవరాధీశ్వర! హోయి సళ మహారాజ్యాధిపతి! శ్రీమన్మహారాజ! శ్రీ వీర! శ్రీ మల్లరాజ ఒడెయ ప్రభో!

నంజసెట్టి: అంతెంబర గండ[1] శ్రీమన్మహీశూర పురవరాధీశ్వర శ్రీమన్మహా రాజ శ్రీ ఇమ్మడి తిమ్మరాజ ఒడెయ మహాప్రభువులకు జయమగు గాత!

---

1. అంతెంబర గండ = ఏవంవిధ ప్రశస్తి గల వారి మగడు.

మాదేవమ్మణ్ణి : (మేకు గొట్టినట్లు నిలబడి, వెనక్కు తిరిగి నంజసెట్టిని నఖ శిఖాంతం ఏకాగ్రంగా చూచి) అతడేనా ఏమి। ఆ విధంగా వాగువాడు ?

జగ్గయ్యనాయకుడు : ఔను మహాతల్లి.

మాదేవమ్మణ్ణి : (దర్పముతో) అతని నాలుక నిప్పుటి కిప్పుడే – ఈ నిమిష మందే ముక్కలు ముక్కలు చేసి గద్దలకు, కుక్కలకు విందొనర్తురు గాత.

జగ్గయ్యనాయకుడు : మహాతల్లీ !

మాదేవమ్మణ్ణి : (దర్పంతో) ఊఁ, పొమ్ము.

జగ్గయ్యనాయకుడు : (వంగి నమస్కరించి) చిత్తము మహాతల్లి.

**[ఛురికను ఒఱనుండి దూసికొనుచు నంజసెట్టి వైపుకు వెళ్లుతాడు.]**

సైన్యాధిపతి : (వేగముగా ముందే తన రక్తమయ ఖడ్గమును జగ్గయ్య నాయకునికి అడ్డంగా నొడ్డి మృదుహాసముతో) పయన మిదే కడకు ? వీరసేనాధిపతి ?

జగ్గయ్యనాయకుడు : శ్రీమన్మహా మండలేశ్వర అరనాకసూరెగార ఇత్యాది బిరుదాత్మకులైన శ్రీ వీర, శ్రీ మల్లరాజ ఒడెయ ప్రభువులవారి కాశ్రయ స్థానమైన గౌరవ మర్యాదా ప్రతిష్ఠలకు మాత్సర్యవడి, నిర్హేతుక ముగా కీడెంచిన ఆ – అతని నాలుకకు తగిన ప్రతీకార మొనర్చి, ఉమ్మత్తూరు రాజతేజస్సును, ప్రభుసత్త్వమును, ఉత్సాహశక్తిని, పరాక్రమవేగమును, ఎందుకైనను, ఎట్టులైననూ కీడ్పఱచు నవ హేళనమాడు సాహసము, ఒక్క నిమిషమైనను ఆశాసితమై వుండ నేరదను విషయ మీ విస్తారమైన వీరలోకమునకు శిక్ష గఱపుటకే మా యీ దండయాత్ర.

నంజసెట్టి : (చేతులు చఱచి చప్పట్లు కొట్టి అట్టహాస మాడుతాడు.)

**[ఉమ్మత్తూరు వారందరు ఉత్కటంగా కోప ఘూర్ణితులై పళ్లు పటపట కొఱకుతారు].**

జగ్గయ్యనాయకుడు: (తన చురికతో, అడ్డపడిన ఖడ్గమును ఓ ప్రక్కకు నెట్టుటకై ప్రయత్నిస్తూ) దారి విడు!

సైన్యాధిపతి: ఈ బిరుదగానము యొక్క ఋణము తీర్చు కడింది మగటిమి ఆయుధధారులైన పోటుమగల నాయకత్వమున నడవనిండు, ఆ పిమ్మట దండయాత్ర జరగనిండు, వీర సేనాపతీ!

మాదేవమ్మణి: (ఎఱ్ఱవడిన మొగంతో విస్ఫారితనేత్రయై రూక్ష కంఠంతో) ఉమ్మత్తూరు రాజప్రాసాద మందలి రాణివాసము కూడ మైసూరు ఒడ్డోలగమందు శోభించు పౌరుష వేషము దాల్చిన నామధారకులైన ఆ ప్రాణులకు శౌర్య ప్రతాపములందు కొంచెమైనను తీసిపోదని స్పష్టముగా చాటిచెప్పు జగ్గయ్యనాయకా!

మహారాజు: అమ్మయ్య! శాంతచిత్తలుగండు అటువంటి ఈ ఆర్భట వాచాలతతో ఏ రాజప్రాసాద గౌరవ మర్యాదలును, చ్యుతినొందజాలవు.

మాదేవమ్మణ్ణి: (కన్నులు నిప్పులు గురియ, స్వర్ణఫలకమును ఊపి, తటాలున ముందుకు పెట్టి, వంగి, ఒక ఖడ్గమును చేబట్టికొనిపోయి, మహారాజుగారి కట్టెదుట వీర పద్ధతి సూచించు నొయ్యారమున నిల్చి, కత్తి ఝుళిపించి, సంకేతమాడి, న్యస్తాలీఢ పాదయై, హుంకరిస్తుంది.)

(సర్వులూ స్తంభీభూతు లౌతారు)

మాదేవమ్మణ్ణి: ఈ నారీ హస్తమున ఈ ఖడ్గమును గాంచినంతనే మైసూరు వారి ఉద్ధత రక్తము మురికి తూములోని చల్లని నీరై మైమఱచిపోయి, గుప్తగామినియై పోయిన దోటు!

మహారాజు: (మందహాసముతో) అవును; అమ్మయ్యా! అది నిజమైన మాట. (చేతపట్టిన ఖడ్గమును కటిపట్టికకు తగిల్చిన యొరలోనికి సశబ్దంగా దూర్చివేస్తారు)

[జగ్గయ్య నాయకుడు వెనకకు తగ్గి నిలుస్తాడు. మాదేవమ్మణ్ణి రోషోన్మత్తురాలై ఖడ్గమును మహారాజులుంగారి తలపై కెత్తుతుంది. ఎల్లరూ, హాహాకారా లొనరిస్తూవుంటారు. సైన్యాధిపతి, సైనికులు, నంజసెట్టి మాదేవమ్మణ్ణి పైకి పోతారు. మహారాజు

కంటి బెదిరింపులతో తనవారి నందరిని గద్దించి నిలువరించి వెనక కు పంపించివేస్తారు. ఉమ్మత్తూరు యోధులు, మల్లురు, యుద్ధ సన్నద్ధులై వుంటారు. జగ్గయ్య నాయకుడు, పరిచారికలు, మా దేవమ్మణ్ణి వెనకనూ రెండు ప్రక్కలనూ కృతాంజలిపుటంతో]

మహాతల్లి! మహాతల్లి: ప్రాజ్ఞులు! ప్రాజ్ఞులు! సర్వం తెలిసినవారు!

మాదేవమ్మణ్ణి: (పరుషకంఠంతో) ఇప్పుడైనా యుద్ధం చేస్తారో లేదో? (మహారాజు ఎదపై చేయిడుకొని, తలవంచి, భయపడకుండును. మా దేవమ్మణ్ణి ఖడ్గపు కార్మొనను మహారాజు ముఖం చుట్టూ భుజకీర్తులపైనా వృత్తాకారంగా త్రిప్పి, మూడేసి మారులు నివాళించి, దానితో అతని ఉష్ణీషాన్ని ఎగురగొట్టివైచి, తిరస్కార సూచకమైన వికటహాసంతో ప్రకాశించి) ఏమి శౌర్యప్రతిష్ఠ! ఎంతటి ప్రాభవ ప్రభావములు ఎట్టి ఆత్మాభిమానము – ఓ పిఱికివాడ! అత్యద్భుత శ్రేణికి చెందిన 'బిరుదెంతంబరగండం'! (తటాలున మహా రాజునకు వీపు వెట్టి నిలుస్తుంది)

[మహీశూర సైనికు లెల్లరు మొగము విన్నదనముదోప, పండ్లు కొఱికి, ఆ రక్తాక్షులై సైన్యాధిపతివైపు చూస్తారు]

సైన్యాధిపతి: ఉమ్మత్తూరు సేనాపతీ! ఈ పట్టణము నందలి అత్యా చారానాచారాలకు తలవంచు క్షమాప్రార్థనం మీ ప్రభుశ్రీలైన వీరమల్లరాజ ఒడయరునుండి శ్రీమన్మహీశూర సింహాసనాధీశ్వర మహాప్రభువులు ప్రతీక్షించు మైనది.

మాదేవమ్మణ్ణి: ఆహా! ఎటువంటి మొనగాని తనం! నీవు కలలుగన్న ఆ విచిత్రమైన క్షమా ప్రార్థనమును, సాధించుకొనెడు కడింది నేర్పరితనం (తన వెన్ను వెనకతట్టు పిడికిటి బొటనవ్రేలు ఆడించి[1] చూపి) ఈ బడాయిగొట్టు క్లీబ మహిషానికుంటే, ఇందుకై కడింది మగటిమి, మొనగానితనం ప్రదర్శింపనిండు.

1. అవహేళన సూచకమైన చేష్ట, అంగూఠాదిఖానా అని హిందీ ప్రయోగము. సింగట్టా చూపించడం - అని తెలుగు వ్యవహారం కలదు (?)

నంజసెట్టి : అప్పటికి 'మొనగాడు' అను బిరుదుకూడ శ్రీమన్మహీశూర మహారాజ వంశమును వఃచివచ్చి కృతార్థమైంది.

మాదేవమ్మణ్ణి : (వికటహాసంతో) అబల ! ఆడుది ! కరుణించునది.

నంజసెట్టి : కుప్పలో దొరికిన రత్నమూ, రత్నమేగా!

సైన్యాధిపతి : ఆపు ! (నంజసెట్టి వ్యగ్రుడగును)

మాదేవమ్మణ్ణి : జగ్గయ్యా నాయకా ! ఈ మైసూరు దున్నల నన్నింటినీ గొర్రెపోతులనువలె బలి యివ్వకుండ నీ విధంగా వేసటపడుట ఎందులకు ?

జగ్గయ్య నాయకుడు : మహాతల్లి ! శ్రీ వీరప్ప ప్రభువు లిప్పుడే వత్తురు.

మాదేవమ్మణ్ణి : మా ఆజ్ఞ చాలదా ఏమి ?

జగ్గయ్య నాయకుడు : మహాతల్లి.

మాదేవమ్మణ్ణి : నీవేమి గ్రుడ్డివో, ద్రోహివో, పిఱికిపందవో, అని ఒక గడ్డు సమస్య అయియున్నది; మేము వీరివైపు కదనానికెత్తి వచ్చినతోడనే ఆ బందీలైన వీరప్రభువు లిర్వురూ మనపక్షమైపోరగలరను విషయం నీకు స్ఫురించలేదా ఏమి ?

[మహీశూర పురానికి చెందిన వారందరూ చిరునవ్వు లొలుక బోసారు.]

జగ్గయ్య నాయకుడు : మహాతల్లీ ! వెనుక ముందులు చూచి వివేచింపనిదే, ఏ కార్యానికి గాని తొందరపడుట హితకరం గాదు. సాంగో పాంగముగా విషయ పరామర్శము జరగాలి.

మాదేవమ్మణ్ణి : (అయిదారడుగులు ముందుకు వైచి, ఎటునెటో పరికించి, కనుబొమలు ముడివైచి) మైసూరు వారి ఇంత దొడ్డ ఫౌజు ఇక్కడ – ఈ పుణ్యక్షేత్రంలో సర్వసన్నాహ భరితమై చేరి పంక్తులు దీరి విడిసేవరకు ఈ ప్రభువులూ మనవారూ గడ్డికఱస్తూ వుంటారా ఏమి ?

జగ్గయ్యనాయకుడు : మహాతల్లి ! ఈ నిష్ఠుర నిందలనుండి ఇప్పు డెవరికినీ, ఏ మేలును చేకూరేట్లు లేదు: మైసూరు రాజు లివ్విధంగా విశేష

పరివారమూ సుసజ్జితమైన కావలి ఫౌజులేక ఏనాడును, ఇక్కడికి వచ్చేది లేదనే సంగతిని మనం మఱచిపోకూడదు.

మాదేవ : పిఱికిపోతా! (ఖడ్గాన్ని దూరంగా విసరి ఊపి పొంగివచ్చు నాక్రోశంతో, అశ్రుపూరితనయనయై హస్తయుగంతో గుండెలు బాదుకొంటూ) నేనొక్క మగవాడనై పుట్టి వుండరాదా! అయ్యో!

మహారాజు : అది మా దౌర్భాగ్యము, అమ్మయ్య! - మరి ఈ దుఃఖ ప్రకటనముచే మీ వీరపతి ఆ బల్లాళతనంపు గరిమగల శ్రీ వీరమల్లరాజ ఒడయరుకు మీరు ముక్కు కోసినట్లైనది.

మాదేవ : (శరీరం కంపింప) అయ్యో! (బైటికి పెద్ద కేక పెట్టుతుంది).

[సకలాయుధ సన్నద్ధుడు, దూరప్రయాణములో ధూళిలో స్వేద జలములో స్నాతుడైనవాడు. ఖడ్గహస్తుడూ, డాలు పిడి పట్టుకొన్నవాడూ, కొంచె మూగాడుచూ మోయువాడునై యున్న ఉమ్మత్తూరు శ్రీ వీర శ్రీ మల్లరాజుఒడెయరు కలియ గోరు నంజలి ముద్రతో ప్రవేశం. సైన్యాధిపతి మల్లరాజును వెన్నంటి వచ్చిన విచ్చుకత్తుల వారిని కనుసైగచే వెనకతట్టునకు పంపించి వేస్తాడు. ఉమ్మత్తూరు వారందరు మల్లరాజునకు తగిన రీతిని వందన మొనరిస్తారు.]

మల్లరాజు : (చుట్టు పరికించి జగ్గయ్యనాయకుని దగ్గిర నిలిచి) ఏమైంది?

జగ్గయ్య : (సమీపించి మల్లరాజు చెవిలో చేయి చాటిడి రహస్య మేదో చెప్తుతాడు).

మల్లరాజు : (వివర్ణుడై మహారాజు వైపు తిరుగుతాడు).

మహారాజు : (ప్రసన్నవదనుడై) ఆరోగ్యమే. మల్లరాజా! రమ్ము.

మల్లరాజు : మహారాజా! (నాలుగారడుగులు ఎదురువెళ్ళి క్షేమాలింగన మొనరిస్తారు. ఉమ్మత్తూరు మహీశూరపురము లందలి సర్వులూ, వంగి దీర్ఘీకృతహస్తులై అంజలించి నమస్కరిస్తారు).

---

1. ముక్కు కోయుట - మానభంగము చేయుట-నాక్ కాట్నా (హిం)

మల్లరాజు : (అచ్చెరువున నవ్వి) మే మిప్పుడు ఇక్కడ ఎట్లు వర్తించవలెననునది ఒక గహనసందర్భమై తోస్తోంది; మీరే మాకు మార్గదర్శకులు గావాలి.

మహారాజు : (వ్యథతో) మల్లరాజా! ఆ మా ఉష్ణీషమును మీరే స్వహస్తముల గ్రహించి మాకు ధరియింపజేయవలసి యున్నది.

మల్లరాజు : మేమే.

మహారాజు : ఔను.

మల్లరాజు : (ఆయుధాన్ని పైకెత్తి ఖడ్గయుద్ధారంభమును సూచించి, సిద్ధముగా నిలిచియుంటాడు.)

మహారాజు : (చేయి చాపి దగ్గిరనున్న సైనికు నొక్కని బల్లెము నిప్పించుకొని, దాని మొన యడుగు భాగాన కాలుపెట్టి తానే విరిగి పడియున్న చెట్టుకొమ్మను తీసికొని పరీక్షించి త్రిప్పి – కంటితో కొలిచి పోల్చి చూచి, మల్లరాజువైపు ముందుకుసాగి మీదపడును. మల్లరాజు, మహారాజు పట్టుబట్టి 'ఖడ్గాదండి' యుద్ధ మొనరిస్తారు. మహారాజు నిరాయుధుడైన మల్లరాజు నెదకు తన చేతి బల్లెపు మొనను ఒత్తి అతనిని వెనుకకు నెట్టి, ఆ పచ్చి లేగొమ్మను విసిరివేసి, వెనుదిరిగి ఉత్తరీయపు టంచులతో నుదుటిని తుడుచుకొంటాడు. సేవకులు, మహారాజునకు శైత్యోపచారము లొనరిస్తారు. మల్లరాజవాఙ్ముఖుడై పోయి మహారాజు నుష్ణీషమును రెండు హస్తముల నెత్తి తెచ్చి, సైన్యాధిపతి చేతి కిచ్చి అట్లే నడిచి పాళెయగాండ్రతోటిపాటు నిలబడుతాడు. మహారాజులుంగారు సైన్యాధిపతి యొసంగిన శిరోవేష్టనమును ధరియింపిచుకొంటారు. మహీశూరవాసు లందరు, వంగి దీర్ఘీకృత హస్తములంజలించి వందన మాచరిస్తారు.)

మహారాజు : రూఢిప్రకారం అతని ఏనుగు, గుర్రము, అందలము మొదలైన వన్నింటిని, స్వాధీనపఱచుకొనవలసినవే యైనా, ఆయన గౌరవ ప్రతిష్ఠలకు భంగంరాని యట్లుగా అవశ్యకములైన వస్తు వాహనముల నమర్చి యప్పగించి, దానమీయ దగును.

సైన్యాధిపతి : చిత్తం మహాప్రభు !

మహారాజు: నేటి సాహసికవృత్తి తిరిగి ఆవేశించి ఏవంవిధ సంకటానికి పునః పాల్పడకుండునట్లు ఉమ్మత్తూరు పాళెములో ఎల్లపట్టాలమీద వచ్చెడు రాజస్వములో నాల్గవ భాగాన్ని, తాను ఎవరిమీదనైనా, పేరాసతోడ దండెత్తి పేర్చిన దేశకోశ ధనకనక వస్త్రభూషణ ధాన్యాదుల్లో సమభాగాన్ని మహీశూర రాజప్రాసాదానికి పాజు కప్పంగా ఆయన తప్పక చెల్లిస్తూ వుండాల్సి వుంటుంది.

మాదేవ: (తీక్షణమైన కటకటతో) అయ్యో!

సైన్యాధిపతి: చిత్తం మహాప్రభు!

మహారాజు: పూర్వంనుండీ నడిచివస్తున్న దేవదాయ బ్రహ్మదాయ ధర్మదాయముల సంపూర్ణానుపాలనం, సర్వమాన్య భట్టమాన్యముల కాన్కలు, రక్తదానం మొదలైనవేమియు ఎచ్చు తగ్గులు కాగూడదనీ ఏ ఒక్కటీ పాజుకందాయంలో అంతర్భవింపదనీ, మన కరణికులు తెలిసి జాగరూకులై వుండవలసి వుంటుంది.

సైన్యాధిపతి: చిత్తం; మహాప్రభు!

మహారాజు: ఈ అర్థం కలిగివున్న ఆయన స్వీయ హస్తాక్షరాల భాషాపత్రానికి వీరందరూ, గౌడప్రభు సామంత పాళెయగాండ్ర చేర్వాళ్లు గల సాక్ష్యాల్ని, వారివారి రాజముద్రలతో పాటు చిహ్నితంచేసి, మాకు చూపింపవలసి వుంటుంది.

సైన్యాధిపతి: చిత్తం దేవరా!

మహారాజు: ఎప్పటివలెనే రేపటి రథోత్సవమున, మన ఆహ్వానాంతమున ప్రయాణ తాంబూలం గ్రహించేదాక, ఈ అందరూ మన రాజప్రాసాదంలోనే సగౌరవ రాజమర్యాదల కతిథులై వుంటారు మరి!

సైన్యాధిపతి: భవదాజ్ఞ మహాప్రభు!

మహారాజు: ఇంక వారినిద్దరినీ ఇటు రమ్మనమను......హుణసనాడుకు చెందిన సిద్ధరాజయ్యా! సిందువళ్ళికి చెందిన సర్వాధికారి రాజయ్యా

దొర! మీ ఇద్దరినీ మేము ఏనాడో సామంతులుగా తెచ్చుకొన్నప్పటికీ మా ముద్ర వహించి మా సంరక్షణలోనే వుండే మీరు సుఖంగా నుండ నిష్టంలేక అడుగడుగుకూ ఉద్వృత్తులైన ఈ అహితులతోడనే చేరుకొంటూ మా పైన కత్తినూరి, ద్రోహాన్ని తలపోసి ప్రయత్నిస్తూ వుండడం బహుళ విషాదకరమైన విషయం.... అందులోనూ, రాజయ్యదొర! మీరు మా తమ్ముజిగారైన యువరాజ శ్రీ చామరాజ ఒడయరువారి శ్వశురులై – మాతో వియ్యమందియుండి – దుష్టబుద్ధితో చెడునడతతో ఈ విధంగా గంతులువేస్తూ వుండడం మీ శ్రీ కుమారికి సంకటప్రద మొక్కటేగాదు, మహీశూర రాజ్యానికే విషాద వ్యథలనూ, అవమానాన్నీ తెచ్చిపెట్టుతుంది – మీరు ఇట్టి మీ చర్యలగురించి లక్షింపరా ఏమి?

సిద్ధరాజయ్య: మహాప్రభు! ఈ బైసిమాలిన పని చేయుచున్న ప్రభువుల మధ్య ఆకస్మికంగా చిక్కువడిపోయాం.

మహారాజు: చాలు! ఈ ఇర్వురినీ దేశసభలో హాజరుపెట్టండి.

సైన్యాధిపతి: చిత్తం మహాప్రభు!

మహారాజు: అప్పణ్ణా! ఇటు రా!

నంజసెట్టి: ప్రభువులవారి ఆజ్ఞ.

మహారాజు: సాహస వీరపురుషుని ఏల్బడి, కాపుదల లేనప్పుడు, ఆయన రాణివాసానికి, క్షాత్ర తిరస్కారాన్ని ప్రదర్శించి, విడంబించి, రెచ్చగొట్టి, మహీశూర రాజ్యానికి మాకూ, నీకూ, ఎన్నడు కలిగివుండని వీర ధర్మభంగాన్ని, ఓటమిని, సిగ్గునూ కలుగజేసే అంతటి మహాపరాధాన్ని నీవు చేసినవాడవయ్యావు. అందుచే మహీశూర యశస్సునకూ, శ్రేయస్సుకూ, ఉన్నతికీ కళంకమాపాదిల్లి, మరువరాని హేయమైన లోకనిందకు పాల్పడినట్లైంది.

నంజసెట్టి: (అధోముఖుడై, సన్న గొంతుతో) ఔను మహాప్రభు!

మహారాజు: ఈ కూళతనం కట్టికుడిపిన పరాభవం మా మెడకంటగట్టిన నీచుని, ఆ ద్రోహిని, నీరు నీడలులేని కాఅడవి నట్టనడుమ, వేసవి

మధ్యాహ్న సమయంలో కంబాని కంటగట్టి, నిలవదీసి, అతనికి కన బడకుండా ఇరువది విలుకాండ్రనుండి నిమిష నిమిషానికీ, క్రూర నారాచాలతని వంట్లో నాటుకొనేటట్లు శిక్షింపవలసి వుంటుందని మా సేనా నియమములలోని నిబంధనయై వుంది; వీరధర్మ ప్రపం చంలో అది అంతటి మహా పాతకం.

[అందరూ తల వంచి మౌనం భజిస్తారు]

మహారాజు : కళ్ళు నెత్తికివచ్చి అడ్డదారికి తిరిగిన నీ స్వదేశ ప్రేమకు రాజభక్తికి ప్రజాభిమానోత్సాహోత్సవాలకు, ప్రాయశ్చిత్తం ఇక్కడ, ఈ వీరపత్ని యైన ఈ మహిళారత్నం పాదతలమందు ఇప్పుడే నెరవేరవలసివుంది.

నంజసెట్టి : మహాప్రభు !

మహారాజు : అప్పణ్ణ! నీవు 'మహీశూరపురం బిరుదెంతెంబరగండడ' వను విషయం, ఆ 'బిరుదెంతెంబర గండ' మహారాజువారి పట్టప్రజ అనే విషయంను మరువరాదు.

నంజసెట్టి : చిత్తం, మహాప్రభు! (త్వర త్వరగ పోయి మా దేవమ్మణి సమక్షంలో వీరాసనంగా మోకరిల్లి, తన రెండు చెంపల్ని తటపట వాయించుకొని, చెవులు పిండుకొని, నాలుగైదుసారులు మోకరిల్లి నమస్కరించి, ముఖాన్ని మంటితో పొరలించి, అట్లే వీరాసనంగా లేచి, ఆమె పదతలమందలి ధూళిని రెండు పిడికిళ్ళ రాచుకొని, మెల్లమెల్లన – చాల నెమ్మదిగ చేదోయినెత్తి, ఆ ధూళిని శిరస్థలిపై వర్షించుకొని ఆమెతో దీనవదనుడై క్షీణగద్గద స్వరంతోడ) క్షమిం చాలి, మహాతల్లి క్షమించాలి.

మా దేవమ్మణ్ణి : (కన్నీరు నింపి) ఆహా! పరమేశ్వరుడా! (తిరిగి వెడలి పోతుంది. పరిచారికలు ఆమె అంగరక్ష చేస్తూ నిష్క్రమిస్తారు.)

మహారాజు : (గంభీర గమనంతో నంజసెట్టిని సమీపించి అతన్ని చేత లేవ నెత్తికొని) ఏమి అప్పణ్ణ!

నంజసెట్టి: (అశ్రుధారలను తుడుచుకొంటూ) మహాప్రభూ! ఈ ప్రాయశ్చిత్త్రవతంతో మహీశూర పౌరుల వీరనిష్ఠ ఏ స్థాయిలో వున్నదీ వీరి కందరికీ, మహాప్రభువుల మహా సన్నిధానంలో ప్రదర్శించే పరమ పుణ్యం నాకు లభించిందనే ఆనందంతో పొంగిపోతున్నాను.

మహారాజు: బాగు బాగు! అవును మైసూరు మహీశూర పురమైంది; 'విరుదెంతెంబర గండ' అను బిరుదు ఊర్జితమైంది; కాని...

నంజసెట్టి: ఉమ్మత్తూరు ప్రభువుల రాజప్రాసాదంలోనివారు తామై తెచ్చి యిచ్చిన ఆ 'మొనగార' అను బిరుదు కూడ, మహీశూర రాజవంశానికి అచంద్రార్కంగా చెల్లతగివుండుటచే దానిని విడువగూడదని నా మతము మహాప్రభు!

మహారాజు: (నవ్వి) అట్లే కానివ్వండి 'మొనగార' అను బిరుదు నేటినుండి మాకు చెందిందైంది. కాని సెట్టివర్యా! ఈ అన్ని బిరుదులతోనూ, మాకు కొంచెమూ తృప్తి కలుగడంలేదు. మాకు మరియొక బిరుదు నందుకొనేచ్ఛ వుంది.

నంజసెట్టి: మహాప్రభువులు ఏ బిరుదైనను, ఎటువంటిదైనా ధరియింప, సంపాదింప, సాధింప, ఊర్జితం చేసికొనవలయునంత శౌర్యౌదార్య తేజ ఐశ్వర్య సత్త్వశక్తి సన్నాహాలనన్నింటినీ ఆ అంబ-శ్రీ చాముండాంబిక అనుగ్రహిస్తున్నది మహాప్రభు!

మహారాజు: (ముకుళితాంజలియై, అవనతోత్తమాంగుడై) ఔను; కాని అటువంటి బిరుదొక్కటీ ఇప్పుడు మాకు వాంఛితంగాదు; ఆ నూత్న బిరుదాన్ని మా వంశానుక్రమంగా వాడుకోవాలనీ నా కిష్టములేదు. అది మాకు-వ్యక్తిగతంగా నాకు-మాత్రమే అన్వయింపించాలి. ఆ బిరుదు-ధీరుడూ, శూరుడూ, స్వదేశవత్సలుడూ, రాజభక్తుడూ, ప్రజాగౌరవజ్ఞానీ, వీర ధర్మావతారుడూ, మహీశూర బిరుదెంతెంబర గండడూ ఆయివున్న ఈ తుంటరి నంజసెట్టియొక్క ముద్దుపేరు-అప్పణ్ణ-అనేది-(లీలగా నంజసెట్టిని తనవైపు గుంజి ఆలింగనం చేసికొంటాడు. మహీశూరవాసులందరూ వంగి, దీర్ఘీకృత హస్తాంజలులై వందన మాచరిస్తారు.)

నంజసెట్టి : (మొహం బాగుగా వికసింపజేసి, ప్రభువుల గాఢాలింగనంనుండి ముక్తుడు కాగా కన్నీరు ధారావాహినిగా ప్రవహిస్తూవుంటే, కైమోడ్చి బాష్ప గద్గదస్వరంతో) మహాప్రభు! మహాప్రభు! నేను ధన్యుడను! పరమ ధన్యుడను! మహాప్రభు! నా జన్మ-సార్థకమైంది.

మహారాజు : (సుస్మితుడై) మహీశూర పురవాసులెల్లరూ-తథాస్తు అని ఒప్పుకొనువారై శోభిల్లవలసిన సుయోగంతో కూడిన సుదిన మిది. అప్పణ్ణ! శాంతుడవు కావోయి!

[మహీశూర వందిమాగధులు; ఇతరులు చేయెత్తి]

స్వస్తిశ్రీ మన్మహిషాసురమర్దినీ పదారవింద మధుకరాయిత చిత్త!
మత్తరిపు షండ ఖండనోద్దండ దోర్దండ!
అర్థిజనేప్సితార్థ దానశౌండ!
అంగనాజన కుసుమ కోదండ!
బాహుదండ ధృత వివిధాయుధ ప్రకాండ!
మిత్రకుల కమల మార్తాండ!
బిరుదెంతెంబర గండ!
'మొనెగార!'
శ్రీ మన్మహీశూర పురవరాధీశ్వర!
శ్రీమన్మహారాజ!
శ్రీ 'అప్పణ్ణ' తిమ్మరాజ ఒడయ!
మహాస్వామీ!
విజయీభవ! దిగ్విజయీభవ!

[మహారాజుగారి వాద్యాలు మారుమ్రోగుతాయి]

శ్రీ శ్రీ శ్రీ

## పాత్రల పరిచయం:

రంగన్న —— ఈతడు

సీతమ్మ —— ఈమె

సావిత్రమ్మ —— ఈమె తల్లి (వితంతువు)

సుబ్బన్న —— పొరుగువాడు

పార్వతమ్మ —— పొరుగావిడ

లక్ష్మీదేవమ్మ —— పొరుగావిడ తల్లి (వితంతువు)

స్థలం —— బుళ్లాపురం వీథి. ఇళ్లకు చుట్టుప్రక్కలను ఇండ్ల అరుగులు.
ఇండ్లముందు మ్యునిసిపల్ తొట్టి.

# వైద్యుని వ్యాధి

## రంగం—౧

[తెర ఎత్తగానే సుబ్బన్న-ఎడంవైపు అరుగుమీద నిల్చుని చేయి కడుక్కొంటూ మున్సిపల్ తొట్టిలో, పార్వతమ్మ ఎంగిలాకు పారేసే సమయానికి, సరిగ్గా రంగన్న పక్కింటి అరుగునుండి అదే తొట్టిలో తన ఎంగిలాకు పారేస్తాడు. తర్వాత అందరూ వాళ్లవాళ్ల ఇళ్ళల్లోకి వెళ్లిపోతారు. ఓ నిమిషం కాగానే రంగన్నా సుబ్బన్నా తమ తమ ఇంటిలోపలినుండి బైటికి చక్కా వస్తారు. సుబ్బన్న ఇల్లు విడిచి పెంటతొట్టిని సరిచేసి సర్ది రంగన్న ఇల్లు చేరుకొంటాడు.]

సుబ్బన్న: అయిందా భోజనం? అడిగేదా ఏం నేను? చేయి కడుక్కొని.... మా ఆవిడ.... నా ఎంగిలాకు తొట్లో పారేసేవేళ్లికి – తామూ క్షమించండి-తమ ఎంగిలాకు తామే తొట్టిలో–ఇదంతా దేనక్కండీ–మొత్తాన్కి మన ఇద్దర్కీ సాపాటైపోయింది! (అరుగుమీద కూచుంటూ) కూచోండి? తాంబూలం వేసుకోడమైందా?

రంగన్న: చూడు! ఇవ్వేళెందుకో – ఎన్నడూలేని – పంటి తీపు—

సుబ్బన్న: తెల్సు – మీ కిట్లాంటి ...పంటినొప్పి మాటమాటాడ్తే వచ్చేస్తూ వుంటుందని నిర్ధరించుకొనే వచ్చేసా నేను...మందుల్తో సహా (చేతిలో వున్న పొట్లం తెరుస్తూ) వేసోక్కండి లేతాకు, చిగురుటాకులు, 'అంబాడీ'వి కావు. నికార్సైన మైసూరు సున్నం....మా భావమర్ది డఫేదార్ పోలీసు....మద్దూర్లో – వక్క మా అత్తకు వస్తూవుంటుంది మల్నీమనుండి—ఈమెగార్కి జాపత్రి, జాజికాయి, కొబ్బరి, పాటలు పాడడం వచ్చినట్లైతే "పునుగు, జవ్వాది, కస్తూరి" ఈ గందరగోళమంతా– మనకెందుక్క...ఇదంతా మా ఆవిడ యెగారం... వేసోక్క-సిగ్గడకు–

చెప్పాగా ఇరుగుపొరుగులో ఏం తేడా వుంటుంది సామీ! ఈ అన్యోన్య ధర్మానికి, ఓ చక్కని ఏర్పాటుచేయడం నా ధర్మంగా తెల్సుకొనే వస్తా, నే నిప్పుడిక్కడిక్క! -- (మాట్లాడాలనుకుంటున్న రంగన్నకు అడ్డుమాటగా) అయో! తెల్సు బాబూ! తెల్సు!... అంతా తెల్సు. మన ఇద్దరి ఇళ్లేమో తీరా చూస్తే ఓటే బిల్డింగు కంట్రాక్టు పని, - గోడలన్నీ వొత్తి ఇటుకపుడి మన్నుపూసిన వెదురు తడకలు. మీ ఇంట్లో మీ పత్ని-మీ అత్త-వాళ్ళ ఇద్దరి గలభా గందరగోళాల్లో మీ పానాలు- ఉచ్ఛ్వాసనిశ్వాసాలూ- అన్నీ కుక్కమొరుగుడల్లేనే వినవస్తాయి.... మా ఇంట్లోకి...మరేం అనుకోకు మనస్సులో - చెప్తున్నాననని... ఈ రెండు కొంపలకీ వుండేది ఇద్దరే మొగాళ్లు! నలుగురాడోళ్లు! అయినా కూడా....నా పని, నా జీతం మరి నా చైతన్యం, ఇంతెందుకు - చెప్తున్నాగా-నా అర్ధప్రాణాలు రెండింటితో, నేను నా పత్నినీ, ఆమె తల్లినీ, ఎలా కాపాడ్తానో, అచ్చంగా అల్లాగే మీ ఇంట్లో,... మీరూ దిన మంతా.... పశువులా శ్రమించి... సంపాదించిన సంబళంతో జీవిస్తూ వుంటారు మీ పత్ని...తమర్ని నమ్మి చేజిక్కిన భార్యామణిగారు ఆమె తల్లిగారు బ్రదుకుతూ వుంటారు చూడండి (మునిసిపల్ తొట్టి వైపు సూచిస్తూ గద్గదస్వరంతో)....ఇదే తొట్టిలో నా ఎంగిలాకును, నా పెళ్లాం ఈ తొట్టిలో పారేస్తున్న సమయాన - తమ ఎంగిలి విస్తరాకు తమంత తామే అదే తొట్లో...తమ ఇంట్లో తమవల్ల బ్రతుకుతూ వుండే ఇద్దరాడోళ్లుంటూ వుండంగానే తామే తమ ఎంగిలి విస్తరాకు- ఈ పెంటతొట్లో వేయడం చూస్తే - నా కెందుకో చెప్పొద్దూ...కోప గించుకోకండేం....ఇంటి యజమానికి...ఇల్లతన్ది అనే సంగతే మరిచి పోయి 'జడభరతుడో' లేక 'శుకబ్రహ్మ ఋషియో' ఈ కాలంలో... ఈ కలియుగంలో ఏం పురాకృతకర్మో...ఈ పురాణాల్లో వచ్చే గొప్పగొప్ప ఋషులకంతా ఒకే పెద్ద దోషం .. వీళ్ళ బ్రహ్మచర్యం గలాటాలో....ఆడదాని స్వభావం తెలుసుకొనే బాబతులో వీళ్ళంతా వర్తి సున్నగాళ్ళని తెలుసుకొనే...తమ సాత్విక స్వభావంచేత, తెలుసుకున్నా కూడా చూడండి... మొత్తంమీద కోప్పడకండేం ద్రౌపదివల్ల పాండవులు చెడ్డట్టు....సీత మూలంగా రాముడు రాక్షసుల పాలైనట్టు-చెప్పడానికేగా మరి వచ్చింది నేను!...మనుష్యుడు...వ్యక్తి.

పురుషుడు....చెప్తున్నాగా, మొగాడు తాను దుడ్డుతెచ్చి మొహాన పారేస్తే, బియ్యం, కూర, పప్పు, ఇత్యాదులు పచనంచేసి, లోపా ముద్ర, అరుంధతీదేవిలా 'అగ్ని ఎదురుగా' పతి, తన మెడకు కట్టిన తాళి అనే నిచ్చెన మూలంగా అతని శుశ్రూష, అతని సేవ, సంతోషం ఈ మెట్లుమీదినుండే ఆ నిచ్చెన చివర వుండేటటువంటి....లక్ష్మి, సరస్వతి, చాముండి, ఈ బాబతు ఆడదేవతల దర్శనం బౌతుందనే తత్వాన్నే మఱచిపోయి, కోప్పడకండి....నెలకు డెభ్భై అయిదు రూపా యలు మీ జీతం....నాదంటేనో పఖైరూపాయలు మామ ఇంటిదగ్గిర సాయలాపాయాలాగా అందులోనూ....మా ఆడోళ్లు నన్ను ...నా వంతుకు....నా సంతోష సౌకర్యాలకుగాను తల వంచి నడుస్తూ వుండే సమయాన....రీతి, గతి, గమనం, మంచి, చెడ్డ, మీనుండే.... బ్రదికే ఈ ఇద్దరాడోళ్ళు స్త్రీ ధర్మరీతిని మఱచిపోయి మీ ఎంగిలాకు మీరే ఈ మున్సిపల్ తొట్లో....నాకేమో....భూదేవి బ్రద్దలుకాదే- ఆకాశం చిల్లుపడదేం....పిడుగులు.. .క్షమించాలి; ఇదంతా...ఇదంతా మరేం లేదన్నట్లు-గృహస్థు గృహం ఏల్బడి, ఇంద్రుని స్వర్గరాజ్యం- ఇల్లా ఒక్కొక్క లోకానికి రాణులు, లక్ష్మి,సరస్వతి, పార్వతి, ఇంద్రాణి, అనబడేటటువంటి ఆడవాళ్ళ సముదాయం ఉంచూవుండగా, ఆయా లోకానికిగానీ, రాజ్యానికిగానీ, గృహాలకుగానీ, ముఖ్యప్రాణి మగాడే తప్ప ఆడదికాదనే విషయాన్ని మరచిన్నిపోయి, మహర్షులు. .. మహర్షులేమో....నిల్వ....బాకీ....జమా ఖర్చు ఏమీ తెలియకుండా, జడభరతుడిలా....క్షమించాలి....రేగబోకండి.

రంగన్న: (అడ్డు మాటాడి) తిట్టండి....తిట్టండీ....నోటికొచ్చినట్లల్లా తిట్టండీ- నువ్వు చెప్పేదంతా ఇంట్లో నడిచేదే....నాకు తెలియందేమి నువ్వు చెప్పిందిలేదు. అయితే ఏంచెయ్యను? మొదటినుంచి, ఎంతోకాలంగా చూస్తునేవున్నా ఈ తంతు ఇలా వచ్చి, వచ్చి వచ్చి నెత్తినపడింది మరి! పడ్డదానితో ఎల్లాగో అల్లాగు మరి కొనవరకూ వేగడమే గదూ మొగవాడి గుణం?

సుబ్బన్న: వేగడం? ఎంతవరకు వేగడం? ఎందాకా అని నెత్తికెక్కించు కొని వేగడమయ్యా! అవునుగాని మొగవాడు సంపాదించి తెచ్చి

మొహాన పడేస్తే సుఖంగా తినితిని, తేన్చి పెరిగి పెద్దదైన మేదస్సుకు, తనకు తాళికట్టిన మొగుడు తన ఎంగిలివిస్తరాకు తానే, తన చేతుల్తో మునిసిపల్ తొట్లో వేసే పరిస్థితికి పెళ్ళాం తన్ను తెచ్చేదాకా వేగుతూ వుండడమే నా పని? తమర్ని తాము మర్చి చక్కాపోయినా, తమ మీద మమత, మర్యాద పెట్టుకొని వున్నాడింకా -ఈ పాపిష్ఠియైన నేను; మిమ్మల్ని మరిచిపోలేను; అయితే మమత, విశ్వాసం, ప్రేమ మొత్తం మీద తమమీది భక్తి అనే పునాదిమీదనే నిజానికి, తమర్ని రెచ్చగొట్టే, ప్రమాదాన్ని కూడా మరచిపోయి, వెనక ముందాలోచన లేకుండా సాహసించి, మరీ....నేను నా అల్పస్వల్పమైన సంసారంలోని అనుభవ బలంతో తెలుసుకున్న గృహస్థసౌఖ్యాన్ని అనుభవింతురు గాక అని - సూక్ష్మమైన....సూత్రప్రాయమైన....మొత్తంమీద....అ కాస్త రహస్యం మీ చెవినివేసి....ఇంటి యజమాని....తన పెత్తనం చెల్లించాలనుకుంటే....ఇంట్లో ఆడవాళ్ళని, పిడికిట్లో, అదుపులో పెట్టుకోవాల్సి వుంటుందనే ధర్మసూక్ష్మాన్ని....అదే నాకు తెలిసిందాన్ని, అల్లాగే మీకూ ఉపదేశించాలని, వచ్చిన నేను, ఇరుగుపొరుగు అనిన్నీ, మగవాళ్లు, మగవాళ్ళకు చెప్పి తీర్చుకోవాల్సిన ఋణాన్ని తీర్చుకొనే తీరాలి అనిన్నీ వచ్చివున్నాడ నేను!

రంగన్న: అవునండీ! మీరు చెప్పేదంతా సరేననుకొందాం; కానైతే దారి తప్పినవాడు అల్ప స్వల్పంగా తప్పివుంటే, అంతలో ఇంతలో, చిటికెలమీద సరిజేయవచ్చు వ్యవహారం; కాని అయితే, హళేబీడు[1] కని బైలుదేరిన పెద్దమనిషి, హార్నహళ్ళి[1] కి వచ్చి చేరుకుంటుంటే, ఏం దారి అని చెప్పి దారి చూపిస్తాం? ఇప్పటి నా యీ స్థితిలో?

సుబ్బన్న: ఏందారప్పా! నా దారి! "నా ఇంటిలో మగవాణ్ణి నేను, ఇంటి బాడుగ పారేసేది నేను; ఇంటికి కావల్సిన సామాను, ధాన్యం, తర్కారీ (కూరగాయలు) తెచ్చిపడేసేవాణ్ణి నేను; దాన్ని ఇంత పాకం చేసి నా పొట్టకూ, తన పొట్టకూ కావల్సినంత వడ్డించే ఆవిడ - అదే నేను తాళికట్టి, అగ్నిసాక్షిగా పాణిగ్రహణంచేసిన నా పెళ్ళాం....

1 హళేబీడు, హార్నహళ్ళి :—ఈ రెండు స్థలవిశేషాలు. ఇందులో హళేబీడులోని దేవాలయాలు శిల్పకళకు ప్రసిద్ధాలు—అనువాదకుడు.

ఈ ఇంటిని పట్టుకొన్న పనికి తోడు....మొగుణ్ణి పోగొట్టుకొని, దిక్కూ దివాణం లేకుండా, తన కూతురు నమ్మివున్న అల్లుణ్ణే తాను నమ్ముకొని, పెద్దతనాన్ని ఎల్లాగో నెట్టేద్దామనుకొని ఇంట్లో ఓ మూల, ముడుచుకొని పడివుండే ఆ ముసలిగొడ్డు మా అత్త! అసలే దిక్కుమాలిన పనుల్తో సతమతమౌతుంటే....పేడతీసి, గోమయం పెట్టు అన్నట్లు ఉంది!....ఇదీ చూడవయ్యా నా దారి! ఈ దారి విడిచి, హాళేబీడేమి? హొర్నహాళ్ళి ఏమి? హంపా పురమేం – బతేరాంపురి దాకా కాళ్లరిగి కళ్ళు మిటకరించినా మీరు ఓ క్షణంపాటు....పంచాక్షరీ షడక్షరీ ఉపదేశంలోనే ప్రపంచాన్ని విడిపించే దారి. దొడ్డ దొడ్డ గురువులంతా వెనకటికాలంలో మన పెద్దోళ్ళకు ఉపదేశించినట్లే...నేనున్నూ నా సంసారాన్ని చక్కదిద్దుకుంటున్నట్లే, సదరు మీరున్నూ రేపటి రాత్రి ఈపాటికి మీ సంసారాన్ని చక్కదిద్దుకొని అనుభవించే సూత్రాన్ని చెప్తుంటిని స్వామీ మీకు! అయితే ఓ మాట! రాత్రిపొద్దు శబ్దముండే దాని తస్సాగొయ్యా అది, చాలా దూరం పరుగెత్తుతాది, నా మాటలు కనక మీ ఇంట్లో ఆడవాళ్ళ చెవిని పడ్డాయా ఎగిరి గంతులుపెట్టే తత్వాలు! మా మంచివాడివిగాని బాబు బాబు! గుడిదాకా వెళ్ళివద్దాం పదబాబూ! (రంగన్న అరుగువదలి అతన్ని కలుసుకొని నడుస్తూ వస్తాడు) చూడు స్వామీ! రేపు నీ సంబళం (జీతం) డెబ్భై అయిదు రూపాయలు చేతిలో ఘల్లుమని పడతాయి. మీ ఆవిడ పుట్టిల్లు పట్నంలో; దగ్గిరదగ్గిర రెండురూపాయల్లో, యిద్దరి ఆడవాళ్ళ రైలుఛార్జీ....అందుమీదట ఓ నెలరోజులపాటు వాళ్ళు ఊళ్లో వుండి కాలక్షేపం చేయడానికిగాను – భత్యం ఇరవైమూడు రూపాయలు మొహాన పడేసి, ఇక్కడ్నించి తోలేసావంటేనే, మిగిలిన రొక్కం యాభై రూపాయల్లో, ఓ నెలరోజులు బ్రతుకు వెళ్లదీసుకొని బతికేపక్షాన (చెబుతూ, రంగన్న చెయ్యిపట్టుకొని ఇద్దరూ నిష్క్రమిస్తారు.)

సావిత్రమ్మ: (సుబ్బన్న ఇంత వరకూ, మాట్లాడుతూవుండడం, పొంచి వింటూ వున్న రంగన్న భార్య మరి అత్తగారు, మగవాళ్లు నిష్క్రమించగానే, ఒకళ్ళ మొఖం ఒకళ్లు చూసుకొంటూ).... ఇదేమన్యాయమే సీతూ!

సీతమ్మ: అన్యాయమా! అనాహూతమైతే![1] సర్వనాశం! ఇప్పుడే పక్కింటికి పోయి, ఆవిడ్ని లేపి....? (అని ఛీత్కరించి, వీధి వాకిలి దబాలున తెఱచి తల్లీ, పిల్లా ఇద్దరూ బైటికి వస్తారు)

సావిత్రమ్మ: ఇదేం పిచ్చే తల్లీ!

సీతమ్మ: పిచ్చా! పిచ్చి! ఇప్పుడు మెదలకుండా వుంటే అదే పిచ్చి! నువ్వు వినలేదుటే అమ్మా! ఆ శనిముండావాడు, చెప్పింది, వినలే నువ్వు! రైలుఛార్జి ఇచ్చి చేతిలో ఇరవైమూడు రూపాయలు పడేసి మనల్ని తరిమి పారేయి, పట్నానికని చెప్పడం....! వాడి మాటే ఓవేళ ఈ మగవాడు విని అల్లాగే చేస్తే.... మనగతి ఏమిటమ్మా!

సావిత్రమ్మ: గతి? (తటాలున అరుగు మీద కూలబడి) గతి? గగనమే గతి! దీనికి నువ్వు చేప్పే ఉపాయం ఏంటి?

సీతమ్మ: ఇప్పుడే ఆ శనిగాడి పెళ్ళాన్ని లేపి ముదిగొడ్డు అన్నాడుగా ఆ ముసలిదాన్ని లేపి, వాళ్ళకు చెప్పి "మీఇంటి ఆయన బెదిరింపులకు, ఎల్లా.... మీరు బెదిరిపోయి, ముడుచుకొని పడివుంటున్నారో గాని... ఈ ప్రపంచంలో వుండే ఆడవాళ్ళంతా మీకు మల్లే చచ్చు పుచ్చు పెద్దమ్మలు గారు తెలిసిందా! మా మగవాడికి దుర్బోధలుచే యడాని కని బైల్దేరాడు మీ పాడు మగాయన ఆయన్ను కట్టు బాటులో పెట్టు కోండి.... మీరే" అని ఆమెతో.

సావిత్రమ్మ: అయ్యో! మట్టిబుర్ర! ఆ ఘాతకుడు ఆ ఇద్దరి ఆడవాళ్ళ వెన్నెముకల్ని విరగగొట్టి, వాడి నోటికొచ్చి నట్టల్లా తిట్టి మరీ వుంటే, ఆ ఆడవాళ్ళని ఇప్పుడు ఇంతపొద్దు పోయిన మీద నిద్ర నుంచి లేపి,....మనమిద్దరమూ ఎంత మొత్తుకొంటే మాత్రం, బుర్ర కెక్కుతుందంటావా ఆ మట్టి బుర్రలకి?....చెబుతున్నా విను: ఆ మలప సన్యాసి ఆ పురుష ప్రేతం....నీ మొగుడికి....ఇంటి పెత్తనం మగవాడిదంటూ ధర్మ సూక్ష్మం ఏ విధంగా ఇప్పుడుపదే శిస్తున్నాడో....అక్షరాలా అదే విధంగా మనమిద్దరం, చూసావూ! రేపటి దినం ఈ ఇద్దరు మగ పురుషులూ, వాళ్ళవాళ్ళ ఆపీసులకు

[1] అనాహూతము=ఆపద (పిలవకుండా వచ్చి పడేది) - అనువాదకుడు

పోయినమీదట;....ఇంటి పెత్తనం ఆడవాళ్లదేనంటూ ఆ సూక్ష్మాన్ని వాళ్ళిద్దరకూ ఉపదేశించి, మనమిద్దరమూ బ్రతుకాల్సివుంటుంది గాని....ఇంటి మగవాడికి బెదిరిపోయి, ముడిచికొని పడివుంటే, ఆ ఇద్దరు మతిమాలిన ఆడవాళ్లమల్లేనే మనం బతకాల్సివుంటుంది; అంచేత వాళ్ళ చెవిలో మనం మన ధర్మసూక్ష్మాన్ని సాంగోపాంగంగా ఉపదేశించడం జాణతనమో, లేక ఈ రకంగా, పిచ్చిపట్టినట్లు, ఇంత పొద్దుపోయి, 'అర్ధరాత్రి మద్దెల దరువ'న్నట్లు...గలాటా చేయడం... మంచిదో!

సీతమ్మ: ఔనమ్మా! ఆ శనిగాడి మాటలు విని రానీ – ఈ మగవాణ్ని! రేపు ఆ శనిగాడు ఆఫీసునుంచి తిరిగివచ్చే లోపల, మనకు తెలిసిందంతా ఆ ఆడవాళ్లకి చెప్పి....

సావిత్రమ్మ: నే చెప్పిందంతా తిరిగి నువ్వు చెప్పక్కర్లా! ఆ మగవాళ్ళు చెప్పినట్లు ఇరుగు పొరుగు, ఇరుగు పొరుగుకే; మగవాళ్ళు మగవాళ్ళకే....మగతనంలోని ధర్మసూక్ష్మం చెప్పుకొంటున్నట్లు, ఆడవాళ్ళూ చూసావూ! ఆడతనంలోని సూక్ష్మభావాన్ని వాళ్ళిద్దరికీ, చెప్పుకుంటే....మనమన ఇరుగుపొరుగు భావంలోని ఋణం మనం చెల్లించినట్లు ఔతుంది మరి! ఆ మగవాళ్ళు ఆఫీసులకు పోయిన పిమ్మట! రేపు! ఇప్పుడు కాదు!....ఈ నడిరేత్రి ఎంతమాత్రం కాదు!....రావే లోపలికి! నీ పిచ్చిగూల! వచ్చిపడ్డాంగాని, బైటికి....!

[నిష్క్రమణ. తెరపడుతుంది]

## రంగం - ౨

### మరుసటిరోజు మధ్యాహ్నం

[సుబ్బన్న అరుగు – సీతమ్మ, సావిత్రమ్మ, పార్వతి – లక్ష్మిదేవమ్మ, అంతరూ కూచుని వుంటారు.]

పార్వతమ్మ: (తల వంచి వినమ్రంగా) మీ రిద్దరూ చెప్పేదంతా సరేనమ్మా; అయితే మేమేం చేసేది? ఎల్లాగైనా చూసారూ! మనమేమో ఆడవాళ్ళం. ఆడవాళ్ళు కానివ్వండి, ఆ మాటకొస్తే మగవాళ్ళుగానివ్వండి

ఎవరైనా సరే చూసారూ! వాళ్ళ నడత, ఆచరణ, ఇవన్నీ కూడా వాళ్ళవాళ్ళ చిన్నతనంలో తండ్రి, తల్లి ఇత్యాది పెద్దవాళ్ళు నేర్పిన బుద్ధిప్రకారం ...మొత్తంమీద....చెబుతున్నాను గదూ మరి, మొక్క సూటిగానో వంకరగానో పెరిగేదంతా, పసిగా వుండాలంటే తోట మాలి తీర్చిదిద్దినట్లే వుంటుంది. నా చిన్నతనంనుంచి "ఆడదానికి మొగుడుతప్ప, వేరే గుడీలేదు, గోపురమూ లేదు. తన గొంతుక్కి తాళికట్టేవాణ్ణి విడిచి, వేరే దేవుడూ లేడు, దెయ్యమూ లేడు అంటూ నేర్పి పెద్దదాన్ని చేసింది మా అమ్మ నన్ను; ఏమమ్మా! సంస్కృత మంతా కంఠోపాఠంగా చదివేసిన మా అమ్మ! చూసారూ మరి!

లక్ష్మీదేవమ్మ: ఊం! భ్రష్టుపట్టిందానా! నిజం సంస్కృతం నీకు తెలియదు! నా సంసారం గలాటాలో, నీకు సంస్కృతం నేర్పించడానికి నాకు తీరికే లేకుండా పోయింది; కాని మా అమ్మ....ఆమె పేరే నీకు పెట్టింది.... ఆమె చెబుతూ వుండేది "దుర్గుణోవాదురా చారో సర్వ దోష సమన్వితః "స్త్రీణాంశుద్ధ స్వభావానాం పతిరే వీశ్వర ప్రభుః" అంటూ....పెనిమిటి, తగలబడి ఎట్లాగైనా వుండనీ, అతని పాద పూజ చేసి, అతన్ని సంతోష పెట్టి, అతని ఎదురుకుండా చూసారూ! అతడు కట్టిన తాళి, అతడు పెట్టిన కుంకుమ పసుపులతో బాటు, ఆత్మహత్య చేసుకొంటే కూడా. అతడు చావక మునుపు తాను కళ్లు మూసేది ఆడదానికి పరమ మోక్షదాయకం! ఇంతోటి భాగ్యం నాకు లేక పోయినప్పటికీ చూశారూ! సావిత్రమ్మగారూ మీకూ లేకపోయి నప్పటికీ, చూశారూ! మరి కోపగించుకోకండేం!....సీతాదేవి అంటూ పేరుపెట్టుకొన్న మీ అమ్మాయి, ఇటువంటి దురాలోచనల్ని, ఏమీ అభం శుభం తెలియనిదానికి, బోధిస్తూవుంటే మీ రొక్కమాటైనా మాట్లాడకుండా వింటూవుండడం ఉచితమేనా? మాతృధర్మమేనా? స్త్రీధర్మమేనా! నాకంటె ఎంతో గొప్పవాళ్ళు మీరు! చెడుతూవున్న కాపురాల్ని చక్కబఱుచడం పుణ్యం, ధర్మం; పాతివ్రత్యం, పతిసేవ, స్త్రీ ధర్మనీతి మొదలైనవాటిని ముందుంచుకొని నడుస్తూవుండే మా అమాయికమైన పిల్లదానికి, ఇల్లా అన్నీ దుర్బోధల్ని చేస్తూవుండే మీ కూతురు సీతకూ, ఇదంతా వింటూ కూచున్న మీకు కూడా ఆరవాది

నరకప్రాప్తి కాకూడదని ఒక్కటే నా కోరిక; దయచేసి పోయిరండి; పుణ్యముంటుందిగాని!

సావిత్రమ్మ: రా! సీతూ! రా! ఇక్కడేమీ అయ్యేదీ పెట్టేదీ లేదు నాకు తెలిసిందే ఇదంతా. ఈ మగవాడు వొత్తి బడాయిమాటలతో వీళ్ళ వెన్నెముకలు ఊడదీసి పెట్టాడనుకొంటూ వచ్చా! తప్పు! ఊడదీసి పెట్టాలేదు! – సుతరాం, విఱుగగొట్టి పారేసేడు; వెన్ను గఱ్ఱతో సహా! ఇటువంటి వెన్ను విరిగిపోయి, గుండెలే లేని కప్పుతక్కెడ, మగవాళ్లు రాసిన భారతము, భాగవతం, బెబ్బేలుపోతూ నత్తుతూ చదివినంత కాలం గతి ఏముంది ఆడవాళ్ళకు! ముందు గతులెక్కడున్నాయి ఆడవాళ్లకు ప్రపంచంలో!

సీతమ్మ: ప్రపంచం, ఆడవాళ్ళు, ఎల్లాగైన తగలబడిపోనీ! వాళ్ల గతి, సంగతికేంగాని, మన గతేమిటో ఆలోచించు ఇప్పుడు! ఈ మొండి పీన్గులు, ఆడతనాన్నే మరచిపోయి, గేదెపడ్డల్లా, పొట్టకు కూడు పడేయి, పరమాత్ముడా అని పడుకొన్నారు! వీళ్లని "మీరూ మాలాగానే ఆడవాళ్ళు; గొర్రెలూ మేకలూ కారు! మేల్కొండి" అనడానికే మనకు వీలెక్కడుందమ్మా! వాళ్ల తలరాత ఇంతకీ!....(మెల్లిగా) వాళ్ళ కర్మ వాళ్లేమైనాగానీ; సధ్యా ఈ మగోడు వీళ్ల యింటి భేతాళరాయడి దుర్బోధల వలలో చిక్కి....ఓ వేళ పిచ్చిపట్టి....మనల్ని....పట్టానికి....

సావిత్రమ్మ: (అడ్డుమాటగా, మెల్లిగా) ఉఫ్! అదేనే చూశావు! నా ఆలోచన కూడా నమ్మి! మాట...ఇంట్లోకిపోయి తీర్మానించుకుందాం పద...రా!

[ఇద్దరూ పెంటతొట్టై దాటివచ్చి తమ ఇల్లుచేరి ప్రవేశించి, వాకిలి వేసుకొంటారు]

[తెర వ్రాలుతుంది]

## రంగం – 3

## అదే రాత్రి

[స్థానం : రంగన్న యింటి ముందుభాగం; ఇంటిముందు రంగన్న ఇంటి వాకిలిబైట చేయిచేయి నొక్కుకుంటూ నిల్చున్న సీతమ్మా సావిత్రమ్మలు – పరస్పరం. అరుగుమీద పెట్టివున్న ట్రంకూ, బెడ్డింగు, కృష్ణాజినం పెట్టె, రాగిచెంబు, ఎర్ర మడిఎట్ట, ఇత్యాదు లన్నింటినీ గమనించుతూ....కళ్లుకిమి చూస్తారు. నేపథ్యంలో, జట్కాబండిని, గుర్రం వెనకభాగాన్ని విడిచి రంగస్థలంపై గుర్రంముందు సగభాగం, కనపడజేస్తూ జట్కా సాయబ్బు, బండి ముందు నిలుచుని వుంటాడు]

సావిత్రమ్మ : (గద్గదస్వరంతో) ఒప్పుకుంటావా మరి! అయితే మనకిప్ప టికీ, ఆలోచన, ఊరుపోవాలని లేనేలేదు. మేం పోయినమీదట.... మేం లేకుండావుంటే చూశారూ! మీ రొంటరిగా వుండుకొంటూ.... ఇల్లు చూసుకోడం, చక్కగా వుంచుకోడం....అంతేగాకుండా భోజన భాజనాలూ, మీరే ఏర్పాటుచేసుకోడం, ఇదంతా గాకుండా, మీదు మిక్కిలి ఆఫీసు గీఫీసు; ఈ విధంగా, ఇల్లు వదలివెళ్ళడమంటే ఏదో దొంగతనం చేస్తున్నట్లనిపిస్తోంది....ఇదీగాక రాత్రివేళల కారుచీకట్లో ఒంటరిగా ఇంటిలో....పెరటివైపు....మైదానం, బట్టబయలు–ముసల్మా నుల గోరీలు, దెయ్యాలూ, పిశాచాలూ...జనాలు చెప్పుకొంటూవుంటారు చూశారూ....కనబడుతూ వుంటాయి అని...అందుకే వాడిక తక్కువ... నాకైతే నమ్మకం లేదనుకో....అయినప్పటికీ ప్రాణభయం అపాయా నికి ఆస్పదం మరి!....నా కూతురు మెడలోని తాళి గట్టిది అనే ఆలోచన వచ్చినమీదట....పేచీ పెట్టుకొంటున్నా. మొత్తంమీద ఒక్కరే ఒక్కరు మీరు – ఒకే ఇల్లు – మే మిద్దరం... ఇహంలో వుంటూ చూశారూ....మమ్మల్ని సాగనంపి, మీరు ఒంటిలింగం రామలింగంలా ఎల్లా....?

రంగన్న : (అడ్డుమాటగా బిరుసుగా) ఎల్లా బ్రతుకు తున్నానో అంటారా మీరు? దాన్ని క్లుప్త పఱచుకోవాలిసి వుంటుందనేదే ...నా పట్టుదల, నెలకు డెబ్భై ఐదు రూపాయలు సంపాదించే మగవాడి పెళ్ళాం, అత్త వీళ్ళ జీవితానికి గాను ఇరవైఅయిదు రూపాయలు పోగ మిగిలిన యాభైరూపాయల్లో బ్రతికుండడం అవసరమేనా...కాదా? అని అదీగాక, ఇంతవరకూ కనిపెట్టిందేమో, కాటాడిందేమో, ఇద్దరి ఆడంగులకు బెదిరి చక్కాపోయి నోరు మూసుకున్న, దయ్యాలన్నీ ఇప్పుడొక మగ వాణ్ణి ఏం చేస్తాయి-అనేది తేల్చుకోవాలనే నా పట్టుదల. వట్టిచర్చలతో ఫలితమేమి లేదు. జట్కా సిద్ధంగావుంది... రైలు కింక అరగంటే వుందిటైం. అక్కపక్కల[1] అమ్మలక్కలు, అంతా చూస్తూనే వున్నారు గడబిడేమి చేయకుండా కదిలి రండి....రండర్రా మీ వున్నెమాయిరి! (అంటూ సాయబ్బుతో) అజీ! ఓ సామాను జట్కాలో రఖో. బుడ్డి (ముసలిది) తన సామాను తానే రఖ్లేకి (ఉంచేసుకొంటుంది.)

[జట్కాసాయబ్బు ట్రంకూ, బెడ్డింగూ, లేవనెత్తుకొని వెళ్లుతాడు]

సీతమ్మ : ఇంత విపరీత మేర్పడిందమ్మా! పురుగులా ముడుచుకొని పడి వుండే ఈ ప్రాణి, ఇవ్వాల్టి రోజు, తగుదునమ్మాఅని, కాళింగి నాగులా పడగెత్తి మనల్ని కాటువేయడానికి వస్తుంటే (పళ్లుపటపట మని కొఱుకుతూ) ఈ బజీదు అంత పట్టించినవాడు ఆ పక్కింటి పిశాచిగాడ్డు. ఇప్పుడేంచేసేదమ్మా!

సావిత్రమ్మ : చేసేదేముంది....నీ పెనిమిటిని బెదిరింపులతో, ముక్కుమూతి విఱుపుల్తో, అదరగొట్టేకాలం, గడిచిపోయింది. సధ్యా, నాకు తోచేది ఒక్కటే ఒక్కదారి. నీ పెనిమిటికి నూరిపోసాడే, ఆ పుండాకోరునే పట్టుకొని ఎడమచెత్తో తన్నడమో, లేక కాళ్లమీదపడి-ఎల్లాగైనాసరే ఆయన నోటి వెంట ముక్క చీవాట్లుపెట్టించి, ఈయనకోపాన్ని చల్ల పడ జేసి....

సీతమ్మ : అవునమ్మా! నువ్వే పోవేగంగా.

సావిత్రమ్మ : చూడు; పోతున్నదేమో పోతూనే వున్నాం....వెళ్లిరావడం, పదిదినాలకో, పదిహేను దినాల కోసమో అని అనుకుంటున్నాం.

---

[1] అక్కపక్కల = చుట్టు పక్కల

కాని నెలనెలకూ డబ్బు రవానామాట మీరు నిర్దాక్షిణ్యంగా చెప్పిన మీదట, మే మిద్దరమూ, తిరిగిరావడం....చాలా కాలం పట్టుతుంద నిన్నే తీర్మానించేసుకున్నాం. పార్వతమ్మోరు, లక్ష్మీదేవమ్మోరు ఇద్దరికీ చెప్పుకొని, వాళ్లకుటుంబం వల్ల మన ఇర్వురికే అయిన ఉప కారాన్ని ఒప్పుకుంటూ....వెళ్లివస్తాం తల్లుల్లారా! అని విన్నవం చేసు కొని వద్దాం. ఎటువచ్చీ, ఎంతచెడ్డా ఇరుగు పొరుగంటే, ఇరుగు పొరుగే కదూమరి! (సీతమ్మతో) రావమ్మా వెంట.

[ఇద్దరాడువాళ్లు సుబ్బణ్ణ ఇంటివాకిలి దాకా వస్తారు. సావిత్రమ్మ వాకిలి తలుపు కొట్టడానికి చెయ్యి ఎత్తుతుంది]

సుబ్బన్న: (ఇంతవరకూ పక్కింట్లో జరుగుతూ వున్న తతంగం అంతా పొంచుని వింటూ చూస్తూ .. ఇప్పుడు అరుగుపై చీకట్లు క్రమ్మగా తాను దాగుకొన్న మూలను విడిచి ముందుకు చక్కా వచ్చి) క్షమించు తల్లీ! ఎవరు కావాలో .. ఏం కావాలో... ఇంత పొద్దుపోయి!

సావిత్రమ్మ: హయ్యో! రామ! ఇక్కడే వున్నావయ్యా బాబు! ఇంత సేపూ ఇక్కడే వున్నారా ఏమిటి ఖర్మం చాలక! మీరు నిన్నటి రాత్రి మా అల్లుడుగారికి చేసి వుండుకొన్న ఉపదేశం ఫలితాన్ని అనుభవిస్తున్నారా! చూడండి; మావి చూశారూ! సాధు ప్రాణాలు— మీరో ఘాటీరకం .... అయితేనేంగాని ఓటి మాత్రం మఱచిపోకండి. మీ ఆవిడ, మీ అత్త ఇద్దరూ చూశారూ! కప్ప తక్కెళ్లుగా ఉండే కాలానికి....వాళ్ళు వెన్నెముకల్ని విరిచి మీ రాడించినట్లల్లా ఆడే రకంలాంటి ఆడంగులం కాం మేం. ఒక్కొక్క కాపరానికి ఒక్కొక్క దారి చూశారూ? మీరు చెప్పినట్లల్లా మీ ఆడవాళ్లు వినుకొంటారో, లేక మేం చెప్పుతున్నట్లల్లా మా మగవాళ్లు వినుకొంటారో – ఇట్లాగో, అట్లాగో – ఎల్లాగైతే నేం చూశారూ, మొత్తం మీద సంసారాలూ, వాటి వాటి అంతరంగిక రీతి రివాజు లాధారం చేసికొని సాగాలేకాని, అదే ముఖ్యం మరి - అంతేగాని, "మా ఇంటి దారిలో మీ ఇల్లు నడవాలి! అంటూ తెలిపుకోడంగానీ, తెలియజెప్పడంగానీ, వాదించి సాధించుకోడంగానీ ... పిచ్చి అంటే శుద్ధ పిచ్చి అనుకోండి. ఎల్లా ఉన్నప్పటికీ, మీరు గృహస్థులు. సాంసారికమైన సౌఖ్యాలూ, సంప

త్తులూ అనుభవిస్తూ వుండేవారు. కాపురాల్ని కూడపఱిచేది కష్టం! కూలదోయడం తేలిక! చూసారూ! కష్టమైనా కూడపఱిచేది పుణ్య కార్యం! ధర్మం. చూడండి, మీరైతే ఒంటిపాటుగానైనా సరే బదక డానికి శక్తి ఉన్నవాళ్లు. చైతన్యం ఉన్నవాళ్లు. కాని ఆ ప్రాణి వుందే అటువంటివాడు కాడు. శుద్ధ వెర్రి మొర్రి అవతారం ... అంతే కాదు అమాయకుడు. తప్పనేది అందర్లోనూ ఉంటుంది. ''ఉర్వి జనుల కెల్ల నుండు తప్పు''. తప్పులేని ప్రాణి ఒక్క పరమాత్ముడే. నా కూతుర్లో తప్పున్న సమయానికే చూశారూ, భూమిపై పుట్టి ఉన్నాం. మీలోనూ తప్పుంది. తప్పు ఉండడం ఓ ఆశ్చర్యమైన విషయం కాదు. తానైతే ఉన్న తప్పుని ఒకళ్ళ కొకళ్లు స్వీకరించి, మొత్తానికి ఒకళ్ళ కొకళ్ళు అన్యోన్యంగా సంసారం సాగించుకొనే దారిగా, తీరుగా, అతని కీ క్షణాన చెప్పడ మనేది మీ నేర్పుకు గుర్తు.. మీ ఇరుగు పొరుగు ధర్మమేగాక, అట్లా చేయడం, మీ మట్టుకూ, మీరు మీ కుటుంబాన్ని చేయిలో చేయి వైచి, నడిపించుకుంటూ, సుఖపడ్తారు. పొరుగు కుటుంబంలో మొగుడో దారి, పెళ్లాం ఓ దారిగా.... చేసిపెట్టడం ఏం ధర్మం చెప్పండి! .... మీరే శీఘ్రంగా నిర్ణయించుకోండి మీ మనస్సుకు మీరు.

సుబ్బణ్ణ: (ఇంటి మెట్లు దిగుతూ .... మున్సిపల్ తొట్టిని సరిజేసి సర్దుతూ) అర్థమైంది.... ఇటు రావమ్మా తల్లీ.... మీరూ రండమ్మా.

రంగణ్ణ: ఇదేమి టిల్లా వచ్చారు? ఇప్పుడు?

సుబ్బణ్ణ: (మెల్లగా) నోరు మూసుకొని ఉండండి! నే చెప్పిన దారికే వచ్చా రిద్దరూ చూశారూ! మీరు నిశ్శబ్దంగా ఉండండి అంతా చక్కబరుస్తాను. (గట్టిగా) రండమ్మా; ఇహ చూడండి! మీ సంసారం మీది మీదే అయినప్పటికీ చూశారూ.... పక్కింటిలో ఉండు కొంటూ, మీకూ మీకూ అన్యోన్యత లేకుండా అడ్డువస్తూ ఉన్న ఆటంకాల్ని చూసి చూసి .. మా ఇంట్లో నేను అనుభవించే సుఖాన్ని, నా పొరుగు పెద్దమనిషి అనుభవిస్తూ ఉన్న తాపాన్ని, పోల్చి తైపారు వేసి.... దుఃఖం నిండి, పొంగి పొరలి తొణికిసలాడి.... ఆప డానికి వీల్లేకుండా ఉక్కిరి బిక్కిరిగా పారి వస్తూ ఉంటే .... ఇతగాడికి

నిన్నటి రాత్రి నేను చెప్పిందంతా ఉపకారమౌతుందో లేక అపకారమే అవుతుందో అనే హంశాన్ని....పైన ప్రకాశిస్తున్నాడో ఇప్పుడు లేక ప్రకాశించడంలేదో. గాని రేపు తెల్లవారి ఉదయించే సూర్యనారాయణునికే ఎఱుక. అయితే తల్లీ! మీరే ఒప్పుకున్నారు గదూ....ఇహ లోకంలో కర్మ ఋణానుబంధం తీర్చుకోడానికి మనమంతా పుట్టి ఉన్నామనిన్నీ మన అందరిలోనూ తప్పు ఉండనే ఉందనిన్నీ; తమరే సెలవిచ్చిన మూల సిద్ధాంతంపైన ఆధారపడే, చూశారూ ఇప్పుడు నేనూ చెబుతున్నా. ఇంటిలోకి ధనధాన్యాలూ, కూర గాయలూ తెచ్చిపడేసి ఇంటి జరుగుబాటుకు కావాల్సిన ద్రవ్యాన్ని సంపాదించడం కోసం, దినమంతా పశువులా శ్రమించి, అలసి సొలసి ఇంటికి విచ్చేసిన పతికి భోజనం మొదలైన ఉపచారాలు ఏమంత మహోపచారాలు, నిజానికి - రాగానే కాలూ చేతులు కడుక్కోడానికో కుండెడు నీళ్లు, సంధ్యావందనానికి పంచపాత్ర, ఉద్ధరిణె తర్పణానికి పళ్లెం, ఆపైన చూసారూ! విస్తరేసి వేడివేడి అన్నం, చారు, మజ్జిగ, ప్రాణం లేచివచ్చేటట్లు పులుసు, కూరలు, పచ్చళ్లు, మొదలైన పదార్థాలు....మొత్తంమీద క్షుద్బాధ పతిదేవతకు పోగొట్టి తాంబూల మిచ్చి - ఇరుగుపొరుగువాళ్లు తమ ఎంగిలి విస్తరాకులు పెంటతొట్టిలో పారేయడం చూసి ఆడవాళ్ళ కవమానం కలగని రీతిగా చూసుకోవా లన్నదే రేపటినుంచీ మీ ధర్మమని సీతమ్మోరు తామే ఒప్పుకుని తమ పతికీ, తమ తల్లిగారికి నమస్కారం చేసి, వాళ్ళిద్దరి ఆశీర్వాదం పొందే పక్షాన....సామాన్లు జట్కాబండినుంచి తీయించి, లోపల వేయించి జట్కా ఖాళీగా పంపించడానికి, జవాబ్దారీ నేను వహిస్తా. ఇంత కంతటికీ మించి నా ఇరుగు పొరుగు ధర్మాన్ని ఎల్లాగా నడపుకొనేది; (రంగన్న బాహువుని నొక్కుతూ రహస్యంగా) ఇప్పుడు చూడండి....ఎల్లా దారికి వస్తుందో వ్యవహారం (రంగన్నను తనతో లాక్కొంటూ, జట్కాగుర్రం సమీపిస్తాడు).

సీతమ్మ: ఇదేమిటి తల్లీ! ఈ అఘాయిత్యం! నడిదారిలో నమస్కారం చేయమని హుకుం పారేస్తున్నాడు .. ఈ పాడు పిశాచివాడు.

సావిత్రమ్మ: అల్లావచ్చి పడింది దురవస్థ ఇప్పుడు! అల్లా వచ్చి పడిందమ్మా! ఇప్పుడు నువ్వూ నేనూ సంకోచంతో వెనకాడామో, హాని

మనకే....సర్వనాశం తప్పదు! ఆ పిశాచి మీద మనం మన కసి తీర్చుకోడానికి—అవకాశం పరమాత్ముడు రేపో మాపో .. ఇవ్వాళ కాకపోయినా చూశావూ, వీడో ఒకప్పుడు సమకూర్చనే కూరుస్తాడు. సధ్యా (ప్రస్తుతానికి) నాకో నమస్కారం పెట్టి, సిగ్గు విడిచి నీ పెనిమిటికి....''ఇంక మీద సరిగా ఉంటాం'' అని బిగ్గరగా మరీ చెప్పు వేగంగా.

[సీతమ్మ తల్లికి నమస్కరించి, పతిని సమీపించి ''ఇంకమీద సరిగా వుంటాం'' అని చెప్పి, నమస్కరించి తల్లి దగ్గరకు తిరిగి వచ్చి చేరుకుంటుంది.]

సుబ్బన్న: ఇంకేం కావాలి మీకు? అజీ సామాను ఫిర్ అందర్ రఖో (సామాను తిరిగి లోపల పెట్టవయ్యా!)

జాఫర్: క్యా సామీ! సామీకి బాత్ మే ఆజాకే....దుస్రా ఖాడాభి గమా లియా. (ఏం సామీ! సామి మాట నమ్మి మరో బాడుగ గూడా పోగొట్టుకున్నా!) (ట్రంకు, బెడ్డింగు అరుగుమీద ఉంచి) అబ్ క్యా, ఖాలిగాడి, ఖాలీ హాత్, హమార దళాల్కా దిఖా యాతో జూతీక మార్తి సామి! మేరా హాల్ క్యాసమ ఝ్తిం? ఇన్నాప్పే సోచో సామీ! జనివార్ కుదేఖ్తే జాన్‌హార్ కుదేఖో సామీ! (ఇప్పు డేమిటి, ఖాలీబండి, ఖాలీ చేతులు మా దళారికి చూపిస్తే చెప్పుతీసుకొని కొట్టాడు సామీ! నా సంగతి ఏమి టనుకుంటున్నారో! న్యాయంగా ఆలోచించండి సామి! జందెం ఏం చూసుకుంటావ్! జంతువును చూడండి సామి!) మూగ ప్రాణి ఇది సామి! అందులోనూ ఆడగుర్రం!

సుబ్బన్న: ఈ రెండణాలూ తీసుకో. (అరుగుమీద నున్న నోట్లమీద వున్న రెండణాలబిళ్ళ తీసి జాఫరు కిస్తూ) బస్‌జీ! లేకోచల్జీ! నస్దీక్ హైజీ....పోలీస్ స్టేషన్. తంటాకరో నక్కో (చాలుతే! తీసుకొని పోవయ్యా! దగ్గిరే వుంది పోలీసుస్టేషను....జగడం పెట్టుకోకు.)

[జాఫరు గుర్రాన్ని వెనక్కునెట్టుతూ ''సిర్ పై పహాడ్ ఫిసర్ హి సయ్యాతో క్యాకరీఙ్గా! బొమ్మనోంకే హాల్ ఐసే రహేతో ఫిర్యాద్ కహాంకరీమ్!! (తలపై విరిగి పర్వతం పడుతుంటే ఏమిటి

చెయ్యడం! బాపనోళ్లపని ఇల్లావుంటే ఎక్కడ ఎవళ్ళతో ఫిర్యాదు చేయడం! అని గట్టిగా గొణుక్కుంటూ....నిష్క్రమిస్తాడు. ]

సుబ్బన్న: లోపలికి పదండి సార్! పదండమ్మా లోపలికి.

[ ట్రంకునూ, బెడ్డింగునూ ఎత్తుకొని లోపలికి ఆడవాళ్ళ వెనక వెళ్ళడాని కుపక్రమిస్తాడు.]

పార్వతమ్మ: (తటుక్కున ప్రవేశించి) అదేమిటి పిచ్చి, పొద్దుటి అంటుగిన్నె అల్లాగే పడి వుంది పెరట్లో, దాన్ని తోమకుండా, మీ పొట్టా పాడు చూసుకోకుండానే ఊళ్ళో వాళ్ళ కంతా కూలిపని చెయ్యడం ఈ వేళ్ళప్పుడు....ఇదేం పిచ్చిపట్టిందంటే ?

సుబ్బన్న: (కళ్ళు మిటకరిస్తూ) కాదు .... ఉపకారం ....ఇరుగు పొరుగు ధర్మం.

పార్వతమ్మ: మంచి ఉపకారమంటేనూ! తగలడనీ! మీపాడు ఇరుగుపొరుగు ధర్మం! ఈ పొద్దు రాత్రి మీ ఆకలి తీరాలి అంటే మీరు వంట చేసు కొంటేనే, అంటుతోమని గిన్నెతో. ఇమ్మ ఫలహారమే నాకూ సరి పోయింది. ఆ పాడుసామాన్లు బండిలో వేసుకొని జేరుస్తారా లేక.... వాకిలి వేసేసుకొని నిద్రపొమ్మంటారా మమ్మల్ని—మిమ్మల్ని ఈ అరుగుపాల్జేసి ?

లక్ష్మీదేవమ్మ: (ఠట్టున పార్వతమ్మ పక్కకువచ్చి) అరుగుపాలు ? మా మంచిపనే! అది కాదులే. ఇంట్లో అలకడానికి ఓ గురువింజగింజంత పేడైనా లేదు! (చేతిలోని వెదురుపళ్ళిక కూతురి చేతిలోపెట్టి) "ఈ వెదురుపల్లికనిండా పేడతెచ్చి ఇల్లంతా అలికితేనే వంటకు పొయ్యి అంటించేది నువ్వు; లేకపోతే వాకిలి తెరిచేదిలేదని చెప్పవే నీ మొగుడికి...."

సుబ్బన్న: (ట్రంకు బెడ్డింగు అరుగుమీద కడు జాగ్రత్తగా దింపిపెట్టి గద్గద స్వరంతో) అదికాదుగాని....

పార్వతమ్మ: అదుకాదు లేదు; ఇదికాదు లేదు. అదంతా అట్లా వుంచండి ... ఇదిగో తీసుకోండి (పల్లిక మొగుడి చేతికందిచ్చి) అమ్మ చెప్పినటు

తట్టనిండా భర్తీచేసుకొని రండి....ఇంకమీద జగడం అనేది లేనే లేదు....ఇంటిలో!

సుబ్బన్న: అది కాదే! ఈవేళటప్పుడు ఈ తట్టనిండ పేడ ఎక్కడినుంచి తెచ్చేది నేను?

లక్ష్మీదేవమ్మ: ఏమో! దేవుడి దయ! గుడిలో దర్శనం చేసుకొని వచ్చే టప్పుడు-బుళ్ళప్ప సత్రంముందు - ఒకటికాదు, రెండుకాదు, ఎనిమి దెడ్లబళ్లువచ్చి విడిచివున్నాయి. కృష్ణపక్షం, చీకటి, ఎవరికీ కనిపిం చేదిలేదు. రావే! లోపలికి పోదాం.

(పార్వతమ్మ లక్ష్మీదేవమ్మ నిష్క్రమణ)

[ఈ కలహాన్ని చూసి, విని పొంగివస్తూవున్న నవ్వును, ఆపుకో లేక సీతమ్మ, సావిత్రమ్మ చెరుగుతోనూ, ముసుగుతోనూ ముఖాన్ని కప్పుకొని, ఇంటిలోకి దూసుకొని వెళ్ళిపోతారు.]

రంగన్న: (సుబ్బన్నను సమీపించి మృదువచనాలతో) చీకటా పాపం! లాంతరివ్వనా?

సుబ్బన్న: (ఝుండి పడి) చీకటేం భయమేం వచ్చింది! పెరిగి పెద్దైన మగోడికి!

రంగన్న: ఆ తట్ట ఇటుఇవ్వండి (అని, తిట్ట గుంజుకొని నేలకు వేసి నుగ్గుచేసి రెండు చేతుల్తోనూ, చిన్నచిన్న తుంపుల్ని మున్సిపల్ తొట్టిలో విసిరి కొట్టి) ఎందుకో ఈ వెర్రిఆలోచన? నావ్యాధికి ఔషధంగా ఈ పొద్దు మిగిలిన ఇరవై ఐదు రూపాయలూ ఎక్కడికీ పారిపోయేది లేదు. రేపు రాత్రి మీ అరుగు మీదవుంచి అదే జట్కాబండి తెప్పించి....అదే నమ స్కారం! ఉండనీ రండి! (సుబ్బణ్ణను లాగి తన ఇంటి అరుగు సమీ పించి) అరేరే!

సీతమ్మ, సావిత్రమ్మ: (ఇద్దరూ పరుగెత్తు కొని వచ్చి ఏకగ్రీవంగా) ఏం??!!

రంగన్న: (గర్జిస్తూ) ఓ కుండలో నీరు, చెంబూ!!

[అని ముగించేలోపల సీతమ్మ నీరు నిండిన కుండనూ, సావిత్రమ్మ ఖాళీ చెంబునూ అరుగుమీద తెచ్చిపెట్టుతారు.]

రంగన్న: ఇంట్లో రవ్వేమో! నూకలేమో! ఉప్పుపిండి....ఓ చట్నీ....బుళ్లప్ప సత్రంలో పొరుగావిడ చెప్పినట్టు ఎద్దుబళ్ళువచ్చి దిగివుండేపక్షాన

ఎదురరంగడి....మునియమ్మ దుకాణం మూసివుండేదిలేదు. ఓ కట్ట తమలపాకులు, వక్కలూ, సున్నం....చిల్లర వుందా మరి మీ అమ్మ దగ్గిర?

సావిత్రమ్మ: (వినయంతో) ఊఁ! (తొందరగా మెట్లు దిగి నిష్క్రమిస్తుంది. సీతమ్మ లోపలికి వెళ్తుంది.)

రంగన్న: చూడండి సుబ్బన్నగారూ! ఇంత వేళప్పుడు చిక్కే తమలపాకు, మైసూరు కవటాకో 'అంబాడి'యో సున్నానికి.. .మద్దూరులో చుట్టా లెవ్వరూ లేరు. ఇంక వక్క....మా అత్తకు తోటేమీలేదు మల్నాడులో.

సుబ్బన్న: (పంచె మోకాలిమీదికి ఎత్తి కట్టుకొని కుండనీటిని చెంబులో వంచుతూ) స్వామీ! శరణాగతున్ని రాపాడరాదు! చిక్కిపడివున్న ప్రాణిని సతాయించడం బాగోదు!

రంగన్న: సరేలే కానీ! సుబ్బన్నగారూ! నిన్నటిదాకా తగినంత బందో బస్తుగానున్న మీ సంసారం ఈ పొద్దు ఇల్లా ఎందుకని పల్టీ కొట్టింది?

సుబ్బన్న: (కోపం మొగంతో) ఏమి పల్టీ?

రంగన్న: పల్టీగాక ఏమిటి? నిన్న ఈపాటికి మీరు సాపడ్డ మీ ఎంగిలి విస్తరాకు సభక్తికంగా ఎత్తి ఇదే తొట్టిలో పారేసిన మీ పత్ని.... ఇవ్వాళ్ళ ఎందుకిట్లా ఎదురుతిరుగుకొంది?

సుబ్బన్న: మా మంచి చిత్రహింసే మీది! నిన్నేమిటి? ఇవ్వాళేమిటి? మొదటినుంచీ ఒకే రాత రాసివుంది నా మొహాన! ఆమె పారేసిన ఎంగిలాకు ఆమె తిన్నదే! నేను తిన్నది కాదు.

రంగన్న: మరి మీరు భోంచేసి....చేతులు కడుక్కొన్నది?

సుబ్బన్న: చేతులు కడుక్కోటం నిజంగా చూసారా! అయితే భోంచేసికాదు! ఆ పాడుమొహంది భోంచేసిన స్థలాన్ని పేడపెట్టి అలికి, చేతులు కడుక్కొన్నాను నేను. 'దమ్మయ్యా[1]! చాలు మీ ప్రశ్న పరంపర! భూతదయ అంటూ విన్నారు గదూ!

రంగన్న: క్షమించండి .... కాలు చేతులు కడుక్కొని లోపలికి రండి. మీరేమి చెప్పినా ఇరుగు పొరుగంటే, ఇరుగుపొరుగే చూశారూ మరి!

[తెర మెల్లిగా పడుతుంది.]

---

1. దమ్మయ్య = జాలిగుండెలవాడా! ధర్మప్రభువా! అని అర్థం —అనువాదకుడు.

పాత్రలు:

యువకుడు

అతని భార్య

అతని స్నేహితుడు శీను

సూచన :— అన్ని హక్కులూ శ్రీమతి శారదా జాగీర్దారు (ఆద్య) గారివి.

# దాంపత్యం రగడ

[మధ్యవర్గానికి చెందిన ఒక యువకుని కుటుంబ దృశ్యం. ఒక్క-కాదు-ఒకే ఒక్క గది. కుడిప్రక్క గోడకు ఇంటికి సంబంధించిన చెంబూ తప్పాలాల సామాన్లు రకరకాలుగా పేర్చబడి వున్నాయి. ఎదురుగా ఉన్న గోడకు రెండు ఆదర్శవాక్యాలున్న అట్టలు అతికించబడి వున్నాయి. ఎడంప్రక్క గోడకు పుస్తకాలూ - ఆలుమగల బట్టలూ, పాత పేపర్ల కట్టలూ - మొదలైనవి పడివున్నాయి. ఈ గోడకు రంగభూమి చివరితట్టు బైటికిపోయే వాకిలి. దీనికి ఎదురుగా కుడిప్రక్క గోడకు రంగభూమి పై భాగానికి, లోపలికిపోయే వాకిలి. తెరపైకి లేచేటప్పటికి - ఉదయం పదిగంటల సమయం - ఎదురుగా సామెతలు రాసి వున్న అట్టలకానుకొని ఎడంప్రక్కకున్న చిన్న విరిగిపోయిన బెంచీకి చేయి జేర్చి, క్రిందవేసివున్న జంపకానామీద కూచునివున్న యువకుని ప్రవేశం - వయస్సు సుమారు 28. వేషం గుండీలు లేకుండా తొడిగిన షర్టు, పైకి పెట్టకుండా కట్టిన ధోతీ, నగ్న శిరస్సు. తెర ఎత్తగానే కుడిప్రక్క అంటే లోపలికిపోయే వాకిలి నుంచి బట్టలుతికే చప్పుడు వినవస్తోంది. యువకుడు ఆ ప్రక్క ఒక్క నిమిషం తేరిపార చూస్తాడు. అతని ఎడంచేతిలో ఒక తెల్లకాగితం తుంపు, కుడిచేతిలో పెన్సిలు; వాకిలి వైపు చూసి నప్పుడు పెన్సిలును చెవిలో పెట్టుకొన్నాడు. క్రమంగా అతని మొహం విప్పారింది. ఎదురుగా చూస్తున్నాడు. ధోతీ ఉదికే చప్పుడికి తాళం వేస్తున్నాడు, క్రమేణ ఏవో కూని రాగాలతో పలుకడం ప్రారంభించాడు; ఆ తర్వాత గొణుక్కుంటూ తాళానికి తల ఊగిస్తూ ఒకటి రెండు నిమిషాలు

కాగితంమీద వ్రాయడం మొదలుపెట్టాడు. చివరికి దాన్ని స్పష్టంగా తనలో తాను చదువుకొని గట్టిగా పాడుకొంటున్నాడు.

భారత వీరుల్లారా!
మితిమీరిందీ దాస్యం
లెండి లేవండి ముందుకు పదండి
స్వతంత్రకాహళి ఊదండి.

ఈ రెండు పంక్తులూ పలికేటప్పుడు, కుడిప్రక్క వాకిలినుండి స్త్రీ ప్రవేశం - బట్టలుతుకుకొని వచ్చిన వీరవేషంలో వుంది. వాకిట్లో నిలబడి ఒకే తీరుగా ఏకధాటిగా యువకుణ్ణి చూస్తోంది. కాని అతడు దాన్ని గమనించడు లేదు. ఆవేశం పొంగులో ఆకాశం వైపు చూస్తూ గట్టిగా పలుక ప్రారంభించాడు.

"లెండి లేవండి ముందుకు పదండి
నెయ్యంతో, కయ్యం మాని బదకండి
దేశంలో శాంతి, విశ్రాంతి నిలపండి
తెలివిలేమి, కలిమిలేమి, వెలివేయండి
విశ్వం సమస్తం, విస్మయమందేలా
ఏలండి! లేవండి! ముందుకు పదండి!"

అంటూనే ఆవేశముద్రతో లేచి, అటూ ఇటూ చూసేటప్పుడు, ఎడంపక్క ఉన్న పెళ్లాన్ని గమనించి]

యువకుడు: (పిచ్చి నవ్వునుండి తప్పించుకొనే యత్నంతో) హి... హి .. హి .... (ఏం మాట్లాడవలసిందీ తెలియక) జైహింద్ (అని గంభీర ముద్రతో అంటాడు).

పెళ్ళాం: (ఉక్రోషపుచ్చి) ఊం! పిండడానికి 'జై' కావాలో, 'క్రై'[1] కావాలో అటు లోపలికి వచ్చి నేను ఉదికిన బట్టలు పిండితే తెలుస్తుంది!

---

1. క్రై = చేయి.

యువకుడు: (ఆకాశం నుంచి అమాంతం పడి బాధపడేవాడిలా) కాదు కాదు - ఇటు చూడు - నువ్వు అలా ఓ తాళబద్ధంగా బట్ట లుతుకుతూ ఉండడం విని మంచి ఉత్సాహం రేకెత్తింది నాకు. అందుకని—

భార్య: (మధ్యలో) స్వతః మెదలకుండా కూచుని, మిగతా జనం ఒళ్లు విఱుచుకొని బండచాకిరీ చేయడం చూస్తూ వుంటే మీకు మాంచి దీప్తి స్ఫూర్తులు వస్తూ వుంటాయి ఎప్పుడూ! అంతేగా!

యువకుడు: (ముందుకు వచ్చి సర్ది చెప్పే తీరులో) ఇటు చూడు - స్వాతంత్ర్యం చిక్కి ఇండియా వాతావరణమే మారిపోతూ వుంటే - మన ఇంట్లోనూ ఒక కొంత మార్చుకొందాం సరేనా?

భార్య: ఏం వాతా మరణమో ఏమో!

యువ: వాతా మరణం....కాదు వాతా వరణం **atmosphere**, 'హహ'.

భార్య: (మధ్యలో) అబ్బో! ఏం నాల్గు కిటికీలున్న ఇల్లని 'హవా' మార్చడానికి బైల్దేరారు మాలావు.

యువ: (మాట మార్చే ధోరణిలో) ఇప్పుడు గంట లెన్ని కొట్టారు? (అటు ఇటూ చూసి) అఁ! అన్నట్టు ఓ గడియారం తెచ్చి ఇంట్లో పెట్టాలి.

భార్య: ఇంక ఆ సాకు పెట్టుకుని ఊరివెంట పడకండి ఊరేగడానికి. ఇదిగో ఇప్పుడే పంపు వచ్చింది – పదిన్నర అయివుంటుంది.

యువ: (ఒక్కసారిగా) పదిన్నరే! అరరే అతనికి పదుకొండు గంటలకు రమ్మనమని చెప్పా. వచ్చేవేళ అవుతోంది కదూ!

భార్య: (ముందుకు వచ్చి) మళ్ళీ ఎవర్ని రమ్మనమని పిలిచారు? (అతడు తన్ను కాదన్నట్లు, అటూ ఇటూ ఏమో వెదుకులాడుతున్నట్లు నటిస్తుంటే, గట్టిగా) ఎవళ్ళను రమ్మనమని పిలిచి వచ్చారు? అని అడుగుతుంటే? .... భోజనానికి రమ్మనమని ఆహ్వానించారా ఏమిటి మరి!

యువ: భోజనానికి? ఛీ....ఛీ! నేనేమీ అట్లా చెప్పలా – భోజనానికి అల్లా చెప్పడం నాకు గుర్తు లేదు. మరి పదకొండు గంటలు' అన్న మీద భోజనానికని అనుకుంటాడో యేమో మహానుభావుడు!

భార్య: (తిరస్కారంగా) అబ్బో! మీ వెర్రి నాకు తెలియదనుకుంటున్నారా? తెలుసు – భోజనానికి పిలిచారు – ఇప్పుడు ఎదుట చెప్పే ధైర్యంలేని వాళ్ళు ముందుగా చెప్పడం అంతంత మాత్రమే!

యువ: లేదు లేదు; ఆయన.... అతనే.... శీను .. ఒక్కడే.... వస్తాడు.

భార్య: ఒక్కడే రానీ! కౌరవులలా నూటొక్కమందే రానీ .... ఇంట్లో సామాను ఏమన్నా వుంటే మనకు చింత.

యువ: (తిరిగి మొదటిచోట కూచుని) ఓసి! ఇటు చూడు! అతన్ని నేను భోజనానికి రా అని చెప్పింది నిజం. మన మేం తింటే అదే తింటాడ తనూ – అతడేమీ . ....

భార్య: (మధ్యలో) మన మేం తింటాం. ఒకళ్ళమీద ఒకళ్ళం పళ్ళు పట పటాయిస్తాం!

యువ: (ఓదార్చే తీరులో) అదే వద్దంటా! వాతావరణం అంటే హవా – Atmosphere–మార్చేద్దామంటున్నా. ఎందుకు కఠినంగా మాట్లాడు తావు? చెప్పు చూద్దాం–సుఖంగా ఎందు కుండకూడదూ అంటున్నా– దేశానికి స్వాతంత్ర్యం వచ్చిందాయె!

భార్య: (మధ్యలోనే) ఓహో! మీ స్వాతంత్ర్యం మీరూ! రెండుపూటలా దాన్నే తిని పొట్టనింపుకుంటే సరి! నాకూ పొయ్యి ముందు కూచుని కన్నీళ్ళు కార్చడం తప్పుతుంది – మీతో ఉండి ఈ సంసారంలో ఏం చూసుకొని సుఖ మనుభవించాలి! చెప్పండి!

యువ: సుఖం లేకుండా ఉంటే మాత్రం కఠినంగా ఎందుకు మాట్లాడడ మంట. తీరా చూస్తే దేశంలో ఇంతమంది కష్టపడుతున్నారు – దాన్ని చూసైనా ఓర్చుకోవాలా అక్కర్లేదా?

భార్య: (కోపగించుకొని) అంటే? నా మొహాన కష్టపడడమే రాసివుం దంటారా? ఏమిటి?

యువ: (నవ్వుతో) లేదు .... ఔనా మరి! పద – అల్లా అయితే – నువ్వు నీ పనికి (ఒక్కసారిగా) – ఊం! .... ఔను చూడు.... వాళ్ళ వాళ్ళ పనుల్లో వాళ్ళు వుంటే, దేశంలో జాతి జగడాలు కూడా కావాల్సిన పనిలేదు.

భార్య: దేశానికెందుకు బుద్ధిచెప్పడం? మొదట మీరు ఎదైనా పని చేబట్టండి దాంతో ఇంట్లో కాటకం తప్పుతుంది.

యువ: (ఉత్సాహంతో) దానిచింతే వదలి పెట్టు....దేశం వాతావరణమే అంటే Atmosphere 'హవా'యే మారిపోతుంది. పని లేకపోతేనేం?

భార్య: మాబాగా చెప్పారు....ఆలోపల నాకు లోపలికి కూరలు పంపించండి. పదండి (బైల్దేరూతూ) రండి - తొరతొరగా .... మీ స్నేహితుడు శీనూకు తిండి దొరకాలంటే....(వెళ్తుంది)

(యువకుడు చేతిలోని కాగితంవైపు చూస్తూ ఏం చెయ్యాలా అని అను మానిస్తూ నిలబడ్డాడు. దాంతో మళ్లీ తిరిగివచ్చి) లోపలికి వస్తారో! రారో!

యువ: (హడావుడి పడుతూ) ఆ! వచ్చా...

భార్య: ముందుకు రండి. అప్పుడే నాకు నమ్మకం.

[యువకుడు లోపలికి వెళ్తాడు. ముఖం తిప్పి ఆమెను చూసి వెంటనే లోపలికి పరుగెత్తాడు. పెళ్ళాం ఓ నిమిషం అతను పోయినవైపు చూస్తూ క్రమంగా చిరునవ్వు నవ్వుతూ వేషాన్ని సవరించుకుంటూ రంగభూమి మధ్యవరకూ నడచివచ్చి-సామెతల అట్టమీద చేయిపెట్టి మరోసారి లోపలికి చూసి, ఆలోచనా ముద్రలో నిలబడివుంటుంది. ఒకే నిమిషంలో యువకుడు బైటికి వస్తాడు. పెళ్ళాన్ని ఏకధాటిగా చూస్తాడు. ఆమె ఆలోచనామగ్ను రాలుగా వుండడం నటించి, అతని రాకను గమనించలా. యువకుడు 'ఊం!' అని ఉచ్ఛ్వసించి, తనూ ఆమె వైపు చూడకుండా తన ధోరణిలో తాను నడిచి బెంచీమీద కూర్చుంటాడు ఎదుటికిచూస్తూ]

యువ: (ఆకాశంవైపు కన్ను పెట్టి) "కాంతామణి రమణీ" (దొంగచూపుతో చటుక్కున భార్యను చూసి తిరిగిమొదటి లాగానే) శాంతామణీ, రమణీ! వంటింటికి రాణీ!(అని గొంతు పలికిస్తాడు.)

భార్య: (ముందుకు వచ్చి, అతని వైపుచూడనట్లు నటించి ఎదుటికి చూస్తూ కంఠం కలుపుతుంది)

[చివరి రెండు పంక్తులూ అనేటప్పుడు ఇద్దరూ నవ్వు మొహాలతో చేయిచేయి గలుపుకొని, ఎదురుబదురుగా నిలబడతారు. ఇదే సమయానికి బైటి వాకిలినుండి ఇంకొక్క యువకుడు వస్తాడు వీళ్ళిద్దరు అటు చూడరు. కొత్తవాడు ఒక్క నిమిషంపాటు ఇద్దరినీ చూసి చివరికి——]

కొత్త: (గట్టిగా) ఓం – భవతి——

[ఇరువురూ నిల్చున్నవాళ్లు నిల్చున్నట్లు చకితులై మౌనంగా వుండిపోతారు]

భిక్షాందేహి – (ఇద్దరూ తన్ను చూడగా) కొంచె మిటు చూడండర్రా నావైపు అంటున్నా.

[పెళ్ళాం సిగ్గుతో పక్కచుట్ట చివరికి జరిగి నిలుస్తుంది]

యువ: (గొల్లున) హి హి హి హీ! ఎప్పుడు వచ్చావో!... శీనూ ?

శీను: ఎప్పుడు వచ్చానా! నేను రాకుండా వుంటే పోలీసులు వచ్చివుందురు.

యువ: అం ?

శీను: అం! ఏమిటంటావు ? మీ సంగీతాన్ని వినడానుక వాకిట్లో రోడ్డునిండా జనం నిలబడి వుంది... రోజులే అటువంటివి !

ఏమిటో దొమ్మీ అయిందని తెలుసుకొని పోలీసులే వచ్చి వుండాల్సింది.

యువ: (నవ్వి) హ్హా హ్హా! జనాల్ది ఒకటే విచిత్ర స్వభావం – ఇంటిలోపల పాడితే గుంపులు గుంపులుగా గుమికూడ్తారు వినడానికి... స్టేజిమీద పాడితే ఒక్కడూ వినేదిలేదు.... అహ్హా హ్హా !

శీను: (చకితుడై) అంటే ఏమిటి ? రిహార్సలే నడిపిస్తున్నారా ఏమిటి ? (ఇద్దరినీ చూస్తాడు)

యువ: (పెళ్లాంవైపు చూస్తూ) ఏమిటి నడిపిస్తున్నాం ? నీకు జ్ఞాపకం వుందా ఏం?

పెళ్లాం: (సిగ్గుతో) చాలు పొండి! (బెంచి వైపుచూస్తూ) వచ్చిన వాళ్లని కూచోమనడమన్నా లేదు. (బెంచీని లేపుతున్నట్లు చేతితో పట్టుకుంటుంది)

యువ: (హడావిడిగా నడిచి, దాన్ని ఎత్తి రంగభూమి మధ్య పెట్టుతూ) 'కూచో మనికూడా అనలేదా అంటే ? కూచోడానికి వస్తేవాళ్లే కూచుంటారు; లేకపోతే మనం చెప్పినా కూచునేది లేదు; 'అంతేనా? (శీనుకు చెప్పితానే ముందుగా కూచొని) ఊఁ! కూచో అప్పా!

పెళ్లాం: (తలుపు చాటుగా నిలబడి) చాయి తెచ్చి ఇస్తున్నా (లోపలికి వెళ్తుంది)

[యువకుడు వైభవంతో కూడిన ముఖ ముద్రతో శీనూను చూస్తాడు. శీను నిరాశగా ఊర్పు పుచ్చుతాడు. లేచినవాడు లేచినట్లు అటూఇటూ విచారంగా తిరుగుతాడు. యువకుడు ఏమీ తెలియక కొంచెం గాబరాపడ్డ ముఖంతో అతన్ని ఏకధాటిగా చూస్తాడు]

శీను: (యువకునికి ఎదురుగా ఒక్కసారిగా ఆగి నిలబడి) నీ ముహం చూస్తే నాకు ఏడుపు వస్తోంది.

యువ: (అదేపనిగా చూస్తూ) భలే! మాంచి స్నేహితుడవు! (లేచివచ్చి అతని భుజంమీద చేయిపెట్టి) ఎందుకో? (జాలి వెలిబుచ్చే ధ్వనితో) ఏమైందో! శీనూ!

శీను: (విషాదంగా) మనదీ ఆగష్టు 15 అయింది! (ఊర్పు పుచ్చుతాడు)

యువ: (ఆశ్చర్యంగా) అగష్టు 15! అదేదో రోగంపేరు చెప్పనట్లు చెప్పావు గదూ! నీ తస్సాగొయ్యా!

శీను: (కంపిస్తున్న కంఠంతో) రోగం కాదు కేవలం పిడుగు, పిడుగు అది.

యువ: (తెలియక కొంచెం కోపధ్వనితో) ఏమిటది? ఆగస్టు 15 అంటావు! పిడుగంటావు?

శీను: (మెల్లిగా) స్వాతంత్ర్యం! అంటే బ్రిటిషువాళ్లు పోయిందిలేదు; ముసల్మానులు ఉన్నదిలేదు.

యువ: (నిరాశతో) థూ! నీ మొహమీడ్చిరి! ఏమంటాడో అని అనుకుంటున్నా. ఇండియాకు వచ్చిందానికి నువ్వు ఎందుకు ప్రత్యేకించి, మైల వచ్చినవాళ్ళులాగా మొహం పెడ్తావు? ఛీ! ఛీ!

శీను: (సంతాపంతో) దేశానికి వచ్చిన ఉపద్రవమే మనకూ వచ్చింది. నేనూ ఇప్పుడు స్వతంత్రుణ్ణి (తిరస్కారంతో) స్వతంత్రుణ్ణి!

యువ: (అతని చెయ్యి పట్టుకొని గుంజి బెంచీమీద కూచోబెట్టుతూ) ఓ యింత బుద్ధితెచ్చుకొని కారుతూవున్న చెమట తుడుచుకో...చాయి తాగు, ఆ పైన నేనూ, నీవూ స్వాతంత్ర్య జెండా ఎగరేద్దాంలే!

శీను: (తిరస్కారంగా నవ్వి) నా స్వాతంత్ర్య జెండా! అంటే-వంటిల్లు!

యువ: (ఒక్కసారిగా జ్ఞాపకానికి వచ్చి) ఊ! ఊఁ!' ఇప్పుడిహ నా సుఖం చూడు మరి! – దాని ధ్వజంకూడా వంటింటిలోనే– నిన్నరాత్రి నువ్వు చెప్పావు. ఇవ్వాళ ఇక్కడే భోజనానికి వస్తానని...నేను సరేలే అన్నా నీతో. "భగవంతుడు కాపాడుగాక!" అనుకొన్నా మనస్సులో. అన్నట్లు (మెల్లగా) ఆమెతో చెప్పనేలేదోయి! ఇవ్వాళ పొద్దున్నే చెప్పాననుకో 'ఇంట్లో వంటసామానే లేదు' అంటోంది. వంటింటిలోకి కూరగాయలు పంపించండి అని హుకుం చేసింది (అభిమానంతో) శీనూ! శీనూ! నీతో అన్నానేగాని, వంటింటిలోకివెళ్ళి చూడు తెలుస్తుంది అంత వంటా ఏంచక్కగా తయారై కూచుందో!

శీను: (ఆశ్చర్యంతో) అంటే! నేను చెప్పిందంతా మీ ఇంటావిడకే?

యువ: ఏమంటావు? నువ్వు చెప్పావా! ఆమెకు? మరి నాతో....

శీను: (అమాంతంగా పెద్ద పెట్టున నవ్వి) హ్హ హ్హ! నీతో చెప్పివుంటే తిండివచ్చే తీరు అంతంతమాత్రంగానే వుంది! అందుకని మొదట ఇక్కడికి వచ్చి ఆమెతో చెప్పా. ఆపైని దారిలో నువ్వు తటస్థపడితే, సరేనని నీకూ చెప్పా. హ్హి హ్హి.

యువ: (కోపంతో) ఊఁ! ఇదా ఆగస్టు 15 ఏమిటి?...మా ఇంటిలో చట్టం ప్రకారం నేను స్వతంత్రుణ్ణి; అమె కేవలం బ్రిటిషువాడిలా మేనేజరు. అంతే!

శీను: ఇటే వస్తున్నారామె....ఏం చెబుతావో చెప్పు.

[భార్య చాయి కప్పులు తీసికొనివస్తుంది]

యువ: (చిరుబుర్రాడుతూ) ఒసేయి! నా కప్పు కిందపెట్టు....మొదట నే నడిగేదానికి జవాబు చెప్పు....శీను భోజనానికి రావడం నీకు ముందే తెలుసన్నమాట? (తల ఆడిస్తుంది) నేను నీతో చెప్పిందానికంటె

ముందే నీకు తెలుసా? (మళ్లీ తల పంకిస్తుంది) మూడోసారి అడుగుతున్నా....కాయా, మనసా, వాచా త్రికరణశుద్ధిగా చెప్పవే!.... తెలుసా అంట???

భార్య: (గట్టిగా) ఔనండీ! తెలుసు.

యువ: మొదటే... అంటే .. నన్ను చాటుపఱచి....అవునుగదూ!

భార్య: మీరేగా ఇప్పుడు చెప్పింది. మన పనులు ఎవళ్ళకు వాళ్ళం చేసికొనిపోతూవుంటే కలహమే వుండదని – వంటింటిపనిలో మీకు తెలయాల్సిన పనేముంది?

యువ: (శీనుతో) అంటే నీకు నువ్వు స్వతంత్రురాలివై పోయినావన్న మాట. జనంవున్న ఇంట్లో.

భార్య: ఓహో! మీతోనూ చెప్పారా ఆయన! (శీనువంక చూస్తుంది.)

యువ: అదే చెప్పాడులే పాడుమొహం పెట్టుకొని!

భార్య: (జాలితో) పెళ్ళాం విడిచి లేచిపోయింతర్వాత పాపం! పాడు మొహం కాకపోతే మరేమిటి వుంటుంది.

యువ: అమాంతం–పెళ్ళాం వదలి చక్కాపోయినమీద? అంటే నువ్వు నన్ను వదలి లేచిపోతావా?

శీను: (ఒక్కసారి మధ్యలో) ఓయి! మహానుభావా! నా పెళ్ళాం నన్ను వదలిపెట్టి పోయిందిగా! ఆ సంగతి చెబుతోందామె!

యువ: వీడి చక్కాపోయింది! చిన్నపిల్లడివా ఏమన్నానా నిన్ను విడిచి వెళ్ళితేమాత్రం పాడుమొహంపెట్టి ఏడ్వడానికి? ఎక్కడికి పోతుంది? ఏట్లోకి! నువ్వూ వెళ్ళితే బావుంటుంది ఆమెతో కూడా.

భార్య: (తిరస్కారంగా నవ్వి) అయ్యో! నా ఖర్మ! 'పెళ్ళాం లేచిపోయింది' అని చెప్పినా కూడా ఈయన బుర్రకెక్కలేదు!....చాయి తాగండీ ... చల్లారిపోతుంది.

[ఇద్దరూ చాయివైపు చూస్తూ మొహాలు కిందికి దింపుకొని చాయి తాగుతున్నారు. అంతవరకూ మౌనం.]

యువ: (చాయి ముగించి తనవరకే అన్నట్లు) ఊహూ! ఇల్లా జరిగింది- అని అంటున్నావా?

[శీను చాయి ముగించి కప్పును పక్కకుపెట్టి మెదలకుండా ఉండి పోతాడు]

భార్య: (రెండు కప్పుల్ని చేతిలో సంబాళించుకొంటూ) ఆమె నొసట రాయ లేదు సుఖమనేది!

యువ: (కోపంతో) అంటే? ఈయన మొహాన రాసివుందంటావా ఏమిటి?

భార్య: ఎందుకు రాసివుండకూడదు?

యువ: ఈయన నుదుట రాసివుంటే నుదుటికి నుదుటి సంటించి ఆమె నుదుటిపైనా రాయించి వుండవచ్చు.

భార్య: (చీదరించుకొని) చాలు. మీ నాల్కకు హద్దూపద్దూ లేదు (అను కుంటూ లోపలికి వెళ్తుంది.)

యువ: (శీనును చూసి) ఛీ! నువ్వు చేసిన పాడుపని! 'పెళ్లాన్నే వది లేసాను' అని చెప్పవచ్చుగా! "పెళ్లామే వదిలేసింది" అని అంటాడు మగవాడు!

శీను: (లోపలి దర్వాజావైపు చూస్తూ) నేనే వదిలేసానో!....ఉన్నమాట చెప్పాలంటే నేనే ఆమెను బైటికి నెట్టిపారేసా.... అయితే నీ పెళ్ళాం, ముందే అల్లా చెప్పితే 'తిండి తినడానికి రా' అని పిలుస్తుందా?

యువ: (ఉత్సాహంతో) నువ్వే బైటికి నెట్టేసావన్నమాట! నువ్వే! అరి పిడుగా! ఔనా మరి! చేయి ఇటు పడెయ్యి. (హస్త సంచాలనం చేస్తాడు) అదీగాక - ముందటి నీ తెలివిచల్లారి ఇంతటి ఈ పిచ్చిపని ఎందుకు చేసావు?

శీను: (అమాంతం లేచి యువకునివైపు వీపుపెట్టి వెన్నుకు చేయిపెట్టి నిలుస్తాడు) వెర్రితనమా! వెర్రితనం (యువకునివైపు మొహం తిప్పి) పిచ్చితనమంటున్నావు కదూ! పెళ్ళాన్ని ఎందుకు వదలిపెట్టావని? (మెల్లిగా అటునిటూ పచార్లుచేస్తూ యువకుణ్ణి చూడకుండానే మాట్లా డుతూ వుంటాడు) ఎందుకు వదిలేసావు? అని ఇల్లా అడిగేదే పిచ్చి

తనం! సొంతంగా చేసికొన్న పెళ్లికాదు....ఇంట్లోవాళ్లు మెడకంట గట్టిన సంబంధం....నేనుగా పాణిగ్రహణం చేసివుంటే, నన్ను ఎందుకు చేయి వదిలేసావు? అని నిలవదీసి అడుగవచ్చు. బుద్ధి తెలియక మునుపే ఆమె చెయ్యి నా చేతిలో పెట్టారు....ఇప్పుడు తెలుస్తోంది నాకు; పాణిగ్రహణంచేసి మరి ఎందుకు వదిలానా అని. బుద్ధికీ బుద్ధికీ సరిపడలేదు. ఆలోచనలకు పొంతనలేదు. మాటామాటా పొందికలేదు ఒకళ్ళ కొకళ్ళకి! ఇహ పొందిక ఎల్లా వుంటుంది "స్వాతంత్ర్యం వచ్చింది" అని చెప్పిన రోజు "అదే ముద్యోగం" అని అడిగింది. (యువకుని నిటారుగా చూస్తూ) తెలిసిందా మరి! అప్పటికప్పుడే మెడపట్టి గెంటేసా వాకిట్లోకి ఆమెను!

యువ: (అతన్ని పరికించి చూస్తూ) ఊఁ! – 'బైటికి నెట్టేసా' అనే కంఠ ధ్వనిలో ఆవేశం ఉంది....ఔనా! ఇంత ఉల్లాసంగా పెళ్ళాన్ని తరిమేసిన మొహం మరి ఎందుకు పాడుపడి వుంది కళాహీనంగా!

శీను: (చేయి ఊపుతూ) మరో ఆమెను పెళ్ళాడడానికి ఇంకా కుదరలా.... అనే మనస్సంకటంతోనోయి! (అంటూ కూచుంటాడు)

యువ: (చింతాముద్రతో) ఊహూ! ఇది ఒక సమస్యానాటకంగా తయారైంది!....ఊఁ! ఊఁ!....సరి....సరి....

పెళ్ళాం: (లోపలి తలుపులోంచి తొంగిచూస్తూ) భోజనానికి లేస్తారా ఇహనైనా!

**[ఇద్దరూ కలలోంచి లేచినట్లు అటుప్రక్కకు ముఖం తిప్పుతారు. రెండు నిమిషాలపాటు రంగభూమిలో చీకటి – కొంచెం సమయం గడిచిపోయింది అని సూచించడానికి – మళ్ళీ వెల్తురు వచ్చిం తర్వాత భోజనం ముగించి ముగ్గురూ రంగస్థలంపైన కూచుంటారు. శీను చేతిలో వార్తాపత్రిక వుంది. యువకుడు ఆకూ-వక్కా నములుతూ వుంటాడు. కొంచెం దూరంలో పెళ్ళాం కూచుని వుంటుంది. చేతిలో దువ్వెన, పూలబుట్ట పట్టుకొని కూచుని వుంది. అందరూ తమకు తామల్లా వుండిపోతారు. రెండు నిమిషాల తరువాత]**

యువ: అన్నట్లు, శీనూ! స్వాతంత్ర్యం రోజు శుభముహూర్తంలోనే స్వతంత్రుడివి అయ్యావన్నమాట.

శీను: అందుకే చెబుతున్నానుగా! ఇంకమీద వంటింటిలోనే మన జెండా అని——

భార్య: అట్లా ఎందుకు? ప్రస్తుతానికి మా ఇంటికే భోజనానికి వస్తూ వుండండి అని చెప్పారుగదూ!

శీను: (మధ్యలో) ఛీ! మీకు ఎన్నాళ్ళని నా పీడ! నా పాటు నాదే!

భార్య: అందరి పాటా* ఒకటే....

యువ: ఏమిటో అది?

భార్య: ఏమిటేమిటి?

* * *

[పాట ముగిసేలోపల మిగతా ఇద్దరూ పండుకున్నారు. భార్య అది చూసి చివరిపంక్తికి స్వరం తగ్గించి మెల్లిగా సవరించుకుంటూ లేస్తుంది. వాళ్ళను తేరిపారచూసి లోపలి వాకిలివైపు చూస్తూ "మొగుడు! పెళ్లాం! అందరిదీ ఒకటే పాటు" అంటూ చప్పుడు చేయకుండా వెళ్తుంది.

ఒక నిమిషం నిశ్శబ్దం. నటులకో సూచన. ఇంకా కొంచెంసేపు నడిచే దృశ్యం యువకుడూ, శీనూ కనే కల. అందుచేత అది-కల ముగిసిందనే సూచింపబడేదాకా యువకుడూ, శీనూ తమకు తాము మాట్లాడుకుంటూ కేవలం కళ్లు తెరచికొని ఇంకొకళ్ళవంక చూడకుండానే, మాట ముగియగానే కళ్ళు మూస్తూ వుండాలి. పెళ్లాం మాత్రం కలలో ఎప్పుడూ కళ్ళు తెరచుకొనే ప్రవేశిస్తుంది. కాని ఆమె కూడా వేరే ఎవర్నీ చూడదు.]

* కన్నడంలో 'హాడు' అను శబ్దానికి రెండర్థాలు (1) పాటు (2) పాట. రచయిత హాడు' అనే శబ్దంమీద pun చేసి వాడుతాడు - ఏపాటు తప్పినా సాపాటు తప్పదని తెలుగులో సామెత అను.

యువ: (ఆలోచనా మగ్నమైన స్వరంతో) మొదటే ఆమెకు చెప్పా! పెళ్ళాన్ని వదిలేసే ఉత్సాహం! ఇంకోదాన్ని పెళ్ళిచేసుకోడానికి లేదనే నిరుత్సాహం! ఆహాహా! దొంగ! మోసగాడు!.... వాడ్ని చూసి మాట్లాడించి ఇందులో రహస్యం ఏదో వుందని మరీ తెలుసుకొని వచ్చా....(మళ్ళీ కళ్ళుమూసికొని పడుకొంటాడు)

శీను: (పడుకొన్నచోటే లేచి కూచుని దొంగ గొంతుతో) ష్! ష్! కమలా! కమలా!

భార్య: (కలలోవలె అడుగుల్లో అడుగువేసికొంటూ ఆకాశంవైపు ఏకధాటిగా చూస్తూ) ఎవరు? శీనూ!

శీను: (మాంచి ఉత్సాహంతో) శీను!–అంటే–ఇతగాడు ఇంట్లో ఉన్నట్లు లేడనిపిస్తోంది.

భార్య: ఎవరు? ఆయన ఇప్పుడు వస్తారు – ఇక్కడే వుంటే ఏమైంది–కూచో రాదా.

శీను: అతడుంటే నువ్వు 'శీను' అని పిలవడానికి చొరవచేసకోవు. అందుకే అంటున్నా.

భార్య: అంటే ఏమిటి? ఆయనకేమీ తెలియదు– చిన్నప్పుడు నువ్వూ నేనూ, కలిసిమెలిసి పెరిగామని——

శీను: (ఆశాభరితంగా) కమలా! కమలా! ఇప్పుడు ఆ విషయం వినడానికే వచ్చా నేను.

భార్య: దానికంత భిడియం ఎందుకు....నిన్ను ఎవరు వద్దంటారు?

శీను: (ఉత్సాహంతో) నేటినుండీ నేను స్వతంత్రుణ్ణి.

భార్య: ఏం?

శీను: (ఉత్సాహంతో) కమలా! స్వతంత్రుణ్ణి. పెళ్ళాం విడిచేసి వెళ్ళి పోయింది.

భార్య: (నవ్వుతో అతడు తన చేయి పట్టుకొన్నట్టు నటించి) అయ్యో! ఇల్లా ఎందుకు వణకుతోంది నీ చెయ్యి? మొగుణ్ణి పెళ్లాం వదిలినా, మొగవాణ్ణి ఆడది వదలదు శీనూ!

శీను: (తప్పు ఒప్పుకొనే స్వరంతో) ఔను.

భార్య: (నవ్వి) ఔనా మరి! ఎవరికోసం నువ్వు పరతంత్రుడు....

శీను: (మధ్యలో) నీ కోసమై....కమలా!....నీ కోసమై....

భార్య: అయ్యో! నాకు తెలియదనే నువ్వు అనుకుంటున్నావా?

శీను: (ఆశ్చర్యంతో) ఏవిటి? నీకు....నీకు....ఈ సంగతి తెలుసన్న మాట? ఎల్లా....అల్లా అంటే ఎప్పుడు?

భార్య: పిచ్చి! మగవాడు వొట్టి వెర్రివాడు! ఎల్లాగంటావా? జ్ఞాపకం వుందా ఏం? నీకు శీనూ! మా మీ ఇంటివాళ్ళంతా కూడి వెన్నెలల్లో సంతర్పణకు పోయి వున్నామో రాత్రి. తిరిగి ఇంటికి బైల్దేరేటప్పుడు, వెన్నెలలు కన్నుల పండువుగా, మనస్సు కాహ్లాదంగా, పిండారబోసినట్లు, పుచ్చపువ్వులా వుంటే నేను ముందు ముందుగా పరుగెత్తుతూ పోయాను; వెన్నెలలతో పోటీపడుతున్నట్లు. అప్పుడు నువ్వు నాతో పోటీపడి వెనకనుంచి పరుగెత్తుకొని వచ్చావు. ఇద్దరమూ ముందుకు పోయాం....అందరూ వెనక దిగబడ్డారు. చెట్టుకొమ్మమీద కూచున్నాం కాళ్ళూగిస్తూ....ఊగే చాయలలో, తాళం వేస్తూ నేను పాట పాడాను.

శీను: (జ్ఞాపకం చేసికొంటున్నవానివలె) పాడావు....పాట....అవును (అని ఒకటి రెండుమాట లంటాడు)

భార్య: (నవ్వి) అల్లా కాదు. మాటలు జ్ఞాపకం వున్నాయి ...కాని అనే తీరు అది గాదు ఇల్లా....

* * *

(ముగించిన మీదట) చూశావా? ఇప్పుడే జరిగినట్లు, నీ కళ్ళల్లో నీళ్లుబుకుతున్నాయి. నీ కళ్లు తెలుపెక్కుతున్నాయి....ఆ కళ్ళల్లోంచి చూస్తే నీ హృదయం కానవస్తోంది....ఆ నీ హృదయంలో నా ప్రతిబింబం స్పష్టంగా వుంది....అప్పుడు తెలిసింది నాకు.

శీను: (నడుంగా) అప్పుడు—? కమలా అప్పుడు అని ఎందుకంటావు? ఇప్పుడూ నా హృదయంలో నీవే ఉన్నావు.

భార్య: ఇప్పుడున్నది జీవంతమైన ప్రతిబింబం కాదు శీనూ! నా భావపటం ఇప్పుడు నువ్వే నా హృదయంలో ఉన్నావు.

శీను: (మళ్ళీ ఆకాశభరితమైన స్వరంతో) ఏమి? ఏమి అన్నావు కమలా?

భార్య: (చిరునవ్వుతో) పిచ్చివాడు! మగవాడు! చూశావా? నీ చెయ్యి కంపించిపోతోంది? నీ కంఠస్వరంలో ధైర్యమే లేదు. అందుకే చెబుతున్నా ఇప్పుడూ నువ్వు నా హృదయంలో ఉన్నావని....

శీను: (పైలాగానే) కమలా!....కమలా! అయితే నే నిప్పుడు ఇంకా పెళ్ళి చేసికోలేను; కొత్త చట్టం వచ్చింది. నీకు నీ పెళ్ళి భంగం చేయడానికి లేదు; కొత్త చట్టం ఇందు విషయంలో రాలేదు.

భార్య: (గట్టిగా నవ్వి) మగవాడి బతుకు లెక్క బతుకు ...చట్టం–లా....! శీనూ! ఎవరడుగుతారు ఇదంతా నిన్ను? ఆడది ఏ చట్టానికి లోబడాల్సిన పని లేదు. పరతంత్రురాలు కాదు.

శీను: అల్లా అయితే ధైర్యం చేస్తావా? నాతో లేచివస్తావా?

భార్య: ఇదంతా తికమక వ్యవహారం! తల్లి పిల్లవాడితో పోతుందా?

శీను: (ఏమీ తెలియక) తల్లి....పిల్లవాడు?

భార్య: నేను తల్లిని; నువ్వు పిల్లవాడివి, ఆడది తల్లి; మగవాడు శిశువు. తల్లికాక మునుపు ఓసారి; ఒక్క క్షణంమాత్రం ఆడది, భార్య. ఓసారి మాతృత్వం వచ్చిందంటే ఆడది కలకాలం, తల్లి అన్న మాటే!

శీను: ఏమిటీ? వీపుమీద నిమిరే చేయి తలమీద ఆశీర్వదిస్తున్నట్లు వుంది. కమలా! కమలా! అట్లా అయితే నేను వెళ్ళిపోతున్నా.

భార్య: ఎక్కడికి?

శీను: మహాత్మా గాంధీగారు చెప్పారు, కలహం నడిచేచోట్లల్లో మధ్యలో దూకి ప్రాణాలు అర్పించడం ప్రతివాని కర్తవ్యమని....వెళ్తున్నా తన రక్తం పారించి నవచైతన్యాన్ని పుట్టించడం మగవాని పని అక్కడికి పోతున్నా.

భార్య: ఎప్పుడు?

శీను: రేపు.

భార్య: అల్లా అయితే వెళ్ళేముందు, మా ఇంట్లో భోంచేసి మరీ వెళ్లు. శీనూ నా మీద ఒట్టే నన్ను చూడకుండా వెళ్ళావంటే (ఊర్పు పుచ్చి) వెళ్ళి

పోయాడు! మళ్ళీ ఓ జీవి నిరాశ కాహుతి అయ్యాడు. సంసారం రెండైపోయింది. శీనూ ప్రాణంవిడిచేస్తాడు (లోపలికి వచ్చినట్లే వెళ్ళి పోతుంది)

[మళ్ళీ ఓ నిమిషం నిశ్శబ్దం]

యువ: (క్రుద్ధకంఠంతో) ఛీ! ఇల్లా విడిచిపెడితే లాభంలేదు. ఇదేమిటో మోసం నడుస్తోంది. నా ఇంట్లో, నా ఎదురుగ్గా మోసం! ...శీనూ!.... ఆమె! అబ్బా! చిన్నప్పటినుంచీ కలిసి మెలిసి, కూడి మాడి పెరి గారు! వాడు పెళ్ళాన్ని విడిచేసాడు ...మరీ ఈమె! ఇంక మొగుణ్ణి విడిచేస్తోందో యేమో! అయితే—అంతకంటె ముందు, నేనే ఈమెను విడిచి పెట్టేస్తే? మొదట మాటలాడైనా చూద్దాం (గొంతు పెద్దది చేసి) ఒసే అమ్మీ!

[మళ్ళీ కళ్ళు మూస్తాడు]

[పెళ్ళాం ఇంతకుముందు వచ్చినదారినే మెల్లిగా నడుస్తూ వస్తుంది]

యువ: (కోపంతో) ఓసి! ఇటు చూడు నీ మీద నాకు సందేహంగా వుందంటున్నా.

భార్య: ఔను.

యువ: (చకితుడై) ఏమంటావు?

భార్య: ఔనంటాను.

యువ: (సంతాపంతో) మనస్సుతో అక్కడున్నా జనంకోసమైనా నీకు సిగ్గూ శరం, ఉండాలా అక్కర్లేదా? 'సందేహంగా వుంది' అంటే 'ఔను' అంటావు?

భార్య: లేదు అంటే మీకు నమ్మకం చిక్కదుగా మరి!

యువ: 'ఔను' అంటే....?

భార్య: మీకు నమ్మకం కలగ జేసే ధైర్యం నాకులేదు.

యువ: (దుఃఖంతో) అబ్బా! చదువుకొన్న పెళ్లానివి కావునువ్వు! చదువు కొన్న పెళ్లాం బుద్ధి నేర్పే పెళ్ళాం అంటుంది ఏమని?....మాట్లాడవేం?

భార్య: (చిరునవ్వుతో) ఏమి మాట్లాడేది? Thank You అనాలా?

యువ: (వెంటనే) చాలు నీ 'కాంక్యూ' శీనుతోగూడి – స్నేహం వెలగ బెట్టావా ఏమిటి?

భార్య: (మధ్యలో) మీ అనుమానం ఎవరిమీదా? నా మీదనో శీనుమీదనో! ఇద్దరిమీదనా లేక?

యువ: ఇంకా మాట ముగించకపోతే నువ్వైనా బైటికి పోవాలి, నేనైనా బైటికి పోవాలి.

భార్య: అయ్యో! లేచే ఉన్నారుగా? మీరే బైటికిపోతారా? అంత కోపంగా ఎందుకు చూస్తారు? కావాలంటే నేనే వెళ్ళిపోతాను బైటికి .. ఇంట్లోంచి బైటపడడ మెంతసేపు? మనస్సులోంచి బైటకు తీసేస్తే సరి—

యువ: (తిరస్కారంగా) మనస్సు! మనస్సు! మనస్సుకూ తలుపూ దర్వాజా ఏమీ లేవు.

భార్య: (జాలిగా) పాపం!

యువ: (దుఃఖంతో అఱుస్తూ) పాపం! ఏమిటి పాపం? పద; పద; కంటి కెదురుగ్గా నిలబడవద్దు....పద....

భార్య: (సమాధానంగా) ఎందుకు కేకలు పెడుతూ అఱుస్తూ ఆయాసపడ తారు. నేనే వెళ్ళిపోతా. నే నింకా వంట చెయ్యాలిసివుంది. వంటయిన మీదట పిలిచేదిలేదు. ఆకలైతే మీరే లోపలికి రాండి. (వెళ్లిపోతుంది)

యువ: (కళవళపడి) ఏం చెయ్యాలి! అంటున్నావు. ఆ కలవడమూ అబద్ధం కాదు; ఈమెమీద అనుమానం పుట్టడమూ అబద్ధం కాదు. (ఆలోచన మార్చి) ఏం-ఇతనిమీద సందేహమో? ఫోంచేసింతర్వాత మాట్లాడించే వదలిపెడుతా.

శీను: ఇతనికంటె ముందే నేనూ చెప్పివేస్తా సూటిగా.

యువ: (పళ్లు కొఱుకుతూ) దొంగ! మోసగాడు!

శీను: (తిరస్కారంతో) వద్దు. వీడు వొత్తి పిఱికి – 'నూతిలో ఉఱికి'

1. కాంక్యూ = కొక్కిరాయిమాట అను

యువ: హలో! స్వతంత్ర శీనూ! మా యిల్లు విడిచి మమ్మల్ని ఎప్పుడు స్వతంత్రంగా ఉండనిస్తావు?

శీను: నేను వెళ్లిపోతున్నా పశ్చిమ పంజాబుకు.

యువ: (తిరస్కారంతో) అక్కడికి పోయిందా ఏమిటి నీ పెళ్ళాం? పెళ్ళాం లేచిపోయిందని, చావడానికి వెళ్తున్నావా?

శీను: (కొంటెవానివలె) నీ పెళ్ళాం వదిలేస్తే నువ్వేం చేస్తావు?

యువ: (ఒక్కసారిగా కోపంతో) ఒరేయి! దొంగ! దగాకోరు! ఇప్పుడు – ఆఁ! బైటపడిందిలే నీ మోసమంతా!

శీను: (గాబరాతో) ఒరేయి! ఏం! ఏమిటది? గొంతు పిసికేస్తున్నావా? చస్తిని పో.

యువ: చావడానికి బైల్దేరింతర్వాత ఎక్కడ చస్తేనేం? (ఒరిగి పడుకొన్న పడానే గొంతు పిసుకుతున్నట్లుగా నటిస్తాడు)

శీను: చావాలిసేవుంటే నిన్ను కొట్టిగాని మరీ చావనురా. (ఒరగి తను వున్న స్థితిలోనే చెయ్యి పైకెత్తుతాడు)

యువ: (సంతాపంతో) ఇంటికి నీళ్ల తోడేవాడా!

శీను: (తిరస్కారంతో) పిరికి సన్నాసి!

[ఇద్దరూ ఒకే సమయాన మేల్కొన్నట్లు కళ్లుతెఱచి ఎదురుగా నిలుస్తారు. అదేసమయానికి పెళ్లాం ముగ్గురికీ గాను 'చాయి' తెస్తుంది ఓ నిమిషం అందరూ స్తంభీభూతులై! స్తబ్ధులై నిలబడి పోతారు. యువకుడు – శీనూ ఏమీతెలియక కొంచెం సిగ్గుతో ఒకళ్ల నొకళ్లు చూసుకుంటూ వుంటారు. వాళ్లనుచూసి, తెలియక పోవడంతో వెఱగుపడి పెళ్ళాం నిలబడి పోతుంది]

భార్య: ఏమండీ! ఏమైంది మీకు? ఒకళ్లనొకళ్లు గుర్తుపట్టనట్లుగా అపరిచితంగా చూసుకుంటున్నారు ఎందుకని?

యువ: గుర్తురావడంలేదు.

శీను : (నవ్వుతో) – ఇప్పుడు గుర్తువచ్చింది.

భార్య : ఏమైంది? మధ్యాహ్నం భోంచేసింతర్వాత నిద్రపోతే ఇల్లాగే అవుతూ వుంటుంది.

యువ : మీకు నిద్రపట్టిందా? ఏమిటి?

భార్య : అయ్యో! శోభ! లోపల స్టౌవు ముందు కూచున్నా మీ గురక వినబడుతూనే వుంది.

శీను : (తనలోతాను) అంటే కల రావడం నిజమన్న మాట

యువ : అంటే తలలో వున్న అనుమానానికి కలలో దెబ్బలాట జరిగింది.

పెళ్ళాం : పనీపాటూ లేని మగవాళ్లు ఇటువంటి దానికి మాత్రమే స్వతంత్రులు.

యువ : (అమాంతం ఖచ్చితంగా) శీనూ! నేనూ నీతో పాటు వచ్చేస్తున్నా

భార్య : (చిర్నవ్వుతో) ఎందుకని? మీ పెళ్ళాం కూడా మిమ్మల్ని వదిలేసిందా

యువ : (దొంగ కోపంతో) విడిచేసింది – సిగ్గు.

భార్య : (గంభీరమైన కంఠస్వరంతో మాతృవాత్సల్యం తొణుకుతూ వుండగా) మగవాళ్లకు లేని సిగ్గు, ఆడవాళ్ల కెక్కడినుంచి వస్తుంది? సిగ్గట సిగ్గు! ఆడుదానికి సిగ్గు వుంటే జగత్తే వుండడానికి వీల్లేకుండా పోతుంది. మగవాడికి సిగ్గులేదన్నట్లు చెప్పితే జగత్తే మిగులకుండా చేసినట్లౌతుంది (స్వగతం) సిగ్గు అనేది తనకై వుండాలి; ఇతరుల కోసం కాదు, సిగ్గు అనేది తల్లి అయిన ఆడుదానికి కాదు. పిల్లవాడు లాగా వుండే మగవాడికి – శీనూకు సిగ్గు, పెళ్ళాం వదిలేసిందని. ఈయనకు సిగ్గు, పెళ్ళాన్ని వదలి పెట్టడం తనకు చేతకావడంలేదని. నాకు సిగ్గు వీళ్ళిద్దరికి బుద్ధిలేదే అని—

యువ : (ఒక్కసారిగా) ఓహో! (పెళ్ళాం మేల్కొని వుండడం చూస్తాడు) మెదలకుండా కూచుని ఆ ప్రకారం నాటకం పెంచడానికి చూసా వన్నమాట! మేము చాయి తాగాలని కూచున్నావా ఏమిటి? అదో వంకగాని.

శీను: (నవ్వుతో) ఉపదేశామృతం తాగుతున్నావా?

భార్య: ఇది తాగేదికాదు. అయినా అమృతం. మంటపై కాగిన నీళ్ళు-ఆరోగ్యానికి మంచివైనట్లు-సమాజానికి, తపించిన మనిషివల్ల ఎంతో హితం-ఆ సంగతి తెలియజెప్పడానికే దీన్ని తెచ్చా. మీకు ఇంతటితో మంగళారతి అగుగాక—

[పాట ముగిసింతర్వాత ఇద్దరికీ వాళ్ల 'చాయి' ఇస్తుంది]

యువ: హిందు.

శీను: స్వాహా! (అని తాగి) ముసల్మాన్

యువ: స్వాహా! (అని తాగుతాడు)

భార్య: ఇద్దరూ తాగారు-'చహా'[1] (అని తాగుతుంది) (వాళ్ళిద్దరూ చప్పట్లు)

తెర

పాత్రల పరిచయం:

మి. నాగప్ప —— పంచాయతీబోర్డుకు అభ్యర్థిగా నిలిచిన ప్లీడరు.

మి. సుబ్బప్ప —— అతని ఏజెంటు.

రామప్ప, వెంకప్ప, తిమ్మప్ప —— మొదలైనవాళ్లు ఓటర్లు.

మి. నాగయ్య —— వీరో అభ్యర్థి: జమీందారు.

మి. చెలువయ్య —— అతని ఏజంటు.

వీరయ్య, సీలయ్య —— ఓటర్లు.

అప్పయ్య, శికేర, హమ్మాబ్బ —— వీళ్ల అభ్యర్థులజాతికి చెందని వేరు జాతి వోటర్లు.

పోలింగు ఆఫీసరుగారు.

మి = మిస్టరు.

# మా జాతి

[నాదూరు పోలింగు ఆఫీసు ముందు పక్క అంగణంలో నాగప్ప వైపు ఏజెంటూ, ఓటర్లూ కలుసుకొన్నారు ఆకూ వక్క, పాన్ బీడా, సిగరెట్లను ధారాళంగా పంచిపెట్టే ఏర్పాట్లు చురుకుగా నడుస్తున్నాయి.

సుబ్బప్ప: రామప్పా! నువ్వు నాకు మరోమాట చెప్పరాదు; ప్రాణాలు పోయినా నీ వోటు ఇంకోళ్ళ కియ్యకూడదు; మా అసామే మీ ఇంటికి వచ్చివుండే ఆయన; కాని ఈ సందడిలో ఆ పని సాధ్యం కాలేదు. అదీగాక నువ్వు మావాడివే అనే సంగతి తెలుసుగా!

రామప్ప: సుబ్బప్పా! ఆ ఒక్క విషయంలో మాత్రం నన్ను వదిలేసెయ్యి. నాగయ్యగారు మాకు, దొరై వుంటే ఇంకోళ్ళకు నా వోటు ఇవ్వడ మనేది బాగోదు. ఆయనా, నన్ను బాగా నమ్ముకొని వున్నాడు. నేనూ తన ఇంట్లోవాడినే నన్నంత దిలాసా. అటువంటప్పుడు నేను నమ్మించి, గొంతుకోసే పని ఎల్లా చేస్తాను?

సుబ్బప్ప: ఇదేం మాట? దొరయితే, ఓటు కాగితంలో, వోటు మీకే అనే షరతు ఏమన్నా కనపడుతుందా? నీ యజమాని అయితే మాత్రం ప్రతిదీ ఆయన అడిగింది చేస్తూవుంటావా?

రామప్ప: ఆయనవల్ల నా కెంతో మేలు జరిగింది. అదీగాక ఈ నాగప్ప ఎక్కడివాడు? మన వూరివాడన్నా కాదు చూడు.

సుబ్బప్ప: ఆ మాటమాత్రం నాతో చెప్పకు; ఊరివాడు కాకపోతే ఏ మూడి పోయింది? నువ్వు మా జాతివాడివేగా? 'అప్ప'ల జాతిలో పుట్టి 'అయ్య'ల జాతివాళ్ళకు వోటు వేయడం ఏం న్యాయం? చెప్పు. ఇదిగో చూడు ముఖ్యంగా, ఇది ఆలోచించు. ఈ తడవ వోటు పోటీ, పోటా పోటీలమీద ఇంతగా వుంది—అయితే 'అప్ప'ల మీసాల్లైనా

పైకి లేవాలి, లేదా 'అయ్య'ల మీసాలైనా నిక్కపొడవాలి. మన జాతి వాడికి మెంత్రీ దొరికిందా – 'అయ్య'ల నోట దుమ్మే ననుకో!

రామప్ప: ఆ జగడంలో పడి నేను కట్టుకొనిపోయే దేముంది చెప్పు?

సుబ్బప్ప: అల్లాగంటే? నాలుగేళ్ళల్లో, తస్సాదియ్యా అంతా 'అప్ప'ల రాజ్యమైపోతుందే తప్ప 'అయ్య'ల దేమీ వుండదు. ఇటీవలే 'అప్ప' లంతా కలిసి ఓ బ్యాంకు పెట్టారా మరి! పేపరోటి పెట్టారు. ఇంక మనవాళ్ళకు మనవాళ్ళదే అంగడి, మనవాళ్లే ప్లీడర్లు...అంతా మనలో మనమే ననుకో! 'అయ్య'ల సొక్కు క్రమక్రమంగా తగ్గిం చేసుకోవాలి!

రామప్ప: అల్లా అంతా జరిగితే మహబాగు; మంచిదే! నాకూ ఇష్టమే. ఋణం గిణం కావాలంటే, మనవాళ్ల బ్యాంకు వుంటే, అప్పు తేలికగా- తేలిక వడ్డీమీద దొరకుతూ వుంటుంది. ఇప్పట్లో నాగయ్యగారి దగ్గిర తీసుకొన్న అప్పుకు నూటికెన్మిది రూపాయల చొప్పున చెల్లిస్తూ వస్తున్నా.

సుబ్బప్ప: అదీ నీకూ తెలుసన్నమాట! ఇహనేం? ఎట్లా మాట ఇచ్చావు మరి?

రామప్ప: ఆ ఒక్క విషయంలో మాత్రం క్షమించు. పై యేడు చూసు కొందాం.

సుబ్బప్ప: పై ఎన్నికలకు ఇంకా మూడేళ్లుంది. ఆయనదేమిటి ఖాతరు నీకు? పై యేడు నాగప్పగారిచేత నీకు వరిపొలం గుత్తకిప్పిస్తాను.... మాట ఇయ్యి మాకు, నీ వోటు మాకేనని–వేరు జాతివాడికి కాదని.

రామప్ప: ఏమైనా....బాబు....బాబు! ఈసారికి వదిలేసెయ్యి నన్ను నువ్వు.

సుబ్బప్ప: అయినా గియినా, ఏం లేదు....నువ్వు నాగయ్యకు వోటిచ్చావా 'అప్ప'ల కులదైవంమీద ఒట్టు! చూసుకో మరి!

రామప్ప: ఇంకేమిటి చెబుతాను నేను?

సుబ్బప్ప: అల్లాగే 'తథాస్తు' అను.

రామప్ప: సరే....ఎంత చెడ్డా 'జాతీ జాతీ, ఒక్కటే, కుక్క కుక్కా ఒక్కటే' అని సామెత.

సుబ్బప్ప: 'అరసకైశే' (అని పాడి కులుకుతూ వుంటాడు)

[వెంకప్ప, తిమ్మప్ప, ప్రవేశిస్తారు]

ఏమోయి, వెంకప్పా! ఏమోయి తిమ్మప్పా! మీరు పోయినపని నెరవేరిందా లేదా? మా దొర ఎక్కడ? రాలేదా?

వెంకప్ప: ఒక్క పురుగునైనా వదలిపెట్టకుండా అల్లాగే చూసుకొంటూ వచ్చాను! ఈసారి మెంబరీ మనదైందా, 'అప్ప'ల కోసం వేరే ఒక బడి కట్టిస్తాడని చెప్పివచ్చా.

బోర్డులో, అయ్యవారి ఉద్యోగాలన్నీ, 'అప్ప'ల పిల్లలకే! 'అయ్య'ల కేమీ లేవు అని చెప్పేశా. మన ఈ తిమ్మప్పకు ఆ రోడ్డు కంట్రాక్టు కావాల్సివుంది. పైయే డతనికే ఇప్పిస్తానని చెప్పా. మెంబరీ మనదైనమీద, ప్రసిడెంటుగిరీ, మందేననుకో, ఈ 'అయ్య'గాళ్ళ కెక్కడ చిక్కుతుంది? —

సుబ్బప్ప: అది అంతేననుకో; సరేగాని ఇప్పుడు కాఫీ ఫలహారాల ఏర్పాటైనాయి కదూ! ఓటువేసేవాళ్లు వచ్చేలోపల అంతా సిద్ధంకాకపోతే ఎల్లా మరి! ఆ పై దుకాణందారు శామయ్యకు చెప్పావా లేదా?

వెంకప్ప: అదో మోసం జరిగిందికదూ! నే నతనిదగ్గరకు పోయా. నోరు తెరిచేలోపలనే మా తిమ్మప్ప అన్నాడు "ఇదంతా చేసి, కాఫీకి మాత్రం 'అయ్య'కు చెప్పుతావా అని.

సుబ్బప్ప: అంటే,

వెంకప్ప: శామయ్య 'అయ్య' జాతివాడు అందుకని. ఈ పాడు 'అప్ప' గాళ్ళకు కాఫీ హోటలు పెట్టడం రాదు. చాలా మోసమైంది.

తిమ్మప్ప: పై సంవత్సరం ఎన్నికలకైనా, నేను నేర్చుకొనివుంటే ఒక హోటలు ఏర్పడుతుంది. అన్నట్టు నా పిల్లడికి వేరే పనికూడా ఏమీలేదు.

సుబ్బప్ప: పై సంవత్సరం కథ ఇప్పు డెందుకులే. ఇప్పుడు ఇంకో రెండు గంటల్లో వేడివేడి కాఫీ, టిఫిన్లు తయారుకాకపోతే ఓటుకు వచ్చినవాళ్లు కోపగించుకుంటారు.

తిమ్మప్ప: ఇప్పటికిమటుకు బెల్లం పానకం ఇస్తే సరిపోదా ఏమిటి?

సుబ్బప్ప: 'అప్ప'గాళ్ళ చేతికి, కాఫీ చేయడం తెలియకపోయినా, నాలికలకు కాఫీ త్రాగే తెలివుంది మహానుభావా!

తిమ్మప్ప: కాఫీ ఏమంత బ్రహ్మాండం - ఆ పానకంలోనే ఇంత కాఫీ పొడి వేసివుంచు అంతే. పాలు గీలు పోసిపెట్టడానికి లేదు. ఇప్పుడు పాలెక్కడా వెదుకులాడినా దొరికేదీలేదు.

వెంకప్ప: వెచ్చపెట్టక్కర్లేదా?

తిమ్మప్ప: ఇప్పుడే చల్లారింది - అనేటట్టుంది.

సుబ్బప్ప: అది సరే; ఈ క్షణం అయ్యో వ్యాపారానికి అదే బావుంటుంది అదిసరేకాని ఫలహారానికి ఏమిటి చేస్తే బావుంటుంది? 'అప్ప'లు నోరు తియ్యపడితే తప్ప ఖుష్‌కారు.

తిమ్మప్ప: హల్వా చేసిపెడితే మహా పసందుగా వుంటుంది.

సుబ్బప్ప: హల్వానే చేయిస్తాడు. నువ్వు దానికే జవాబుదారీ. హల్వాకు ఏమేమి కావాలో చెప్పు - అల్లా చేయక తప్పేది లేదు. నాగప్పగారి పేరు చెప్పి దుకాణంనుంచి ఏం కావాలో, ఆ సామానంతా తెప్పించి పెట్టు.

తిమ్మప్ప: హల్వా చేయడానికి ఏంకావాల్సి వుంటుంది? సెనగపిండి, బెల్లం, కుంకుంపువ్వు, ఏలక్కాయలు - అని అనుకుంటా. ఇంకా.... నెయ్యి....

వెంకప్ప: బెల్లమూ? చక్కెరా?

తిమ్మప్ప: హల్వా తెల్లగా ఉంటేనేం?

సుబ్బప్ప: సరిపోయింది పో. నూరు రెండునూర్ల జనానికి కావాల్సినంత పెసరపిండి, నూనె, నెయ్యి తెచ్చి వేగంగా వేయించి, హల్వాచేసి తెచ్చి వుంచు; ఇహ ఆట్టే టైం లేదు జనం రావడానికి.

తిమ్మప్ప: సరే. నాకూ హలవా తినే ఋణంతోపాటు చాకిరీ ఋణం మెడకు చుట్టుకొన్నట్టు కనబడుతోంది.

[నిష్క్రమిస్తాడు]

సుబ్బప్ప: వెంకప్పా, అదయిందా?

వెంకప్ప: ఎ దంటారు?

సుబ్బప్ప: ఇదప్పా!

వెంకప్ప: ఇదంటే?

సుబ్బప్ప: ఆ ఇదప్పా-హాం....జ్ఞాపకానికి వచ్చింది — మోటారు ఏర్పాటు.

వెంకప్ప: 'అయ్యో' వాళ్ళ కాఫీ పనికిరాకపోయినప్పుడు వాళ్ళ మోటారు ఎట్లా పనికివస్తుంది? ఈ దరిద్రపుటూరిలో ఒకే ఒక టాక్సీ ఉండాలా! అదీ 'అయ్యో'ల చేతిలో. ఇదేమీ కాదు. ఏమైనా కానీ పైయేడు మెంబరి అయితే, నాగప్ప ఒక మోటారు లోరి(లారి)నే తీసుకోవాల్సి వుంటుంది. ఎందుకంటే 'అయ్యో'వారు టాక్సీలో ఎన మందుగురేసి మనుష్యుల్ని తెస్తూ వుంటే మన లోరీలో 50 మందిని కుక్కి తీసుకరావచ్చుగా!

సుబ్బప్ప: ఒక్కటిగాదు, నాలుగు లారీలు తెప్పించవచ్చు. జ్ఞాపకం వుంటే ఈ సంవత్సరమే ఒక లారీనో బస్సునో తెప్పిస్తా. ఇప్పట్లో ఏ ఆలో చనకూ సమయం చాలదు.

వెంకప్ప: అంటే వాళ్ళు మోటారుమీద జనాల్ని తెస్తుంటే మనం, మను షుల్ని నడిపించుకొని రావడమా? ఆ కోపానికి తమ వోటును మన ఎదిరిపక్షంవాళ్ళకు వేస్తే కొంపదీసి....

[శికేర ఆ దారిలో వస్తాడు]

సుబ్బప్ప: ఏం శికేరా! ఇక్కడకు రా, రమ్మంటుంటే!....(వచ్చింతర్వాత) నీ ఓటు మా కౌనా కాదా?

శికేర: మీరు మెంబరీకి నిలబడ్డారా?

సుబ్బప్ప: నేనుగాదయ్యా! మా ఆసామి నాగప్పగారు నిలబడ్డారు గదూ!

శికేర: ఓహో! మా నాగయ్యగారు.

సుబ్బప్ప: నాగయ్యగారు గాదు — నాగప్పగారు. 'గుడ్డంబెట్ట' నాగప్ప లేడూ! ఆయన. గొప్ప ఇంటి బిడ్డ. నాలుగువేల రూపాయల రొక్కం ఆయన పెత్తండ్రి ఇచ్చాడు. ఆయనకూ స్వంతగా ఆస్తీ పాస్తీ అన్నీ ఉన్నాయి. దేనికీ కొదువ లేదు. ఇంట్లో తిని, బ్యాప్పు మని త్రేన్చేటంత వుంది. అటువంటివారు బోర్డు మెంబరైతే, దాని సొగసే వేరు.

శికేర: ఆయన ఇంట్లోనే సాపాటు చెస్తూ వుంటావా?

సుబ్బప్ప: మరెక్కడనుకున్నావు? హోటేలులో అనుకున్నావా? ఇప్పుడు నీ ఓ టెవరికి? చెప్పు.... నువ్వు ఇప్పుడు వోటు వేయడానికి టైలు దేరడం లేదా?

శికేర: దాని కేముండాలి?

సుబ్బప్ప: అంటే నీ కేమీ తెలియదన్నమాటే?

శికేర: ఏమో అప్పా! మా పాదిరీ దొరవారు పిలిపించారు. ఎవరికి వేయమని చెబుతారో వారికే వేస్తానప్పా! 'అప్పలకైనా సరే, అయ్యలకైనా సరే.

సుబ్బప్ప: ఆయన తానే ఓ మెంబరీకి నిలబడ్డాడుటగా!

శికేర: అల్లా అయితే మీకు ఏమిటిస్తానని చెబుతాను? ఆయనకు నోట్లు ఎక్కువైతే ఆయనే వేరేవాళ్ళ కిస్తాడు.

సుబ్బప్ప: ఈ ఎద్దుమొద్దు స్వరూపానికి ఓటు అంటే ఏమిటో తెలియదు! వెంకప్పా! ఇతన్ని వదిలేద్దామా?

వెంకప్ప: వదలొద్దు! చివరికేమాత్రమైనా నువ్వు చెయ్యి – శికేర! నువ్వు మాకు ఓటు వేసినాసరే లేకపోయినాసరే, మీ పాదిరీగారికిచ్చినాసరే... 'అయ్య'వార్లకు మాత్రం ఇవ్వకూడదు. అపాటిచేసావా చాలు.

శికేర: పాదిరీదొరగారు చెప్పినట్లే చేస్తానంతే.

సుబ్బప్ప: అవును! శికేర! నీ తరఫున మంచి బండి ఎవరిదగ్గరైనా ఉందా చెప్పు?

శికేర: లేదు; నేనే ఈ సంవత్సరం ఓ బండి కొందామని చూస్తున్నా....

సుబ్బప్ప: అదెప్పటి సంగతో! మాకు బండీ ఇప్పుడే కావాలి. ఇప్పటి కిప్పుడే మంచి బండి ఒకటి వుంటే తక్షణం కావాలి. ఇప్పుడే కావాల్సి వుంది. జనాల్ని తోలుకొని రావడానికి – మోటారొకటి వుండింది – అది తప్పిపోయింది.

శికేర: ఎందుకని? మన శీనయ్యబండి వుందిగా ఇక్కడే దగ్గిరలో. ఈపూట అది బాడుగకు పోవడం లేదుట.

సుబ్బప్ప: 'అయ్య'ల బండి వద్దు! ఇంకమీద 'అయ్య'వారలు ముట్టిన నీళ్ళు కూడా మేం తాగేది లేదు – 'అప్ప'లం!

శికేర: ఏం 'అయ్యా'వారలమీద అంత విరుచుకబడుతున్నారా? సరే. మాకేం? బండి ఇంకోటి ఆవైపు ఉంది. అది ఆ పైఎత్తున ఉన్న తోట నారణప్పది....బండికి బండీ వుంది. మీ జాతివాడే కూడా! అయితే ఎద్దుది మాత్రం వేరే జాతి.

సుబ్బప్ప: ఏమిటి? ఎద్దుజాతి అని హేళన చేస్తున్నావా?

శికేర: కాదు కాదు. నోరు జారి వచ్చింది. మంచి జాతి ఎద్దు కాదు అని చెబుతున్నా నేను.

సుబ్బప్ప: ఏమైనాకానీ వెంకప్పా! నువ్వు బళ్ళసంతకు పోయి, అరగంట లోపల ఆరెనిమిది బళ్ళను కలుపుకొని తీసుకొనిరా-తిమ్మప్ప హల్వా తయారయ్యే లోపల - నీ బళ్ళు తయారుగా వుండాలి. శికేరా! నువ్వు పాదిరీదొరగారి దగ్గరకు పోయిరా....ఈపూట మా పందిరి కింద ఓటర్లకందరికీ హల్వా, పానకం, కాఫీ - ఎంత కావాలో అంత వుంది - అని జనం చెవుల్లో ఈ వార్త పడెయ్యి.

శికేర: అది కాదు; నువ్వు కాఫీ అని ఎంతైనా సిఫారసు చెయ్యి-నేనంటాను-ఒక కప్పు కాఫీ అయినా సరే-ఒక గ్లాసు శరాబూ అయినా సరే అని. అయితే దాని పోర్సు ఎక్కడ? దీని పోర్సు ఎక్కడ? (నిష్క్రమిస్తాడు.)

సుబ్బప్ప: నిజానికి శికేర మాట అబద్ధంకాదు....ఈ ఆ జాతి, ఈ జాతుల చిల్లరమల్లర ఓటు లోపల పడెయ్యడానికి శికేర చెప్పిన ఉపాయమే సరి. గుట్టుచప్పుడు కాకుండా అదీ ఇంత తెప్పించివుంచితే...

వెంకప్ప: ఏమిటి? మన మటువంటిపని చేస్తామా?

సుబ్బప్ప: మన జాతివాళ్ళచేత ఆ పని చేయించనే చేయించం. శికేర దగ్గిర వున్నవాళ్ళను ఆ పనికి ఒప్పగిస్తే సరి. అల్లా చేస్తే వాడి ఓటూ మనకే. ఖండితంగా-ఆ అయ్య, ఇతర కులంవాళ్ళ ఓట్లన్నీ తనకే నంటాడు-బహుశః ఆ ధైర్యంతోనే అనివుంటాడు-రా, ఏమైనా ఒక ఉపాయం చేద్దాం. యజమాని వచ్చేలోగా ఏర్పాటంతా జరిగిపోవాలి.

(నిష్క్రమిస్తారు)

**[ఇప్పుడు 'అయ్యా'ల పార్టీ ఏజెంట్లు చెలువయ్య, మాదయ్య, వీరయ్య, నీలయ్య మొదలైనవాళ్ళిక్కడికి వస్తారు]**

చెలువయ్య : ఈ పూట మనదే పైచేయి అని తెలుసుకో. లోపల లోపల, 'అప్ప'ల ఓటు కూడా 'అయ్య'లకు దొరికేటట్లు చేసి మరీ వచ్చాను. అక్కడ ఓటువేసి రావడమేమిటి ఇక్కడ సంతర్పణ భోజనం తయారు. బొబ్బట్లు, లడ్డు, పరమాన్నం...ఇవన్నీ తయారైనాయి. సన్న బియ్యంతో అన్నం వండించాను. 'అప్ప'ల మొహాన అటువంటి గీత వుందా, అల్లా చేయించగలగడానికి! కేవలం అసంభవం!

నీలయ్య : కాదు; ఆ నాగప్పకు పిచ్చిగదూ! అతనికా మెంబరీ మత్తు ఎందుకు! బోర్డు కుర్చీమీద కూచునే యోగ్యత అతనికుందా అంట? అతని సంగతి వదిలేసెయ్యి. ఈ 'అప్ప'ల కులానికి వుందా? అక్కడా ఇక్కడా అడవి మనుష్యులులాగా గంజిమెతుకులు తిని పడివుండడానికి బదులు 'అయ్య'లమీద దండెత్తుతామంటే ఎట్లా మరి!

చెలువయ్య : ఇది చివరియుద్ధం చూస్తూవుండు; ఇహముందు 'అప్ప'ల అవతారమే విరిగి ముక్కలైపోతుందని తెలిసికో; ఇహపైన పాకశాల నుంచి ప్రాసాదందాకా 'అయ్య'వార్లదే కార్యభారం. మన పీఠ స్వాములూ అదే అంటున్నారు; ఇహపైని, 'అయ్య'ల లావాదేవీలు, ఏమున్నా 'అయ్య'లే చూసుకోవాలి, 'అప్ప'ల చాయలకు బోరాదని. అదిగాదు. పాదిరీ మతస్థులలాగా, మనమూ కొంచెం కట్టుబాట్లు చేసుకోకపోతే వేరే ఉపాయంలేదు. ఈ పూట ఈ 'అప్ప'లను బోర్డు మెంబరీకి విడిచిపెట్టితే, రేపు మన గుండెలమీదెక్కి స్వారీ చేస్తారు. తెలిసిందా!

మాదయ్య : అది కాదయ్యా! ఈసారి నాగయ్యగారు నిలబడడంలేదనెన్నీ, ఆయనకు బదులు ఆ శీనయ్య నిలబడుతున్నాడని వింటున్నాను నేను.

చెలువయ్య : శీనుగాడు నిలుస్తాడా! గంజికి గతిలేని పోరగాడు! నాల్గు మూరల చొక్కా తొడుగుక్కొనేటప్పటికి తానో పెద్ద ప్లీడరునని గర్వం అతగాడికి. వాళ్ళ కుటుంబానికి మొత్తానికి ఎనిమిదణాలు విలువచేసే ఆస్తిలేదు. నాగయ్యగారి మోచేతి గంజి తాగుతూ ఇటు వంటివాళ్లు లెక్కపక్కా లేకుండా ఎందరో వున్నారు. అవునా మరి! బోర్డు మెంబరీ గౌరవానికి ఆ కుర్రకుంకా! నాగయ్యగారంత వారుంటూవుండగా వాడు మెంబరు అవడమంటే, ఈయనకు చచ్చినంత

పనే ననుకో. ఈసారి మెంబరీమాత్రమే కాదు, ప్రెసిడెంటు గిరీకూడా నాగయ్యగారినే వరిస్తుంది చూస్తూవుండు.

మాదయ్య: ఆయన ప్రసిడెంటైతే మనం చెల్లించే వృత్తిపన్ను రద్దైనట్టే ననుకో!

చెలువయ్య: ఈ 'అయ్య'ల తలమీది భారం అంతాపోయి 'అప్ప'ల మెడ మీదపోయి కూచుంటుంది. అది సరేగాని, మాదయ్యా! మోటారు వాడికి చెప్పి వుంచావుగదూ!

మాదయ్య: అరరే! మరచేపోయాను – వాడి మోటారు మంచిరోజు చూసి విరిగిపడ్డట్టు—ఈ పూట మూలపడిందిట. వేరే ఇంకేదీ దొరకలా.

చెలువయ్య: ఏం అతని మోటారు బాగుపడేతీరేమీ లేదా? అబద్ధం! వొట్టి పచ్చి అబద్ధం! ఇవ్వాళ తెల్లవారుజామున అది వెనక్కుతిరిగి వచ్చిందిటగా! వాడికి పైసలమీది దృష్టి అనుకుంటా. కొంపదీసి, 'అప్ప'ల కేమైనా మాట ఇచ్చివున్నాడో యేమో!

మాదయ్య: ఏం కథో!.... ఆమాత్రం మోటారులేంది, కథ నడిచేటట్లు లేదు. గొప్పగొప్ప 'అయ్య'ల నందర్నీ నడిపించుకొని తీసికొని రావడాని కొతుందా? అతనికి ఓ నూరు రూపాయలెక్కువ ఇచ్చినా మంచిదే.

చెలువయ్య: రూపాయలు గీపాయలిస్తామనుకో. ఆపైని అతడు కులంమీది అభిమానంతో, ఎదిరివైపు చేరిపోతే 'అయ్య'కు మోక్షమే గతి. ఔనా! నీలయ్యతో నాలుగు ఎద్దుబండ్లకోసం చెప్పివుంచు. అవసరం లేద నుకో; అయినా ఎందుకైనా మంచిది; చెప్పివుంచు; ఇప్పుడు ఎన్ని గంటలైంది?

[మాముంజి తాత వస్తాడు]

మాదయ్య: ఈ మాముంజికి కూడా ఓ ఓటు వుండాలికదూ!

చెలువయ్య: ఔను; అతన్ని హెచ్చరించడం మరచేపోయాం. ఏమయ్యో! మాముంజి! ఇల్లా రావయ్యా!

మాముంజి: ఏం మీరు నన్ను పిలుస్తున్నారా?

చెలువయ్య: ఔను నీ ఓటు ఈ పొద్దు ఎవరికిద్దామని నిర్ణయించావు?

మాముంజి: మా అమ్మద్, మెంబరీ చేస్తానని చెప్తున్నాడు. మా జాతినివదిలి వేరే ఎట్లా ఇవ్వడం?

చెలువయ్య: పిచ్చివాడా! మీ అమ్మదు మెంబరీనుంచి వెనక్కు తగ్గాడు. మా 'అయ్య'వారు చెప్పి వెనక్కు తగ్గించాడు.

మాముంజి: మాకు తెలియనే తెలియదు. ఇప్పుడు మా అమ్మదు మెంబరీ పోయిందా?

చెలువయ్య: అందుకే అడగడం నీ ఓటు ఎవరికీ అని. మా నాగయ్యగారికి ఖచ్చితంగా ఇవ్వాలి సుమా.

మాముంజి: అమ్మదుకు నేను నా ఓటు పెట్టి వుంచాను. అది వేరే ఇంకోరికి ఎట్లా ఇవ్వడం? మా జాతివాడు మెంబరు కాకపోతే మాకు ఓటు వద్దు ఏమీ వద్దు.

చెలువయ్య: అల్లా కాదు సాయిబుగారూ! ఎల్లాగూ అమ్మదుగారికి దాంతో ప్రయోజనం ఏమీలేదు. మాకు ఇవ్వండి! ఆయన మెంబరుగా నిలబడ లేదుగా.

మాముంజి: నాగప్ప కూడా అల్లాగే చెప్పాడు మరి!

చెలువయ్య: ఆయనకుమాత్రం నసేమీ ఇవ్వకూడదు; ఖరాఖండిగా ఇవ్వకూడదు. నాగయ్యగారికి మీ ఓటు రానివ్వండి. మీకు ఒక ఓటుకు ఒక రూపాయి చొప్పున దక్షిణ ఇప్పిస్తాను.

మాముంజి: మీరో రూపాయి మాకు ఇస్తారా? సరే. అల్లా అయినట్లైతే మీకు నేను రెండు ఓట్లు ఇస్తాను.

చెలువయ్య: మీకుండేది ఒక్కటే ఓటు.

మాముంజి: అంటే మరేమీలేదు. మాకు కొంచెం ఖర్చుకు తొందరగా వుంది; వచ్చే సంవత్సరం ఓటూ మీకే ఇస్తా ఇప్పుడే.... రెండు రూపాయలు మీ రిచ్చేటట్లైతే.

చెలువయ్య: నువ్వే ఏదేమైనా ఈ తడవకు ఒక్క ఓటు ఇయ్యి.

మాముంజి: అది మా అమ్మను అడిగి ఇస్తాను అప్పా! మీరు డబ్బు ఎప్పుడిస్తారు?

చలువయ్య: ఓటు ఇచ్చినవెంటనే శకామని....

మామ్ముంజి: అహా! బలే వ్యాపారం! రూపాయి ఇప్పుడిచ్చేసెయ్యి. మా ఓటు మీకే! లేదా అమ్మదుకే!

చెలువయ్య: (రూపాయి) ఇదిగో పట్టుకో. మహానుభావా! రూపాయిని ఇహనైనా నమ్మకం కలిగినట్లేనా.

మామ్ముంజి: మీరు బొత్తిగా ఒక్క రూపాయి యిచ్చారు.

చెలువయ్య: (ఇంకోరూపాయి యిచ్చి) సరేనా! ఇంక మీకు నాగప్పగారు డబ్బు ఇస్తే డబ్బు తీసికోకూడదు.

మామ్ముంజి: అప్పుడిది మీకు వాపసు ఇచ్చేస్తాం.

చెలువయ్య: వద్దు. వాపసు ఇవ్వవద్దు. ఇద్దరి రూపాయలు నువ్వే వుంచుకో. ఓటుమాత్రం వాళ్ళకు వెయ్యకుండా మాకే ఇచ్చావా సరిపోతుంది. ఏం!

మామ్ముంజి: ఓటిచ్చేటప్పుడు అమ్మదును అడిగి ఇస్తానప్పా!

చెలువయ్య: అరే! పీడి అమ్మదును బండెడు కట్టెల్లో తగలబెట్ట! నువ్వు రూపాయి ఇటు ఇయ్యి.

మారయ్య: వద్దు వద్దు. రూపాయి వుండనీ. వాళ్ళ అమ్మదే మన యజమానితో ఒక్కటిగాచేరి పనిచేసేటట్లు నిశ్చయం చేసుకొన్నారు. ఇప్పుడు అతన్ని పోనీ. కాక ఈ పీ్రాసికి అమ్మదును, విడిచిపెట్టితే వేరే లోకమే లేదు.

చెలువయ్య: ఓహో! పోలింగు ఆఫీసరుగారు వస్తున్నట్లు కనవస్తోంది. అరే! మా యజమానిగారు ఎక్కడికి పోయారో నప్పా! ఇంకా ఎంతో ఏర్పాటు జరగవలసి వుంది.

[పోలింగు ఆఫీసరు పెట్టె నౌకదాన్ని మోసికొని ఆ దారివెంబడి, లోపలి గదిలోకి వెళ్లుతాడు. జనం గుంపులుగా అరుగుమీద గుమికూడుతుంది. రెండువైపులవాళ్లు కలుసుకుంటారు. నాగప్ప నాగయ్య మొదలైనవాళ్లు వస్తారు.]

నాగప్ప: సుబ్బప్పా! అంతా ఏర్పాటైందా? వచ్చిన వాళ్లకు టిఫిన్, వచ్చే వాళ్లకు మోటారు,

సుబ్బప్ప: అక్కడకు వచ్చాడు గదూ మా తిమ్మప్ప అతనిదే ఈపూట హల్వా, కాఫీ (తిమ్మప్ప రాగానే) తిమ్మూ! హల్వా అయిందా? ఎంతో తొరతొరగా కావాలి.

తిమ్మప్ప: ఔను అయింది. కాని కొంచెం లేతపాకంగా తయారయింది. హల్వామటుక్కు నీళ్ళెక్కువైనా యనిపిస్తోంది. కాఫీకి నీళ్లు సరిపోయి నాయి. హల్వా కింకా కొంచెం పంచదారవేసి కలియబెట్టండి ఇప్పుడే వస్తున్నా...

నాగప్ప: మోటారు సంగతి ఏమైంది? నేను ఆ టాక్సీ వాడికి చెప్పివచ్చా. ఇంకా రానేలేదా వాడు?

సుబ్బప్ప: 'అయ్యా'ల టాక్సీ కదూ అది. అది వద్దని నే నెద్దులబండి మాట్లాడి వుంచాను.

నాగప్ప: అవి గాదోయి! తెల్వితేటలంటే! మన పార్టీ పనికి 'అయ్యా'ల చేతకూడా మనం చాకిరీ చేయించుకొంటే మన మీసాలు పైకి నిక్క పొడుచుకుంటాయి.

సుబ్బప్ప: అయినాగాని అది సరైన పనికాదు చూడండి. మనం ఖర్చుపెట్టే దమ్మిడీ అయినా సరే 'అయ్యా'ల చేతిలో పడకూడదు. మీరు మరో మాట ఆలోచించవద్దు. ఇప్పుడే వస్తాయి – నాలుగు ఎద్దుబళ్లు. అది వుండనీ – నాకు మరో ఆలోచన తోస్తోంది. మా 'అప్ప'లు ఎవరూ ఇంకపైని 'అయ్యా'ల ఇంటికి పొలంపాటుకు పోగూడదని. పై సంవత్సరం వాళ్లు తినేవి మట్టిబెడ్డలే.

నాగప్ప: నాకూ అల్లాగే కనబడుతోంది. అల్లాగే చేయిద్దాం నిదానంగా.

[శికేర ప్రవేశం]

శికేర వచ్చాడు. టైం అయినట్లనిపిస్తోంది. సుబ్బా, వాళ్లను పిలుచు కొని పో. పద శికేర రాగానే కాఫీ, హల్వా ఇయ్యి.

శికేర: హల్వా, కాఫీలు పళ్లు లేనివాళ్లకు! పోర్పు ఇచ్చేది ఇష్టేనే నా ఛటు.

సుబ్బప్ప: శికేరా! నీ మాట విని ఏర్పాటు చేసే వున్నా. నువ్వు ఓటు వేసిరా. మన మక్కడికి పోదాంగాని.

శికేర: నిజంగానే సామీ, శరా....

సుబ్బప్ప: శ....రా....బే... వెళ్లు వెళ్లు.

చెలువయ్య: శికేరా! నిలునిలు – నాగయ్యగారు పిలుస్తున్నారు నిన్ను.

శికేర: సలాం సాములు! ఓటుకని వచ్చా.

నాగయ్య: మాకే గదూ నీ వోటు! మరెవ్వరికీ ఇవ్వరాదు నుమా!

శికేర: పాదిరీ దొరగారు చెప్పినారులే.

నాగయ్య: మాకేననిగదూ!

శికేర: తనకే!నని!

నాగయ్య: ఆయనకనా? శికేర! పాద్రిదొరకు ఎందుకంట ఓటు? నువ్విటురా. చెయ్యిపట్టు (రూపాయి చేతిలో ఉంచుతాడు).

సుబ్బప్ప: ఒరేయి! పని పాడైనట్లుగా వుందే! శికేరా! ఇటురా. నీకు ఒకటికి రెట్టింపిస్తాం మేము – ఓటు వేసివచ్చినమీద ఇస్తే సరిపోతుం దనుకుంటున్నాం (అతని చేయి గుంజి ఈ చేతిలో ఓ రూపాయిపెట్టి) ఓటు మాకే గదూ! మాట ఇయ్యి.

నాగయ్య: శికేరా! ఊళ్ళో వాళ్ళను వదలిపెట్టి వేరేవాళ్ళ కెవరికీ వెయ్య కూడదు.

సుబ్బప్ప: మా నాగప్పగారేమో అడవి గొడ్డేమీ కాదు. ఆయనకు మెంబరీ వచ్చి ప్రసిడెంటైతే నీకో బిళ్ళ బంట్రోతు పని చిక్కిందన్నమాటే!

శికేర: సరేలే సామి; నేను ఇస్తే సరిగా!

సుబ్బప్ప: మాకంటె మీ పాదిరీదొర మెంబరి నుంచి వెనక్కు తగ్గుతాడులే. ఉన్న వోటు మనకే వేసి మరీ చూపించు. ఏమంటావ్?

శికుర: సరేలే సామి!

నాగయ్య: శికేరా! 'నాగయ్య' అనే దానికి గీటుపెట్టు. సరేనా!

శికేర: (చెవిలో) చిత్తం సామి!

[లోపలికి వెళ్ళుతాడు]

నాగయ్య: రామప్ప! పద లోపలికి పద! ఇక్కడ నిలబడవద్దు-మీ వీధిలో వాళ్ళంతా అక్కడకు వచ్చి వున్నారు. వరసలుదీరి వోట్లు వేసి రానీ. పై సంవత్సరం మీకు కంట్రాక్టులో రియాయతీ చూపిస్తా.

నాగప్ప: ఏమోయి సుబ్బప్పా! అతడు మన కులంవాడు గదా! ఎందు కని విడిచిపెట్టావు అతన్ని? ఇదే బుర్రలేకపోవడమంటే! మన వాళ్ళ ఓటు మనకు గాకపోతే ఎట్లా?

సుబ్బప్ప: మీరు నోరు మూసికొని వుండండి. నేను అతని చెవిని అప్పుడే మెలిపెట్టివచ్చా.

నాగయ్య: రామయ్యా! అటుపక్కవాళ్ళు రూపాయి ఇస్తే, లోపల వేసి, వాళ్ళకు ఎగనాం పెట్టి మరీరా. వదలద్దు.... సరేనా!

రామప్ప! వంగనామాలు పెట్టేపని నాది (ముందుకు రాగానే సుబ్బప్ప, చేతిలో డబ్బు పెడతాడు).

సుబ్బప్ప: రామప్పా! నువ్వు వచ్చావా? నువ్వు ఎదురివాని కేమో నిష్ఠురంగా ఏమీ ఉండవద్దు. ఓటు వేసేటప్పుడు మాకు వేస్తే చాలు. లోపల లోపల మరెవ్వరికీ తెలియకుండా వాళ్ళకో నామం పెట్టు.

రామప్ప: నామాలుపెట్టే పని నాకు వదిలిపెట్టండి. నేను పెడతానుగా. పోనా లోపలికి?

[లోపలికి వెళ్ళాతాడు]

సుబ్బప్ప: ఓయి వెంకప్పా! తిమ్మప్పా! మీ మీ ఓట్లు మొదట వేసిరండి. ఆ ప్రక్కవున్న వాళ్ళ దగ్గర రెండేసి రూపాయలు గుంజుకోండి.

చెలువయ్య: ఓయి సీలయ్యా! మాదయ్యా! అల్లా చూస్తూ ఇక్కడే నిలబడి పోకండి. తొరతొరగా మీ ఓటు వేసి రండి. వచ్చేవాళ్ళ ఉపచారా నికి ఇక్కడ మనుషులుండనక్కర్లేదా? వాళ్ళు ఇచ్చే దక్షిణ మాత్రం పోగొట్టుకోకండి. లక్షణంగా పుచ్చుకొని మరీ రండి. తెలిసిందా?

[లోపలికి పోతారు. ఇంకా జనంలో గలభా, అడగడం, వేడు కోడం, ఇవన్నీ సాగుతున్నాయి. చివరికి మామంజి ప్రవే శిస్తాడు.]

నాగయ్య: మాముంజి! ఇక్కడకు రా! రా! అమ్మదు చెప్పివున్నాడు—మీ వాళ్ల ఓట్లన్నీ మాకేనని.

మాముంజి: మా ఓటులేదూ! అమ్మదు చెప్పినట్లే, ఆయన ఏమి చెబుతాడో-దాన్నే మేం చేస్తాం.

నాగయ్య: అల్లాగే కానీ-జాతి అభిమానం. మాముంజి అటుపక్కవాళ్లు నీ తల తిప్పేస్తారు! జాగ్రత్త.

సుబ్బప్ప! మాముంజి! ఇటురా. నువ్వు దారిపైన పోయేవాళ్లను[1] నమ్మవద్దు. ఇక్కడ మా నాగప్ప యజమాని వుండగా-నువ్వు 'అయ్య'లకు ఇస్తానంటే ఏమిటి అర్థం? ప్రాణంపోతే పోనీ – మాకే ఓటు ఇవ్వాలి. ఏమంటావ్ ?

మాముంజి: మీకు ఓటివ్వకపోతే ప్రాణం పోతుందా ?

సుబ్బప్ప: లేదు తాతా! ఇవ్వాళ యుద్ధంలో మాకు జయం లభిస్తే మీ సాయబ్బులకోసం ఓ ఉర్దూ పాఠశాల పెట్టిస్తాం ఖండితంగా.

మాముంజి: కొరాను బడి? మా జాతికి ఓ బడిఅన్నా లేకపోవడంలో చాలా కష్టంగా వుంది.

నాగప్ప: మీకో ఉర్దూ బడి ఖచ్చితంగా పెట్టిస్తా. ఆ ప్రకారం మా 'అప్ప' లకూ ఒక బడి పెట్టిస్తామని వుంది. మన పిల్లలు-ఈ ప్రకారం దొరకిన ప్రతి 'అయ్య'దగ్గిర కూచొని, పాఠం చెప్పించుకోడం, సరికాదు. ఒక బోర్డింగు మా లెక్కలో రాయించాలని వుంది – సరే లోపలికి పో. 'అయ్య'కో నామం పెట్టిరా.

మాముంజి: అమ్మదు అల్లాగే చెప్పాడు (తనలో) మాఅమ్మదును వదిలి నేను వీరికి ఓటు ఇస్తాననేనా ?

(నిష్క్రమిస్తాడు)

[శికేర బైటికి వస్తాడు]

శికేర: వేసేసాను సామీ!

నాగయ్య: మనకే కదూ ?

---

1 దారిపైన పోయేవాళ్ళు=అగ్రజాతులకు చెందినవాళ్ల దారిపైనపోతుంటే ఇతరులు దారి తప్పుకొని దారికి క్రిందిప్రక్కగా వెళ్ళుతూవుండడం పల్లెటూళ్ళలోని పాత ఆచారం-అనుం.

శికేర: నేను మొదట చెప్పినట్లే చేసివచ్చా ఇప్పుడు మా పోర్సు రానీ.

సుబ్బప్ప: వెంకప్పా! ఇతగాణ్ణి పోర్సు పందిరికి పిలుచుకొని పో.

నాగప్ప: (బైటికి రాగానే) ఏం ఇంతవరకూ వేసినవాళ్ళల్లో ఎక్కువమంది వాళ్ళకు నామాలేగాదూ పెట్టింది?

రామప్ప: ఆ—వాళ్ళకు ఈ జన్మలో మెంబరీ అవుతుందిటయ్యా, వెర్రిగాని! అదీగాక ఆయనేమంత తీరువ చెల్లిస్తున్నాడని! ఏముందని మహా యోగ్యత?

నాగయ్య: చెలువయ్యా! ఎల్లాగుంది ఇంతవరకు పరిస్థితి?

చెలువయ్య: అప్పలందరూ 'బెప్ప'లైనట్లే! మంచిదే! వట్టి ఆస్తివుంటే చాలు ననుకొన్నారీ 'అప్ప'గాళ్లు 'అయ్య'ల బుర్రవాళ్ళ కెక్కడినుంచి వస్తుంది పాపం!

[అప్పయ్య ప్రవేశం]

ఏమప్పయ్యా! రా, రా! ఓటువెయ్యడమే ఆలస్యం, భోజనం తయారుగా వుంది...!

సుబ్బప్ప: ఏమయ్యప్పా! హల్వా, కాఫీ మా 'అప్ప'లదే తయారీ, ఇహ ముందు 'అయ్య'ల హోటలు కూడా సఫా అని తెలిసికో.

చెలువయ్య: ఆహా ఇంకేమి? కలివుకాలం! 'అప్ప'లు హోటళ్లు పెడితే, కాఫీలో కూడ తిరగమోత పెడతారు.

సుబ్బప్ప: చాలు; మీ 'అయ్య'ల అట్టహాసం! పై యేడు 'అయ్య'లచేత తల మీద పేడతట్టలు మోయిస్తాం, చూస్తూ వుండండి!

చెలువయ్య: అల్లా అయితే ఇంకా చాలా బావుంటుంది. పైయేడు 'అప్ప'ల ఇండ్లల్లో పెళ్ళిళ్లు వాళ్ళకువాళ్ళే చేయించుకొంటారు.

సుబ్బప్ప: 'అయ్య'లకు గోయి వాళ్ళకువాళ్లే త్రవ్వుకోనీ.

చెలువయ్య: ఏం, 'అయ్య'ల వాళ్ల గోయి వాళ్లే త్రవ్వుకోనీ—అంటున్నావా?

సుబ్బప్ప: 'అప్ప'లు రాకపోతే, అల్లాగే మీరే గోతులు తీసుకోండి.

చెలువయ్య: మీ పెళ్ళిళ్లకు 'అయ్య'వార్లు రాకపోతే గాడిదపిల్లలల్లాగానే

అవుతాయి—మీలో మీకు పెళ్ళిళ్లు.

[మాముంజి బైటికి వస్తాడు]

మాముంజి: అది మీది మంచిపనికాదు. మా జాతిని చూడండి. నేనే చస్తా. నేనే గొయ్యి తవ్వుతాను. మా పెళ్ళి మా జాతివాడే చేస్తాడు.

సుబ్బప్ప: ఇహముందు అల్లాగే జరగాలి; మాలోకూడా! ఈ 'అయ్య'లు లేకపోతే మా పెళ్ళిళ్లు ఎందుకు కావో చూస్తాం.

మాముంజి: సాబాసు! ఇది మగతనమంటే! అరే సామీ మీరు మన-అప్పయ్యను చూడలేదా, ఆయన ఓటు ఎవరికిస్తాడో?

చెలువయ్య: మాకే.

సుబ్బప్ప: మాకే! అతడు అప్పయ్యకదూ!

చెలువయ్య: అతడు అప్పయ్యే అయితే మాకే ఓటు.

అప్పయ్య: ఇరువురికీ ఒక్కొక్క ఓటువేసి ఈ జగడంనుంచి తప్పించుకోడానికి లేదా?

చెలువయ్య: అది ఎవరికీ ప్రయోజనంలేదు. ఏమప్పయ్యా! నీవు ఎల్లాగూ అయ్యవే! ఇంకముందు మా మతంవాళ్ళకు చెప్పి, నిన్ను మా 'అయ్య'ల పంక్తిలోకి తీసికొనేటట్లు చేస్తాంగాని! నీ ఓటుమాత్రం నాగయ్యగారికే నువ్వు వేయాలి సుమా!

సుబ్బప్ప: ఏమోయి అయ్యప్పా! ఏమైనా కానీ! నువ్వు పేరుకైనా అయ్యప్పవు. నువ్వు 'అప్ప'ల జాతిలో కలిసిపోవడానికేమాత్రం అడ్డూ, ఆటంకం లేదు. వాళ్లు మతంలో రాయడం అయి, వెళ్ళేలోపల, మా నాగప్ప గారిఇంటిలోనే నీకు ప్రసాదం పెట్టిస్తాను. వారేమనుకున్నావు? మన కులంలోనే మంచి తెలివైనవాడు అందరికంటే!

చెలువయ్య: ఏమప్పయ్యా! నీకు 'అప్పల'తంటా, జన్మ జన్మాంతరాలకూ వద్దు బాబూ! నామాట విను.

సుబ్బప్ప: ఏ మయ్యప్పా! నువ్వు ఇకపైన ఈ పాడు 'అయ్య'వార్ల ముఖమే చూడరాదు తెలిసిందా?

చెలువయ్య: ఏం సుబ్బప్పా! వాడు 'అయ్య'వార్లంటున్నావు చూసుకో. 'అయ్య'లు వెంబడిస్తే ఎల్లా పారిపోయారు? పరుగెత్తుతూ, పారి పోతూ ఈ 'అప్ప' దూరిపోయాడు అరుగుకిందికి దూడలా!

సుబ్బప్ప: ఏమయ్యా - దూడ, దున్న, కుక్క, గొర్రె అంటే పళ్లు ఊడ గొట్టుతాను. ఏం మాముంజి, నువ్వు చూడడం లేదూ! ఈయన మా జాతి మర్యాదను భంగం చేయడం. నువ్వు మాకో సాక్షివి.

చెలువయ్య: ఏమోయి మాముంజి! మొదట 'అయ్య'వారలమీద రేగి విరచుకుపడిం దెవ్వరు? అతడా, నేనా? ఎంత చెప్పినా 'అయ్య'లు 'అప్ప'లకంటె పైచెయ్యి, ఈయన నువ్వు, తాను అని ఏకవచనం మాట్లాడాడా లేదా. నువ్వూ వింటూనే వున్నావు, చూస్తూనే వున్నావు; నిన్నే సాక్షిగా రాయిస్తున్నాను.

మాముంజి: నాకేం పట్టింది? మా అమ్మదు చెప్పి పంపించినలాగా నేను-కోర్టులో నిజం చెబుతాను.

సుబ్బప్ప: ఓహో! వీడిని 'మీరు' అనాలిట! ఇంక 'అప్ప'లు 'అయ్య'ల్ని 'మీరు, మీరు' అని పిలిచే కాలం పోయింది.

చెలువయ్య: ఏం? మళ్లీ మళ్లీ 'నువ్వు, నువ్వు' అంటున్నావా? (అని ఒక దెబ్బ వేస్తాడు).

సుబ్బప్ప: నీ సంగతి వదిలెయ్యి. నీ తాతను కూడా నేను 'నువ్వు' అనే పిలుస్తా సరేనా! చూడిప్పుడు. 'అప్ప'లచేయి పైనో, 'అయ్య'లది పైనో! (కొడతాడు, పోట్లాట పెరుగుతుంది; నాగప్ప, నాగయ్య ఇద్దరూ వస్తారు).

నాగప్ప: ఏమిటేమిటి సంగతి! మా సుబ్బప్పను కొట్టాడా ఈ కుక్క.

నాగయ్య: ఎవరు కుక్క! చెలువయ్యను నువ్వు కుక్క అంటావా? కుక్క జాతివాళ్లు 'అప్ప'గాళ్లు!

నాగప్ప: ఏమిటి? 'అప్ప'ల కులాన్నే తిడుతున్నావా? మా కులం నెత్తురు ఎటువంటిదో ఇప్పుడే చూపిస్తా. (మాముంజి ఒక దుడ్డుకర్ర తెచ్చి నాగప్ప చేతికిస్తాడు). ఈ ఊరిలో ఇహామీదట 'అయ్య'లు లేనే లేరనిపించి విడుస్తా. (కొడతాడు)

నాగయ్య: అయ్యో! (అని పడిపోతాడు, మామ్ముంజి ఇంకో రోకలిబండ తెచ్చి చెలువయ్య కిస్తాడు).

చెలువయ్య: నా ప్రాణం పోయినా, నేను బెదిరిపోయేది లేదు. నాగయ్య గారి నెప్పుడు కొట్టారో, ఇంకా మనకేమిటి ఒఱిగింది? ఈ 'అప్ప' గాళ్ళ కులాన్ని నాశనం చేసేస్తాను.

[కొట్లాడుకొంటారు]

మామ్ముంజి: మా జాతివాళ్లు కొట్టుకొంటే ఇట్లాగా? వీడు కొట్టడానికి బెదరు తాడే! మానం ముందు వైభవప్రాణ మెంత? మా జాతి వాళ్లైతే ఇంతలోకి అందరూ వచ్చి చేరేవాళ్లు. ఇక్కడ వీ ళ్ళింతమంది ఉన్నారు. అందరు నోరు మూసికొని మెదలకుండా నిలబడి వినోదం చూస్తున్నారు.

చెలువయ్య: నిజం! మామ్ముంజి, నువ్వు చెప్పేది నిజం! ఓ 'అయ్య'ల్లారా! మీకు కులమనేదీ లేదా? రండి, ఓ చెయ్యి వేసి చూడండి ఈ 'అప్ప' లకు బెదిరిపోయి మనం పడివుంటే ఇంక ముందు మనల్ని ముక్కలు ముక్కలుగా విరుచుకొని తినేస్తారు.

సుబ్బప్ప: ఓరేయి 'అప్ప'ల్లారా! రండి రండి! మన కులం మనకు సాయ పడకపోతే వేరే ఎవరు సాయం చేస్తారు?

[జనం గుమికూడుతారు. గందరగోళ మవుతుంది. శికేర గూడా వస్తాడు].

శికేర: ఏమిటి తాత! ఇటువంటి జగడం అవుతుంటే ఊరికే నిలబడుతావేం! వీళ్ళకీ వాళ్ళకీ నాలుగు పుౘ్రేపులు, ఎక్కొలుపు మాటలు ఎక్కించ కుండా నువ్వు?

మామ్ముంజి: నువ్వు మెదలకుండా ఎందుకుండిపోయినావు? నువ్వూ ఓటు వేయడానికి వచ్చావుగా!

శికేర: మా జాతివాళ్ళ జగడం కాదిది. ఊరికే నే నెందుకు కల్పించుకోవా లిందులో?

మామ్ముంజి: ఏమిటి? మాజాతి దెబ్బలాటా ఇది? మేం కొట్లాడాలంటే, మా అమ్మదు చెబితేనే! మా అమ్మదు లేకపోవడంతో, అంతా చెప

చప్పగా వుంది. అతడు వచ్చివుంటే - ఎటువంటి పోట్లాటో చమ డాలు ఒలిపించేసి వుండేవాళ్ళం మేం!

[అప్పయ్య జగడం గుంపులోంచి తప్పించుకొని బైటపడుతాడు].

అప్పయ్య: అయ్యప్ప! ఎటువంటి జగడ మిది. ఈ దెబ్బలాటలోపడి నేను నుగ్గు నుగ్గైపోయాను. వీళ్ళిద్దరి కులాలూ నాకు వద్దు. నాకు ఇప్పు డున్న కులమే చాలు. ఏమోయి మాముంజి! చూస్తున్నావు కదూ! ఊరికే స్తంభంలా నిలబడకు. ఇందులో ఎవరో ఒకరు చచ్చేది ఖాయం. కొంచెం వీళ్ళను తప్పించు, విడదీయి మహానుభావా! ఏమోయి శికేరా! నువ్వైనా విడదీసి తప్పించు.

శికేర: నాకు వేరే పని వుంది. అక్కడ తెప్పించి వుంచిన సీసా ఖాళీ కానిదే లేవకూడదని చెప్పాడు – మా సుబ్బప్పగారు. ఈ జగడం విని వచ్చా. ఇదిగో వెళ్తున్నా ఇంక.

అప్పయ్య: ఏమోయి మాముంజి! కొంచెం విడదీయరాదా! ఏమైనా కొంచెం హెచ్చు తగ్గు లైతే నన్నూ నిన్నూ పట్టుకొని రేపు జైలులో పడేస్తారు. వాళ్లు డబ్బున్నవాళ్ళు. ఎల్లాగో తప్పించుకొంటారు. మన కెవళ్లు గతి?

మాముంజి: మాకీ జైలులో వేస్తారా? మాకీ ఏం చేసాం? అల్లా చేస్తే మా అమ్మదుగారు లేడా?

అప్పయ్య: వీడి అమ్మదూ సరే! వీడూ సరే! ఇప్పు డేమిటి ఉపాయం? పోలీసులను పిలిపించడమే మంచిదనిపిస్తోంది. అయ్యో! అయ్యో! ఇక్కడ దొమ్మీ అవుతోంది – 'అప్ప'లూ 'అయ్య'లూ చేరి దొమ్మీ -

మాముంజి: అయ్యయ్యో! (ఒక పోలీసు వస్తాడు) పోలీసు వచ్చింది – (పరుగెత్తుతాడు).

చెలువయ్య: ఎవరు? ఏమిటి? ఎక్కడ పోలీసు! అరే నిజంగానే సబిన స్పెక్టరుగారు వచ్చారే పరుగెత్తండి పారిపొండి జనుల్లారా!

సుబ్బప్ప: ఏం దేవుడా! పోలీసువాళ్ళను ఎవరయ్యా పిలిచింది! మామూ కులాలకు పోలీసు లెందుకయ్యా! 'అప్ప'ల్లారా పరుగెత్తండి పారిపోండి.

[‘అప్పు’లంతా పరారీ]

**[కోపంతో నిలబడ్డ నాగప్ప....పారిపోవడానికి వీలులేక రామప్ప నాగయ్యా గాయపడి నేలమీద పడి వున్నాడు. పోలీసు పోలింగు ఆఫీసరు]—**

పోలింగు ఆఫీసరు: అరరే! ఏమిటిది నరక్కోడం, చంపుకోడం! ఇదేం పోలింగు ఆఫీసా లేక సంతమార్కెట్టా! దెబ్బలాడుకోవాలంటే వేరే చోటే లేదా! ఈ ప్రకారం ఇక్కడ పని సాగకుండా ఈ దెబ్బలాడడ మేమిటి? ఏమిటి అర్థం దీనికి?

నాగప్ప: ఏమిటి చేస్తారు సామీ! ఎవరిని మందలిస్తారు మీరు. ‘అయ్య’ వారలు దెబ్బలాడి, మామీద విరుచుకొని పడ్డారు, మీరేమో మమ్మల్ని కళ్ళెర్రజెసి చూస్తున్నారు. ఎక్కడి న్యాయం?

పోలింగు ఆఫీసరు: స్వామీ! మీరా! చూడనేలేదు నేను! దొమ్మీ అయిం దంటే వచ్చా. ఏమిటో ఈ పెద్ద జగడం? ప్రాణాలు పోతున్నట్లు అరచారే ఎవరు వారు?

పటేలు: స్వామి ప్రాణంపోయేదేమిటి? ఇక్కడ పోయే పడివున్నాడు — చూడండి (నాగయ్యను ఎత్తి) అయ్యో! పాపం! నాగయ్యగారు చచ్చేపోయారే (ఎత్తేటప్పుడు).

నాగయ్య: నేను చావలేదర్రా!....నీళ్ళు....నీళ్ళు....దాహం....దాహం...

**పోలింగు ఆఫీసరు: ఏమిటి కథ స్వామీ! తలమీద కొట్టారా?**

నాగప్ప: ఎవరు నేనా?

పోలింగు ఆఫీసరు! మీరనికాదయ్యా! ఎవరైనా ఆయన నోట్లో ఇన్ని నీళ్ల పోయండి ముందు. స్పృహ వచ్చేటట్లు చేయవద్దా?

నాగప్ప: ఆయన నోటిలో మేము నీళ్ళు పోయడమా? ‘అయ్య’ల కులం నాశనమైపోయిననాడు పోస్తాం.

**పోలింగు ఆఫీసరు: ఏం స్వామీ! ఇంత విరోధంగా మాట్లాడుతున్నారేం?**

**తిమ్మప్ప: స్వామీ! మీరు చెప్పేదేమిటి? ఇంతింత అవమానాలు ‘అయ్య’ల మూలంగా మాకైనమీదట, వాళ్ళ నోట్లో మమ్మల్ని నీళ్లు పోయ**

మంటారా? నీళ్ళు కాదు - కోర్టుకెక్కి వాళ్ళ నోట్లో దుమ్ము కొట్టాలి.

నాగప్ప: ఖచ్చితంగా అంతే. కోర్టు కెక్కందే ముగిసే కథ కాదిది. కోర్టు మెట్లులు ఎక్కించి వాళ్ళచేత చాలు చాలు బుద్ధివచ్చిం దనిపిస్తాం.

తిమ్మప్ప: ఈ ఓటు ఇక్కడే పడివుండనీ. అది మనకు కాకుండా ఇంకో మగాడికి పోయేదేమీ లేదు. ఇప్పుడు మొదట, పోయి 'అయ్య'లమీద ఓ కేసు దాఖలు చేయందే - ఉపాయం లేదు.

నాగప్ప: తిమ్మప్పా! సరైన మాట. ఇప్పటికిప్పుడు పోయి కంప్లైంటు చేసిరా....వేరే ఉపాయం లేదు.

తిమ్మప్ప: ఇక్కడ మేజిస్ట్రేటు 'అయ్య'జాతివాడు గదా? అక్కడ ఎలా కేసు దాఖలు చేసేది? పెద్దకేసు పెట్టాలి.

నాగప్ప: అవుననుకో. పెద్దకేసు అంటే ఎవరైనా చావాలి గదూ! ఇప్పు డేమిటి చేయడం?

తిమ్మప్ప: మనవాళ్ళల్లో ఎవరైనా చచ్చారంటే చాలు ఈ దొమ్మిలో. ఇంతింత దెబ్బలాట అయిన తర్వాత చావకుండా వుంటారనే?

నాగప్ప: ఒకడున్నా చాలు, తిమ్మప్పా! పోయి అక్కడక్కడ విచారించు. ఎవరెవరి కేమైందో చూసుకొనిరా. మన వాళ్ళల్లో పారిపోయిన వాళ్ళల్లో చచ్చినవాళ్ళెవరైనా ఉన్నారేమో చూడు. విచారించు.... పద....పద....స్వామి, నే నిప్పుడే పోతున్నా. నాకు ఇంత పరాభవం అయిం తర్వాత ఫిర్యాదు చేయందే విడుస్తానా! నేను పోతున్నా. ఉండనీ. ఓటు మటుక్కు మనకే జాస్తి పడివుంటాయి గదూ!

పోలీంగు ఆఫీసరు: మీ రెటువంటి మనుషులయ్యా స్వామీ! ఇక్కడ ఆయన చావుబ్రదుకులమీద వున్నాడు; మీకు ఓటు చింత పట్టుకొంది; పోయి చూడండి.

నాగప్ప: పోతున్నా. మీరు కోపగించకండి (తనలో) ఆయన ఛస్తే ఎల్లాగో నాకే కదూ మెంబరీ! (నిష్క్రమిస్తాడు).

పటేలు: స్వామీ! ఈయన్ను ఆసుపత్రికి తీసుకొనిపోవాలి. చాలా పెద్ద గాయమైంది. నోట్లోకి ఇన్ని నీళ్ళు పోందే స్పృహే వచ్చేటట్టు లేదు. స్వామీ! నాగయ్యగారూ ఏమైంది?

పోలంగు ఆఫీసరు: ఏమంత అపాయంగా వుందా? ఒక్కళ్లైనా దగ్గిర లేక పోతే....ఏం చెయ్యాలి ఇప్పుడు - అదిగో! ఆయన ఏజెంటు చెలువయ్య వచ్చాడు. ఏం చెలువయ్యా! మా మంచిపని నీది! మీ యజమాని ఇక్కడ పడివుంటే, నువ్వే ఇక్కడ లేవంటే .... మరేం చెప్పాలి?

చెలువయ్య: ఎవరు? దొరలే! ఏమైం దిప్పుడు! నేను అక్కడ ఒకటి రెండు ఓట్ల కోసం మనుషుల్ని పిలవడానికి పోయాను. ఎవరు కొట్టారు? ఏమిటి సంగతి?

పటేలు: నువ్వు ఆయనకు కొంచెం గాలి వీస్తూ వుండు. నేను కొంచెం నీళ్లు తెస్తా (పరుగెత్తుతాడు).

చెలువయ్య: స్వామీ! ఆఫీసరుగారిది ఏమి జాతి; చెప్పండి. 'అప్ప'జాతి లాగా కనబడుతోందే? ఆహా! మంచిపనే. చచ్చేటప్పుడు 'అప్ప'ల చేతినీళ్లు తాగడమా? అట్లా ఎన్నటికీ వీల్లేదు. నేనే నీళ్లు తెస్తా (పరుగెత్తుతాడు).

పోలింగు ఆఫీసరు: (అతన్ని పిలిచి) ఆ నూతిలో నీళ్ళు వద్దు. అల్లా అయితే అది 'అప్ప'ల ఇంటి బావి. (నవ్వుతాడు).

(నీరు తీసికొని వస్తాడు).

పటేలు: నేను తెచ్చిన నీళ్లుకూడా పనికిరావా?

పోలింగు ఆఫీసరు: వద్దు వద్దు. ఇది 'అప్ప'ల అయ్య'ల మధ్య జగడం కదూ!

పటేలు: అదా సంగతి!

[చెలువయ్య నీళ్లు తాగిస్తాడు.]

నాగయ్య: అయ్యయ్యో! చెలువయ్య! ప్రాణం పోతోంది. ఆ నాగప్ప చంపాడు నన్ను - ఓ దేవుడా! చస్తున్నానప్పా!

పటేలు: చెలువయ్యా! పరుగెత్తుకొనిపోయి డాక్టరుగారినైనా పిలిచికొనిరా! రక్తం ఏరులా ప్రవహిస్తోంది.

చెలువయ్య: డాక్టరుగారినే?

పటేలు: ఔను. ఏం; దున్నలా నిలబడ్డా వెందుకని? వెంటనే పోవేం?

చెలువయ్య: దున్న గిన్న అంటే పళ్ళు రాలగొడతాను. డాక్టరుది 'అప్పు'ల కులమని నే నెరుగ ననుకుంటున్నావా? నువ్వు నాగయ్యగారిని ముట్టుకోరాదు; ఇంక ముందు....

పటేలు: ఏం? నోరుమూసుకొని-పిచ్చిముండావాడిలాగా పేలబోకు. మొదట చచ్చేవాళ్ళను బదికించు. ఆపైన మీ 'అప్పు' 'అయ్య'ల జగడంకానీ!

నాగయ్య: అయ్యో! చెలువయ్యా! నీళ్లు (నీళ్లు తాగిస్తాడు) చెలువయ్యా! చచ్చిపోతున్నా. డాక్టరును పిలు అప్పా! ప్రాణం పోతోంది. బది కుంటే నాగప్ప సంగతి ముగించవచ్చు.

పోలీసు ఆఫీసరు: పో చెలువయ్యా! ఆయనే చెబుతున్నారుగా – డాక్టరుని పిలవమని.

చెలువయ్య: స్వామీ! ప్రాణంపోయినా 'అప్పు'ల జాతి డాక్టరు రారాదు! చచ్చేటప్పుడు 'అప్పు'ల మందుతిని చావడమా! ఆయన చెబుతాడు- అయితేమాత్రం! కష్టసమయంలో ఆయనేమో చెప్తారనుకో! మనకు జ్ఞానముండక్కర్లేదా? రేపు మన జాతివాళ్ళేమంటారు? ఇదంతా చేసేది, చివరికి 'అప్పు'ల చేతినీళ్లు తాగడానికేనా? అని కులంవాళ్లు అడుగుతారా లేదా?

నాగయ్య: హాం! (అని ప్రాణం విడుస్తాడు)

పటేలు: ఇప్పుడు పిలు, మీ 'అయ్య'ల నందర్నీ. 'అయ్య'వారల గొయ్యి వాళ్ళనే తీసికోనీ.

[మిగతావాళ్లందరూ పరారి అవుతారు]

పాత్రల పరిచయం:

శ్రీరాముడు

బ్రాహ్మణుడు

భైరవుడు

మృత్యువు

స్థలం:— శంబూకాశ్రమము; అయోధ్య.

# శూద్ర తపస్వి

## దృశ్యము — ౧

[శంబూకాశ్రమమున నున్న అరణ్య బహిర్వలయమునందు ఆశ్రమ మహాద్వారంలో కావలి కాయుచున్నట్లుగా నిలిచియున్న ఒక మహా కాయమైనవట తరువు. శాంతికి పుట్టిల్లైన ఆ వనము, చూడజూడ, క్షుబ్ధశీలమగుచున్నది. పెనుగాలి వీచి, పక్షులు రొద పెట్టుచున్నవి. కొమ్మ కొమ్మకు పెల్లురేగిన ఆర్తధ్వనిఁబోలి చీత్కారములు విజృంభించినవి. మృగసముదాయము సురుగులు గ్రక్కుచు నలుదెసల పారిపోవుచున్నవి. దృష్టికి కేంద్రమై, దృశ్య పురోభాగమున నిలబడియున్న ఆ మహావట తరువుకూడ క్షోభించి యస్థిరముగా గానవచ్చెడు ఆకులు పెళపెళారాలి క్రిందపడుచున్నవి. పెనుగాలికి దుమ్ములేచి, యున్నదున్నట్లుగా వనమంతయూ, మసకచీకట్లు గ్రమ్మెను. వటవృక్షమూ, మంచులు క్రమ్మి, మాయమైనదై, దాని స్థానంలో, మెల్లిమెల్లిగా ఆ వృక్షమంత పరిమాణముననూ, భీకరాకారుడైన ఒక వృక్ష భైరవుడు దృగ్గోచరమగును. వృక్షశాఖల బోలియున్న అసంఖ్యాకములైన భుజములందు త్రిశూలాయుధపంక్తి, పంక్తిదీరియుండు సేనావ్యూహమువలె భయంకరమైయున్నది. క్రుద్ధునివలె కను బొమల ముడివైచి, మంటలుమియు కండ్లతో నలువైపుల నురిమి చూచును. తనకుతానై బిగ్గరగా మాట్లాడును.

భైరవుడు : ఏమి అవినయము నేడీ ప్రకృతిసాధ్వికి
ఉగ్రధీకుశంబూక యోగి లెక్కింపకయె

వృక్షభైరవు నాదురక్షను గడగంటఁజూచి
నొవ్వఁజేయుచున్నదీ తపో విపినమును
మథనకార్యమునకు జిక్కిన యంబుధి తరంగముఖంగి,
వడవడనడ్రుచున్నవి కాననాద్రులు. అఱచునిదె
పక్షిగణము. కీచకధ్యానములు కర్కశముగ
మ్రోగెడిని. కాళ్ళు చచ్చువడ డీకొను పరస్పరం
మృగసమూహం.
కారణంబేమొ గమనింపదగుగాదె
ధూర్తురాలీ 'దుష్కృతికి'[1] సంకెల తగిలింపకున్న
తపసి యాగ్రహమునకు గుఱియౌదు నేను.

[తిరిగి చుట్టిచూచి ధ్యానించును. చాల జాగ్రత్తగా ఎదుటచూచి అధికారవాణితో ఆజ్ఞాపించును.]

నిలు నిలుమక్కడె నిలునిలుము!
దగ్గర రావలదు! అటునటె తొలగి చను మఱెయటె!

[చూచుచుండగనే ఏమీలేక శూన్యంగాఉన్న బయలు కొంచెము నల్లవడును. నల్లని మంచు దట్టమై పట్టును. రాను రానంతకంతకూ గట్టిపడును. చివరికి మృత్యువుయొక్క కరాళాకృతి రూపుగొని స్పృష్టాస్పృష్టముగ నిలబడును.]

ఎవరు నీవు! ఏమి పని నీ కిచట? ఘోరముఖీ!

మృత్యువు: (భయంకర ధ్వనితో)
పేరు వినగల ధైర్యమున్నదా నీకు?

భైరవుడు: (ఉగ్రుడై)
ఉంటచేతనే ప్రశ్నింతు, వికృతవదనా!
అధిక ప్రసంగివి కావలదు చూవె!

మృత్యువు: నాదు నామ శ్రవణమాత్రాన
తనమ గుహాకంఠమునుండి మ్రోగు నరకము;

1 విరుద్ధ ప్రకృతిపీ కవి 'దుష్కృతి'గా నూహించెను—అనువాదకుడు.

గిరి గహ్వరములతో రోదించెడు నీ పృథ్వి;
భయమున వెలవెలపోయెడు స్వర్గముఖము
పేరు భీతికివెఱచి కంపించు ముజ్జగాలు!

భైరవుడు : నీకు భయపడనివాడు
నీ పేరుకు భయపడునొక్కొ!
నుడువుమీ వేగ; లేనిచో నీవు ముందెన్నడు
కానని యనుభవమ్ము గాంచగలవు.

మృత్యువు : ఆ గర్వమున్న వినుమోయి!
నేను మృత్యువును; దుర్మృత్యువును
ప్రవేశమ్ముగోరి వచ్చియుంటి
నీ తపోవనమ్మునకు!

భైరవుడు : (వికటహాస్యముతో నవ్వి)
చేటు వాటిల్లు నీకునిప్పట్లు
పాటు పద్ధతులున్నె నీకు?

మృత్యువు : నీవెవడవో ప్రశ్నింతువు?

భైరవుడు : తపోవనమ్ము రక్షించు
వృక్షభైరవుడ నేను
అమృతమీ క్షేత్రము
నిజము! నీ వడుగిడ
దగు నెలవె యిది!

మృత్యువు : ముల్లోకములందు నెందును
నన్నడ్డగింపగల మగధీరు
మీసాల పోతుఁగాన నేను
నీ వడ్డగింతువో! చెట్టు
చేమలపట్టి కాలమ్ము నెట్టువాడ!

భైరవుడు : (కటు హాస్యముతో)
ఆహా! ఎంచక్కని చుక్కవు నీవు?
నీకు గలద్గొ యోటమిఝోట? వినుమైనగాని

మహర్షి శంబూకునుజ్జ్వల తపఃప్రభావాన
నాకు లబ్ధమైన కర్తవ్య ధర్మబలాన
నిన్ను ముందుకొక్క యడుగుగాని
యిడగనీక, యాగగల సమర్థుడేను
మీరి ముందుకు రా పెనగులాడిన
ఈ నా భుజమ్ముమీ త్రిశూల పంక్తులు,
తోడేళ్లు గొర్రెల వెన్నాడి నటుల
వెన్నంటి తరుము నిన్నాలయానికి[1] నిజము !

మృత్యువు: నేనె లయము. నేనేమి
లయమగుదు ?

భైరవుడు: వెలుగునం దీదులాడక
తెలియరాదు పదార్థము

మృత్యువు: కోపగింపమి యనర్థమిపుడు !
(మృత్యుచ్ఛాయలు చిమ్మిక్రమ్మును)

భైరవుడు: (రౌద్రవాణితో)
మహర్షి శంబూకదేవునాన !
ఓసి మూఢురాల ! నిలుము నీవు !

[తన బుజాల మెఱయుచున్న త్రిశూలాలను మృత్యువు ముందు కంచెగా నాటును]

మృత్యువు: ఓరి వెర్రిబావులవాడ ! వినుము
శంబూకఋషి గౌరవార్థమై వచ్చితిని
ధర్మదేవు నాజ్ఞఁబడి
నీ వాతని యంగరక్షకుడవు;
నేను ప్రాణగౌరవాన్ని కాపాడుచుందు;
తెలిసి త్రోవనిమ్ము
కావలదు హాస్యమున కిమ్ము !

---

1 నిన్ను + అలయానికి=నిన్ను ఇంటికి
నిన్ను + అ + లయానికి=నిన్ను ఆ నాశనానికి—అనువాదకుడు.

భైరవుడు : (అచ్చెరువడి)
ధర్మదేవత యాజ్ఞయా ?
ఋషి గౌరవార్థమె ?
మృత్యువునకు తపోవన ప్రవేశము ?
జటిలమీవార్తాకంటకనికుంజమున
చిక్కెనాలోచనలు, విడివడునో మొదలు !
మృత్యువు : నేడు ప్రభాతవేళ నెవరెవరికి
ఈ వనమున తెరువిచ్చితో, తెలుపు మీవు
భైరవుడు : సూర్యదేవుని కిరణ దూతలకు
మృత్యువు : వెండియు ?
భైరవుడు : పుణ్యలక్ష్మిఁగూడి,
వసంత గంధానిలము గలిసివచ్చిన
ఆ శ్రీరామచంద్రుని కీర్తికాంతకు.
మృత్యువు : మఱియు ?
భైరవుడు : ప్రకృతి దేవి నిత్యపరివారమునకు
మృత్యువు : ఆపై ?
భైరవుడు : బాపడొకడు తనదు పాపగూడి
'పూజావిధికిఁ బూనియుందు' నని
లోఁ బ్రవేశింపనాయె !
మృత్యువు : అందునిమిత్తమే
నాదు యాత్ర
భైరవుడు : కారణము ?
మృత్యువు : చేసెన ధర్మము !
భైరవుడు : అది యెట్లో ?
మృత్యువు : అవజ్ఞామూలకము
భైరవుడు : ఎవరికాయెనవజ్ఞ ?
మృత్యువు : మరియెవరికి ? ఋషికి !
నీ గురుదేవుడౌ శంబూక ఋషికి !

భైరవుడు : (కోపముతో) ఎంతగర్వమా బాపనికి !

మృత్యువు : జన్మతః శూద్రుడతడటంచు !

భైరవుడు : (తటాలున కంచెగా నమర్చిన శూలపంక్తి నెత్తి)
శివశివా ! ఎంత భయంకర మీ పాపము!
శ్రీరాము నేల్బడినున్న యీ ధర్మరాజ్యములో !

[మృత్యువు మెల్లమెల్లన నల్లమంచుగా ఆశ్రమపు టంచులకు జరిగిపోవును. భైరవుడు మసక మసకగా తిరిగి వృషరూపియై నిలబడును]

తెర వ్రాలును.

## దృశ్యము ౨

[వెన్నెల పాలు నల్గడల చిందిన అయోధ్య. శ్రీరామచంద్రుని రాజసౌధము దగ్గఱనున్న ఉద్యానములో, ముదుసలి బ్రాహ్మణు డొకడు గగ్గోలువడి ఏడ్చుచుండును. చుట్టూ, చాలా దూరము వరకు, వ్యాపించి, రంగురంగుల పూలపొదలు, తీగెలూ, తరు వులూ, శోభించుచుండును. సీటిబుగ్గలు, నర్తకురాండ్రవలె, నాట్యమాడుచుండును. దూరముగా పాలరాతితో కట్టిన రాజ సౌధము శోభించుచుండును. దాని సోపానపంక్తి తరంగవిన్యాస ముతో ఉద్యానము వైపుకు దిగియుండుట కన్పించుచుండును.]

బ్రాహ్మణుడు : కందా ! ఆనందకందా ! కందా
ఓ నా చిన్ని కన్నవాడా !
సైతునెట్టులీ విధమైన మంట ?
నీదు వేర్పాటు నెట్టు లోర్తు ?
కంటి వెలుగువై యుంటివి నాకు
జీవితంపు టుసురువైతివి నీవు

కందా = బిడ్డా !

ముసలితనమున చేగ్రవై యుంటి
నీవు పుత్రా!
నీవు బోవుటకు మున్నె పోయె
సర్వమును నాకు
జగతి పెను శ్మశానములోని
జంగమ శవముగా దోచు!
నీ వొక్కగాని యొక్క నిసుగువు నేత్రపర్వమవు
గ్రుడ్డి మీ యమ్మను బేలనై యెట్లు గాంతు?
నేను దగ్గరింప
అడుగు సవ్వడి విని 'రాచిన్న! రా పొన్న' యనుచు
మొగము ముడుతలు విప్పార, బాహువులు చాచ
బిడ్డ బోగొట్టుకొన్న నావు పాలుపిండెడు గాడునిరీతి,
నేనేవేత్రపుత్తలికఁ బ్రశాంతినిండ,
జీవితాంబుధి బీల్చు బడబాగ్ని నార్పవలెనొ!
పలుకుమో పుత్ర బదులు పలుకుమోయి పుత్ర!
పలుకు! పలుకు!

(కొంచెము సేపు మౌనముగానుండి వెక్కి వెక్కి యేడ్చుచు)

గత జన్మలోని దుష్కృతమొ, గాకున్న
జీవితాంతమున బడసిన యొక్కగా నొక్క కొడుకు
కంటి యెదుట మడియఁగాంచి యుంటి
ఈ పుణ్య యుగాన?
అప్రాప్త యౌవనుడకృత పితృకార్యుడు
నిష్పాప జీవి, పంచశరత్ప్రాయుడు బిడ్డ.
ఏమికతాన నేడిట్లు రామరాజ్యమువీడి,
యమరాజ్యమునకై వెడలిచనియె?
నేనేమి పాపము చేసియుంటినొ
స్మృతిలేదు నాకు.
ఏనాడు మృషావార్త లాడితెఱుగ.
ఏజీవినేని హింస పాల్జేసి యెఱుగ.

మరియేరి దుష్కృతి ఫలముగ
మరణించె నా శిశువు?

(దుఃఖాతిశయముతోనూ, కోపముతోను)

నుడువుమీవు! ఓసి వెన్నెలరాత్రి!
నుడువుమీవు! ఓ యిక్ష్వాకు రఘుదిలీపాది
రవికుల నరేంద్ర రాజ్యధర్మ స్వరూపిణీ!
ఓ యయోధ్యా నగర లక్ష్మి!
వెనక నెపుడుగాని{ గన మింతింతలు ఘోరమ్ము,
వినముగూడ నిట్టి ఘోరమ్ము
శ్రీరాము నేల్బడి, రాముప్రజ కుందనగునా!
దొరల దోషమ్మె కారణమ్ము
ప్రజా సంకటములకు
వేరేమికాదు! నాన్యథా!
ఏమో ఒకడుండనేవలె రాముపాపము!

(ఆలోచించి, నిశ్చయించి)

వేతేమి ?
చాలదా యేమి? ఆ శూద్రుని తపముకై
క్రుద్ధమైన ధర్మశాపము!

(గట్టి గొంతుతో)

మృత శిశువును బ్రదికింపు మొండె
వినుము! రామచంద్ర!
ఇట నీ రాజ సౌధ ద్వారమున
మృతి నొందుదు నొండె,
బ్రహ్మహత్య కొడిగట్టి,
సుఖముండు ముండుము మరిమరి

(గట్టిగా)

ఆకసమా! నీవు సాక్షి!
ఓయి చంద్రమా! నీవు సాక్షి!

ఓ యయోధ్య నీ వీవె! సాక్షి!
వినుడు! స్వర్గమందు సూర్యమండల వర్తులౌ రాజులార!
మీ రెల్లరును నాదు పూన్కికి సాక్షులరు!

[వెన్నెల రాత్రిలో తెల్లనైన పాలరాతి రాజభవనమునుండి నీల గాత్రుడు, శ్రీరామచంద్రుడు, కరుణ ముఖముద్రతోడను, ఏదో అన్వేషించువానివలె నలువైపుల పూల పరికించుచు, గంభీరముగ ఆశవలె, ఆశీర్వాదమువలె ప్రవేశించును. దూరమునుండియే అతనిని గుర్తించి, బ్రాహ్మణుడు భయభక్తులతో లేచి, చేతులు జోడించి, నిలుచును. శ్రీరాముడు దగ్గిరకు వచ్చినకొలది, బ్రాహ్మణుని దుఃఖభావము ధన్యభావముగ పరిణమించును. శ్రీరాముడు అడుగు లిడి ముందునకు జరిగినకొలది, ఒక్కొక్క అడుగునకు, ఒక్కొక్క మాటను ధ్వనిపూర్వకముగా తనకు తానే చెప్పుకొనుచుండును.]

త్రిభువన పులకకారి ధన్య మీ దర్శనము!
క్రమన్యాసము సప్తసాగర జీవన క్రమము
ఆకసము వపుఃకాంతి!
వనాద్రి సంగతి, నొడలుమనము వనాద్రులైనవాడు
దశరథ పుత్రు డీతడు రఘుశ్రేష్ఠుడు నిజము!
కరుణమూర్తి యీతడు కౌసల్య సుతుడు నిజము నిజము!
ఋషి శిష్యు డీతడు మహాసంయమి యగు!
హరిధనువు విఱిచె నితడు, శక్రధనుస్సుందరుడు
మైథిలీ మనోహరుడు, కుసుమకోమలుడు,
నీలమేఘశ్యాముడు, గిరివన ప్రియుడు,
దశగ్రీవారి. ఉగ్రుడీతడు, వజ్రపజ్ఞాకఠోరుడు
అంజనాసుత హృదయమిత్రుడు పవిత్రుడు!
పంచవటి వసించె నితడు
గోదావరి స్నపించె నితడు
దైత్యకోటి ద్రుంచె నితడు,

శబరి యిడిన పండ్ల నారగించె నితడు
మేరు ధన్యుడు!
ప్రేమమూర్తి; ధర్మమూర్తి, క్షమామూర్తి;
శిష్టరక్షామూర్తి, దుష్టశిక్షామూర్తి
నరదేవు డీతడు పరదైవమె నిజము!
ఆశాస్వరూపి యితడు
వచ్చె నాతండ్రి యాశీర్వాదమె మైదాల్చినట్లు
ధన్యుడేను బ్రతికినాడ!
బ్రతికినాడ! బ్రతికి తిపుడు
బ్రదికింపడొ నా పసినిసుంగు?
బ్రతికెవాడు, వాడునుం బ్రదికె నిపుడు
(రెప్పవాల్చక చూచుచు నిలబడును)

శ్రీరాముడు: (రాజరాజ గాంభీర్యముతో వచ్చును)

ఈ వసంత పూర్ణిమా రజనిని
ఈ అయోధ్యా శాంతిని
తన కరుణ కథ, కారణముగ
కలతవెట్టె నా దుఃఖజీవి. (నిట్టూర్చును)
దూరస్థిత నర్థాంగి స్మృతికి దెచ్చినాడు
సీతా శోకమ్ము నవీకృతమ్మొనర్చు నాదుఃఖి,
ఎటనుండె? నెటుపోయె (కొంచెము చూచి)
ఇటునుండి ఈ తోటనుండి వచ్చుచున్నదా రుదితమ్ము

(వ్యంగ్యస్మితుడై)

నాదుబ్రదుకు చెవికెప్పుడీ
రోదనమ్మె సంగీతమాయెనోటు!
గోడె, అవతారి, తినెడుకూడాయె!
త్రాగునీరాయె కన్నీరు!

(తనవైపు వచ్చుచున్న బ్రాహ్మణుని జూచి)

ఘఖరో! ఏగుదెంతు రీకడకు!

(గురిపెట్టి చూచి)

ముదివగ్గు; బాపడు; దుఃఖజర్జరితుడు
ఇతడె యాక్రోశించునతడుగా నోపు.

(రెండడుగులు ముందుకు వేయును)

బ్రాహ్మణుడు : (వేగముగ వచ్చుచు)
అనాథరక్షకా! దుఃఖవిమోచకా!
సర్వలోకప్రభూ! పాహి! పాహి! (కాళ్ళకు మ్రొక్కును)

శ్రీరాముడు : లెమ్ము లేలెమ్ము, వృద్ధుడవు
పెద్దమనిషివి, బ్రాహ్మణుడవు,
మీరు గురుజన సమానులు మాకు.

బ్రాహ్మ : అర్థి సహజకార్య మొనర్తు దాశరథి!
పెనుదుఃఖమున గుంటువడె మతి
తిఱిపెకెచ్చుటిది పెఱిమె ?

శ్రీరాముడు : ఎవరు మీరు? ఏమి దుఃఖము ?

బ్రాహ్మ : నీవు తలచిన దుఃఖమనుచు నుండునో ?
నీవు విప్రుల ముఖమున గాంచునతని
పొక్కిటియందు పొందియుందువుగాదె!
కాలగృహమున శిశువైన నీ కంటె
వృద్ధులెవరు గలరు వేరు ?
విశ్వము సృజించిన పెద్దకును పెద్దవు!
నీకు నే మ్రొక్కులిడుట విపరీత మగునె!
మనుజగాత్రమ్ము స్వీకరించిన నీకు
పుడమితేనికిఁ గైమోడ్పులిడుట పాడి.
ప్రేమసాధనము చేసి నీవు కావొకా!
మహా తపస్వివి ?
మిన్న, తపమెన్నడేని—గుణమాత్సర్యమేల ?

1 పెద్ద = శ్రేష్ఠుడు = బ్రహ్మ—అను

శ్రీరాముడు: పెద్దల ననుకరింప, పెద్ద తానగు విప్రోత్తమ!
ఏమి వెతదయొ నీది! నుడువుమయ్యా!

బ్రాహ్మ: అపహరించె నైదేండ్ల యర్భకుని

శ్రీరా: ఆ నీచుడెవడో?

బ్రహ్మ: యముడు నాబడు వైవస్వతుండు.

శ్రీరా: నిజమె యిదియు!

బ్రాహ్మ: నా తోడరా నా తండ్రి చూపుద నా చోటు
ఆపై, నాయొక్కగానొక్కబిడ్డ శవమును.

(ఏడ్చుచు)

హే దయానిధి,
విపద్వేళల నెల్లరు నీ నామస్మరణమై
రక్షణ నందుదురు. నిన్నె వేడుకొందు నేను.
నా నిసుంగులేఁ బ్రాణాల భిక్ష నిమ్మనుచు
గావె నీవు కృపాబ్ధివి?—
సులభసాధ్య మదేమంత కష్టకరము?
లోకాపవాద భీతి యుష్మదర్ధాంగి
అగ్నిప్రవిష్టఁ బరిశుద్ధదేహ
సౌందర్యలక్ష్మి నా సీతాదేవి
నిండు చూలాలనియెంచ కడవికంపి
నీదు భీష్మ పౌరుషమ్ము మెఱయింపలేదె!

శ్రీరా: (నిట్టూర్చుచు మొగము ముడివడజేసి)
చాలునయ్యా! వార్త యిది ద్విజుడ!
కార్చిచ్చు[1]న కూర్చిచ్చు[2] నెదురొడ్డి నందింతు వోటు!
నీదు వెతదకొనె పరిహారమ్ము నాదు వెతద.

బ్రాహ్మ: మన్నింపు మన్నింపు మహీనాథ!
నాదు నిసుంగు ప్రాణమ్ము గోరివచ్చితి
దయతోడ దానినిమ్ము.

1 కార్చిచ్చు = అడవి మంట, దావానలము
2 కూర్చిచ్చు = కూరిమంట—అను.

శ్రీరా : ద్విజోత్తమ !
నీ నుడు లద్భుతములోయి !
ధర్మాధికారి వైవస్వతుండు
నాదు రాజ్యమున నిట్లొనర్పలేడు
దీన నేదియొ ధర్మచ్యుతియై యుండు మున్నె !
అప్రాప్త వయస్కు, బాలు
నెత్తుకొనిపోయిన కాలు గడగడలాడింతు
తప్ప తనిదైయుంట—అయినగాని
యపరాధ మతనిదిగా భావింపనొల్ల
మీరేమైనగాని యపూజ్యము
నాచరించిరయేమి ?

బ్రాహ్మ : పేర్వాసిగన్నవారు నా మాత్రపితలు
విద్య నొసగిన గురువులు సజ్జనులు
విప్రగృహము నలరించె జన్మనాది ప్రభువ !

శ్రీరా : మాన్యులరు మీరు
ధన్యమీ నా రాజ్యము మిమ్ముగనుట
ఇందెవరైనగాని చేతురే నధర్మము
మీ సుతుమృతికి కారణంబె యది ?
మీ రెరిగియున్న తెలుపుడు దాని
నున్మూలింతు నిపుడె
కారణ నాశమ్ముజేసి కార్య నాశమ్మగు.

(దృఢమైన వాణితో)

నాదు రాజ్యాన నెడములే దధర్మికి !

(శ్రీరాముని ధర్మక్రోధమునకు బ్రాహ్మణుడు బెదరును. మిటకరించి చూచునతనికి రామచంద్రుడు ధైర్యముచెప్పు ధోరణిలో)

విడుమంజిక[1] ను నుడుమి, నిజమును

బ్రాహ్మ : క్షమింపుమో మహాపురుష !
జిహ్వ తొట్రువడు నాకు

---

1 అంజిక = బెదరు.

శ్రీరా : నిజమూది వలుకుటకె ?

బ్రాహ్మ : నీ సమక్షమున నిన్నె పేర్కొనుటకు

శ్రీరా : (కొంచెము విశ్రాంతిగొని తనలో తాను)
అపరాధములకెల్ల నేనె మూలమో యేమొ ?
నాడాడె మడివాలు ! నేడీ బాపనయ్య !

(బ్రాహ్మణునితో)

ద్విజోత్తమ ! సత్యము సర్వపూజ్యము సుమ !
సత్యమునకేల మొగమోడవలె ?
అవధీరితముగాదు
సత్యమాలకింప నీ దశరథాత్మజునకు;
సత్యమెవరికిగాని క్షేమదమ్మె,—
కీడ్వ్యఱచినగాని, త్రోసిపుచ్చినగాని—
వక్తృశ్రోతలం దెవరికేని—అలసింపక నుడువుమోయి !
నా జేసిన యపరాధము ? నానుండి యేమి అధర్మము ?
జన్మచేతనె గాదు కర్మమూలమునగూడ
గురువులౌదురు మీరు
చెప్పుడిపుడె తడవుసేయక చెప్పుడీరు !

బ్రాహ్మ : శిష్టపరిత్రాణమూర్తి ! రామమూర్తి
వినుము, వినుము
నేటి యుదయవేళ దేవపూజకై
పూనవలెనని నేను సుతునిగూడి
పోయితి నొక పేరున్న వనానికి

శ్రీరా : పేరుగలదె ఆ వనానికి ?
ఉండు నెటువైపు.

బ్రాహ్మ : పాపకరమని దాని నుచ్చరింప నోపనేను
కలదది మృత్యు దిశాముఖమై.

శ్రీరా : పేర్కొన్న మాత్రాన పాపమున్నె ?
నుడువుమోయి విప్ర ! నుడువు మిపుడు.

బ్రాహ్మ: శంబుకాశ్రమమని
దంభమున పల్కుదురా కానన్.

శ్రీరా: (చింతామగ్నుడై పిమ్మట)
ఓహో! యిదియేమి! యిప్పట్ల వెలుగేదో
వెలుగుచున్నది మత్పురోభాగమున?

బ్రాహ్మ: ఇకనెటులో! మహాప్రభూ!
చూచుచున్నాము! తపము పండినవాని
శూద్రుని, శంబూకాహ్వయుని,
ఋషివేషధారి, పాషండు నిపుడు.

(శ్రీరాముని కనుబొమలు ముడివడును. ఆలోచించుచు నిలబడును.
బ్రాహ్మణుడు తనలోతాను మాట్లాడుకొనుచుండును.)

ఇప్పట్ల నా శూద్రు గొప్పలుడుగు
అధర్మ శ్రవణమాత్రాన
క్రోధానలోత్తప్త మగుచు
రౌద్రమాచికొన్న దెంతగా
నీ రామచంద్రు ముఖనీరేజమ్ము.

శ్రీరా: (సౌమ్యుడగుచు బ్రాహ్మణుని దిక్కుమొగంబై)
నమస్కార మొనర్పరేమి?

బ్రాహ్మ: (చెవులు మూసికొని)
శివశివ శివశివ!
అంతంత ఘోరమ్ము నలవిగాదు చేయ
అభమునుభము నెఱుగని కుర్రని
కంజలించెడు పో
'మాను మాను శూద్ర సమానుడగుట!
అని బుద్ధిగఱపి నాపువాడ నితని.

శ్రీరా: (వ్యంగ్యముగా)
ఎంతచెడిన మీరు వేదమూర్తులుగద!

బ్రాహ్మ : మీ రాజ్యమందుండి
నంత నొక్కడైన నధర్మమాగకున్న
నరకమ్ముగాదె మాకు ?

శ్రీరా : ఓహో ! నిజము !
స్వర్గమబ్బు టాగిపోవు !
ఆ న్యాయ్యముకంటె వేరె మీ యర్భకుడు ?
స్వర్గస్థుడైనాడని యందురేమి !

బ్రాహ్మ : కాదుకాదు; రామచంద్ర !
శూద్రుడు తపముచేసెడి యధర్మమునకు
వర్ణాశ్రమ ధర్మోల్లంఘన పాపమునకు
నీ బాలప్రజయొకడు బలియాయె——
ముందేమి మహత్కార్య మొనర్పనుండెనో
శాస్త్రమేమి ప్రపంచింపనుండెనో !
కావ్యమేమి గూర్పనుండెనో !
ఏమి తపంబొనర్చి ఏమిసిద్ధుల పడయనుండెనో !
అట్టి ప్రజ శూద్రుని తపోదుష్కృతికి బలియాయె రాజ !
పాపకుండు కడతేర్చునతని !

(ఏడ్చును)

శ్రీరా : (స్వగతము జాలితోడను, కోపముతోడను గూడ)
ఈ వర్ణ గర్వాంధునకు,
ఈ శాస్త్రమూర్ఖునికి నెట్లు
గఱపవలెలో బుద్ధి ?
శంబూకుడు మహాయోగి,
తపస్వికైన తిరస్కృతికిఁ
గుపితమై ధర్మము
తెచ్చిన దీతని ముద్దుబిడ్డనికి
నాదురాజ్యమునగూడ 'నకాల మరణమ్ము.
తనదు దోషమ్ము నెఱుగజాల కితడు,
ధాటుగా లోలోన నన్ను

బాహాటముగ శంబూకయోగి
నిందించు నితడు.

(ఆలోచించి నిర్ణయమునకువచ్చి మరల)

త్రోవఁజూపుమో ద్విజుడ!
శంబూక విపినమునకు
పోదమా యెడకుఁ, జూడ్తు మధర్మమును
రామరాజ్యమున మృత్యువన వేరెలేదు
అధర్మమె మృత్యువై యంగవించు
అధర్మ సంహారమె మృత్యు విజయమ్ము
ధర్మదేవత జయమ్మె యమధర్మరాజు నపజయమ్ము
ధర్మమ్ము బ్రదికెనేని బ్రదుకు నీదు నిసుంగు.

బ్రాహ్మ: (స్వగతము) రాముని నిందయు నన్వర్థమగునెంతొ,
తత్ప్రశంస యెంతగా సఫలమగునొ!

(రామునితో)

పోయెదమో రాక్షసారి, ధన్యుడేను.

శ్రీరా: వత్తుమిదె (ఆకాశమువైపు చూచుచు)
పుష్పకమెక్కి శంబూకాశ్రమమునకు పోదుమిపుడు.

[శ్రీరాముడు ఉత్తరదిక్కువైపు చూచి, పుష్పకమును స్మరించును. బహుసంఖ్యాకముగ చిరుగంటల 'టింటిణ' మధురనినాదము విన వచ్చెడిని. ఇచ్ఛారూపమై కామగమనము గల్గు నా విమానము వెన్నెల కుప్పాయెనో యనునట్లు మబ్బుతెరవలె గోచరమై నేలకు దిగివచ్చును. శ్రీరామునితోడ, బ్రాహ్మణుడుకూడ, విమానమునకు కైమోడ్చి ఎక్కును.

విమానముపైకి లేచి, ఎగిరి దూరదూరముగా కనుమఱగై, నాదావశిష్టమై వెళ్లిపోవును.]

(తెర పడును)

---

అంగవించు = గెలుచు; మించు

## దృశ్యము — 3

[శంబూకాశ్రమమందలి వన్యసీమ. పూర్ణిమనాటి వెన్నెలలో ఆప్లావితమై వుంది. ఎక్కడ చూచినను నిశ్శబ్దము. పూవు పొదలు పెరిగిన ఒక పుట్టవద్ద బ్రాహ్మణ కుమారుడు పడియుండును. కళేబరానికి సమీపముగా ఛాయారూపమైన మృత్యువు నిలిచి కానవచ్చును. అచ్చటకు అనతిదూరములోనే సమాధి మగ్నుడై యున్న శంబూక మహర్షియొక్క ధ్యానస్తిమితమైన ఆకృతియు సంకేతముగా గోచరించును. అతని చుట్టును అడవి పెరిగియున్నది. శ్మశ్రుమయమైన ముఖము, జటాసూత్రములు, తీగెలతోపాటు పెనవైచికొని యున్నవి. సగము శరీరము మేర పుట్టకూడ పెరిగియిన్నది. భవ్యమైన ఆ దృశ్యము నావరించియొక తేజఃపూర్ణమైన పరివేషము గానవచ్చును. పరిశీలనగా చూచినయెడలనే గోచరించునటువంటి, ప్రకృతిలీనమైన ఋష్యాకృతి. ఉన్నదున్నట్లుగానే, వనములో భావసంచారమగు రీతి, గాలిపీవఁ బూదీగెలు పొదలును, అన్నీ తలసూపుచుండును. మృత్యువుకూడ భక్తితో వంగి కైమోడ్పు సంధించును. ఆ దిక్కునుండియే బ్రాహ్మణ ద్వితీయుడై శ్రీరాముడు ప్రవేశించును. అతని వదనము భావదీప్తమగును. తన యానందమునకై తానె మాట్లాడుకొనుచున్నట్లున్నది.]

శ్రీరా: ఏమి శాంతినెలకొన్నదీ యంపంపుఁజోటు
అనుభవమె తెలుపు నిది ఋషివాటికంచు
తపోమహిమ కీడుగలదె?

(రసానుభవము పొందుచున్నట్లు ధ్యానభంగిమపూని నిలుచును)

బ్రాహ్మ: (స్వగతము)
చోద్యమై యుండు రాజేంద్ర! నీదు చొప్పు
రాజసౌధమునందు వళ్లె, గిరివన ప్రకృతిపై

అది యేమి ప్రేమమో! అదేమి మోహమో?
సీతను విపినభూముల కనిచిన యాతనికి
అరణ్యమె సీతయై యాడునొ కనులముందు!

శ్రీరా: (బ్రాహ్మణునితో)
కాన్పుమోయి! ఆ స్థానమ్ము

బ్రాహ్మ: రమ్ము ప్రభువా! చూపుదు నిపుడె!

(ముందుకు నడిచి)

ఇటుచూడుమోయి! ఇటుచూడు!
కోసలేశ్వర!
కళ తప్పియుండె నా కులగోపుర కలశమణి!

(ముందు పడవైచి)

రక్షింపు రక్షింపు! నా యీ కంటివెలుంగు!

(శవముగలచోట కూలబడును)

శ్రీరా: (ప్రయత్నించినను, సాధ్యపడక, అస్థిరుడై కళ్లుతుడిచికొని, స్వగతముగా)
స్థితప్రజ్ఞునకు గూడ నధైర్యమొడగూర్చు నీ
పుత్రశోక దృశ్యమెందును,
నా వియోగాన యెదబ్రీల ప్రలపించు,
నా తండ్రిని స్మృతికిఁదెచ్చు నీ ముసలితండ్రి!
ఏమి మాయ!
అమృతము సాక్షాత్కరించినవారికి గూడ
మృత్యువెంత సంకటకరము!
నాటకములోని నిజమెఱుగ
నేపథ్యమును ప్రవేశింప మేలగునొ?

(బ్రాహ్మణుని సమీపించి)

అజ్ఞానముమై యటమటింపకు
వేదవేత్త!

నడిచిన యొక యధర్మమ్ము నాశ మొనర్ప
అమృతుండగు నీ యీ చిరంజీవి!

బ్రాహ్మ: (ఉన్మత్తమైన హర్షముతో పైకిలేచి)
"అమృతుండగు నీ యీ చిరంజీవి!"
సత్యవాక్కువు నీవు, ఇక్ష్వాకు కులేంద్ర!
ఇంక నాదు పాప, చిరంజీవి!
పరిహరింపు మా యధర్మచారిని
శీఘ్రాతి శీఘ్రముగ

శ్రీరా: (చేతులు జోడించి నిలిచియున్న మృత్యుదేవతను ప్రసన్నదృష్టితో తిలకించుచు)
ఇదేమి నీవీ తపో విపినభూమి

(మందహాసము నెఱపుచు)

ఉపవాస మాచరింతువా యేమి?

మృత్యు: (నవ్వు మొగముతో)
తపము చేయుచుందును

శ్రీరా: (వినోదముతో)
ఎవరి యమంగళమైన సిద్ధికొఱకో?

మృత్యు: దైత్యవైరి ధర్మసిద్ధికై!

శ్రీరా: నైకసహస్ర వందనములు నీకు!

మృత్యు: ధన్యురాల నేను!

బ్రాహ్మ: (శ్రీరాముని విస్మయముతో జూచుచు తనలోదాను)
ఎవరితోడ సంవాద మీ
గగనవర్ణునకు?

శ్రీరా: ద్విజోత్తమ! నీవు నుడివెడి
యీ యనధికారి,
ఆ శూద్రుడు
తపమొనర్చుతావు జూపుమె తడవు!

బ్రాహ్మ : (చేతిలో చూపుచు) అదిగో చూడు మా వల్మీకమువైపు!
శ్రీరా : (స్వగతము)
ఏమి జిహ్వా ఈ విప్రునిది ?
మాట మాటకు నేమి మర్మాఘాత
మొనర్చు నితడు
వల్మీకమనెడు పదమాలకించిన నాకు
సీత రక్షించు నా మహాకవీశ్వరుడు
స్మృతిపథమ్మున నిలుచు
ఏలనో పొంగివచ్చెడు మనమున
దివ్య దుఃఖమ్ము ।
ఆ కవి ఋషియు నీ శంబూకునివలెనె
శూద్రుడె గాబోలు ?
వ్యాధవృత్తిగలాడు ఉగ్రతపమున
మహర్షిత్వ పద మధిరోహించెగాదె ?
తపోమహిమకు సాటిగలదె ?

(బ్రాహ్మణుడు చేయిచూపిన వైపు చూచుచు విల్లును సిద్ధపఱచు నెప మునవలె, శంబూక మహర్షికి కైమోడ్పు సంధించును)

బ్రాహ్మ : (వెఱగుపడి తనలో) ఇదేమి ?
తపముచేయు పాషండునకు
కైమోడ్పునో !
మరి ధనుర్జ్యావల్లి బిగియించు విద్యాకౌశలమ్మొ
తెలియలేకుంటి నీ పార్థివేంద్రుని
విచిత్రకృతిని
చిత్ర విచిత్ర ప్రకృతిని !

(సంభ్రమవృత్తి నిలఋడును)

శ్రీరా : (బ్రాహ్మణునివైపు తిరిగి)
భూసురోత్తమ
క్షత్రియుని యెండు సందేహమ్ము నివారించి
కృపఁజూపవలె.

బ్రాహ్మ: (వినయముతో)
నా మందమతికి తోచుమాట
పల్కువాడ.

శ్రీరా: (వ్యంగ్యముగానైనను, గంభీరుడై)
పూజ్యా ఉదాత్తబుద్ధిమై పలుకదగును

బ్రాహ్మ: యథాశక్తిగ! రాజేంద్ర!

శ్రీరా: తపము పూజ్యకర్మ మగుగాదె! ద్విజేంద్ర!

బ్రాహ్మ: తపమున కీడుగలదె! రాఘవేంద్ర!

శ్రీరా: తపముచేయువాడును పూజ్యుడౌగదె విబుధవర్య!

బ్రాహ్మ: నిజము, ధర్మమూర్తి!

శ్రీరా: పూజ్యులఁ బొరిగొనుట
పాపకరమ్ముగాదె సత్త్వశీల!

బ్రాహ్మ: నిస్సంశయంబు, వాలి సంహారి!

శ్రీరా: (కనుబొమలు ఎక్కువెట్టి నిదానముగా పలుకును)
అటులేని
ఈ తపస్వినిఁజంప పాపమ్ము గాదె!

బ్రాహ్మ: వసిష్ఠ శిష్య!
తర్కమును మించును శ్రుతివాక్య మెపుడు
తపమున కనధికారి శూద్రుడు,
శాస్త్రప్రసిద్ధ మిది యెందును
కృతయుగాన తపమున కర్హులు
బ్రాహ్మణులు మాత్రమె
త్రేతలో క్షత్రియులు నర్హులె
వైశ్యులైన నర్హులె తపమొనర్ప
ద్వాపరమున
కలికాలమున శూద్రుడును తపస్వియె!
అది కారణముగ
కృతయుగమున నాల్గుపాదాల నిలిచె ధర్మము
త్రేతమున మూడుకాళ్ళనియుండె

ద్వాపరమున నదియు ద్విపాది
కలియుగాన ఒంటికాలిపై కుంటుచుండు
భయమున కంపించి చచ్చి దొరలిపోవు విలయమువైపు
వినుము! వర్ణాశ్రమ ధర్మపాలకుడ!
పాలనమ్ము పూజ్యమైన
జీవాతువైన యెడల,
త్యాజ్యమా న్యాయ పాలనమ్ము
న్యాయపాలనమ్మున కెనయె శూద్రుని తపము గిపము

శ్రీరా: (కోపమును ప్రకటింపకుండ వ్యంగ్యముగా)
సార్థకము నీవునేర్చిన విద్య ఆచార్య!
మీకు సమ్మతమ్మె బాణప్రయోగమ్ము!

బ్రాహ్మ: సమ్మతమ్మె ధనుర్ధర!
శిక్షార్హుడే శూద్రతపస్వి!

శ్రీరా: శూద్రునందైన తపము శక్తిదాయకమ్ము
చాలదీతనిఁ జంప సాధారణ సాయకమ్ము

బ్రాహ్మ: దివ్యాస్త్రమేది దైత్యేంద్రు
రావణు దశశిరములు డుల్లనేసెనో, దాని
విడుము! అరిందమ;
పాపకర్మమున నీతడాతనికి క్రిందుగాడు

శ్రీరా: బ్రహ్మాస్త్ర మతి భయంకరము, ద్విజన్మ!
తనదుశత్రువుఁ దొడఁబిగాని విడదేమైనగాని!

బ్రాహ్మ: ఈ పాషండునకది తగినదె నిజము
తొడగివిడుము దాని, కోదండపాణీ!

[శ్రీరాముడు అంప పొదిపై చేయిడును. భూమి కంపించును. గగనము దిర్ధిర తిరుగును. బ్రాహ్మణుడు బెదరి ముడుచుకొని రాముని చాటునకు పోవును. మృత్యువు వికటముగా బొబ్బలిడును.]

మృత్యువు: తాళుతాళుము! ఋతప్రభూ!

శ్రీరా: (మృత్యువును జూచి) నీకిదేమి తల్లడము ?

మృత్యు: ఇదేమి ఆటయొ! నిజము మాటయొ!
నాకు తెలియఁజెప్పు
నాకేది చనెడు త్రోవ ?

శ్రీరా: (కుంచితభ్రుకుటియై)
మృత్యువా!
అలంఘ్యమెన్నడైన కర్తవ్య మెవరికైన!
మార్గదర్శి యీ మహాస్త్రము!

మృత్యు: ఆజ్ఞ! (తలవంచి, అస్త్రానుగామిగా సిద్ధపడును)

[శ్రీరాముడు బ్రహ్మాస్త్రమును తొడిగి "అరసి చంపుము ధర్మ ద్రోహిని" అని ఘోషించి, లాగి విడుచును. మెఱపుతీగె మెఱసిపోవును. పిడుగులు పడును. ఝంఝువు బోరుమని వీచును. ధూళి నల్దెసలఁ గ్రమ్మును. అరణ్యము సమస్తమును, తపించి గగ్గోలువడి పోవును. మృత్యుకరాళచ్ఛాయ రౌద్రరోషములఁ, శర వేగమున అస్త్రమును వెంబడించును. తపస్విని సమీపించిన బ్రహ్మాస్త్రము తన ఉగ్రతను వీడి, వినీతమై శంబూక ఋషిని ప్రదక్షిణించి అడ్డముగా పడును. మృత్యువుకూడ దానినే అనుక రించును. బొమ్మెరవోయి చూచుచున్న బ్రాహ్మణునికి శ్రీరాముడు మందహాస సుందరముగా నిట్లు నుడువును]

శ్రీరా: ఇదేమి! ఆచార్య!

బ్రాహ్మ: హే దాశరథి! ఇదియెల్ల శూద్ర
తపస్సు వలని తమఃప్రభావమె! ఖండితముగ!
నీవు విడిచిన బ్రహ్మాస్త్రమును నిష్ఫలమాయెనా!

శ్రీరా: బ్రహ్మాస్త్రమగునె నిష్ఫలమ్ము
ఇపుడిపుడె సఫలమగు!

బ్రాహ్మ: (అచ్చెరువడి) ఎట్లొ ?

శ్రీరా: ఋషివరునకు మర్యాదలు చెల్లించి
తదనంతరము, వచ్చు నీకడకె.

బ్రాహ్మ: తిరిగి ఇక్కడకు? అదేలనో?
శ్రీరా: తన పగతుఱ హతమార్చ.
బ్రాహ్మ: ఎవరిని?
శ్రీరా: అధర్మిని.
బ్రాహ్మ: ఆ శూద్రునె?
శ్రీరా: కాదు కాదు. బ్రాహ్మణవరేణ్యు.
బ్రాహ్మ: బ్రాహ్మణవరేణ్యు?
శ్రీరా: (దర్పముతో)
పూజ్యుల నవజ్ఞయొనర్చు నాతని
శాస్త్రసంభ్రాంతు, దుర్వినీతు.
బ్రాహ్మ: (శ్రీరాముని సంకేతమున కులికిపడి)
ఆ! ?
శ్రీరా: (బ్రాహ్మణునివైపు చూడకయే)
నిన్నె! ద్విజోత్తమ!
బ్రాహ్మ: రక్షింపు మనాథరక్షకా! దీనబంధూ!
శ్రీరా: (అతనివైపు చూడకయే)
మీ రవజ్ఞపఱచినది కాదు నన్ను.
బ్రాహ్మ: గతియేమి నాకు!
తెరువు చూపుమో
క్షమాకన్యా జీవితేశ్వరా!
శ్రీరా: (అతనివైపు చూడకుండ)
మార్గదర్శి ఆ మహాస్త్రమె!
బ్రాహ్మ: అస్త్రైు చేతు మీ యాజ్ఞబడి.
శ్రీరా: (అతనిని జూచి దయతో)
చాలదిక వృథా అజ్ఞాపాలనము
బుధప్రజ్ఞ కల్గు తెలివదగు; ద్విజాడ!
తండ్రియు బ్రదుకు, పసివాపయు
పెఱిగి పెద్దయగుదాన!

బ్రాహ్మ: శాస్త్రసమ్మతము గానిచో సంచలింతు క్షత్రియోత్తమ!

శ్రీరా: సన్మతి సత్కృతికి శాస్త్రసమ్మతమేల?
అయిన నీకు నొసగెద శాస్త్రవచన మొకడు

శ్లోకప్రమాణము :—

"కేవలం శాస్త్రమాశ్రిత్యనకర్తవ్యో వినిర్ణయః
యుక్తిహీన విచారేతు ధర్మహానిః ప్రజాయతే॥"

బ్రాహ్మ: (రెప్పవాల్పక శ్రీరామునే చూచుచు, కొంచెము సేపు నిలిచి, వెంటనే)
బోధమాయె నాకిప్పట్ల మహాప్రాజ్ఞ!
బుద్ధిగఱపితివి సంప్రదాయ బద్ధునకు
శాస్త్ర సమ్మూఢునకు, జాతి గర్వాంధునకు
ఏ జాతి తరువైన నింధనమునకు కొఱత యుండునె?
అగ్నికి భేదబుద్ధిగలదె?
పెనుమంటకు దాక్షిణ్యమె!
ఎవరైననేమి? ఆరాధ్యులుగదె తపోధనులు
[1]నమస్కారమె పుణ్యము; తిరస్కారమె పాపము!

శ్రీరా: వారికేమి చేసినగాని పుణ్యమని తెలియుడిప్పట్ల
భూమాత యల్పఫల దాత్రియౌనె
పిండినంతనె ఇక్షు విచ్చునటులె మధురసమ్ము
చిలికిన నేమి కడలి అమృతమ్ము నిచ్చినటుల
మీకును భద్రమగుత! విప్రదేవ!

[ముందునకు తూగిపడుతున్నట్లు నడిచి బ్రాహ్మణుడు శంబూక మహర్షికి సాష్టాంగప్రణామ మాచరించును. వనమంతయు సంభ్రమించిపోవును. పుష్పవృష్టి గురియును. దేవదుందుభి

1 'అయ్యా ఎందరె స్వర్గ, అలవో ఎందరె నరక' అని ప్రసిద్ధ కన్నడ వచనాంశము. అయ్యా అంటే స్వర్గం, ఒరేయి అంటే నరకం—అనువాదకుడు.

[మోగును. మృత్యుచ్ఛాయ త్వరత్వరగా పరువులెత్తి కనుమఱుగై పోవును. బ్రాహ్మణ కుమారుడు పండుకొనినవాడు లేచినట్లు, లేచి కళ్లు తెఱచి, చుట్టుప్రక్కల జూచి, తన తండ్రిని పిలుచును.]

కుమా: నాన్నా! నాన్నా! ఓ నాన్నా!

పూలుకోయువాడ నిక్కడనె నిద్రపోతి
ఎటువోయెనో నాదుతండ్రి నన్ను వీడి

(పూలబుట్ట తీసికొని ముందుకువచ్చి, రాముని జూచి)

ఎవరీతడు రుంద్రసత్త్వుడు!
దేవతవోలె దీపించు!

శ్రీరా: అంజవలదు, రాబిడ్డ మీ
యయ్య! వాడుగో!

[లేచి వచ్చుచు నూత్న తేజస్సుతో మెఱసిపోవుచున్న బ్రాహ్మణుని జూచి కుమారుడు "నాన్నా నాన్న!" అనుచు పరుగెత్తుకొని పోయి, కౌగిలించుకొనును. మాటపెగలని సంతోషముతో కన్నీళ్ల గురియుచు బ్రాహ్మణుడు కుమారుని రాము సన్నిధికి పిలుచుకొని వచ్చును]

బ్రాహ్మ: (సగద్గదికముగ)

కైమోడ్పుమోయి! బిడ్డ! సీతాపతికి
రాజరాజేంద్రునికి! శ్రీరామచంద్రునికి
మనల నిర్వుర రక్షించినవానికి!

[కుమారుడు ఆనందమున పొంగి చేతులు జోడించును. శ్రీరాముడు అతవి నెత్తుకొని ముద్దాడి, శంబూక ఋషిని చూపించును.]

శ్రీరా: నమస్కరింపుమా మహా తపస్వికి, ద్విజకుమారుడ!
మునికృపచే నీవిప్పట్ల నిజముగ ద్విజుడైతి
తపము దానున్నచోట దూరీకృత కర్మమగును!

(కుమారుడు కైమోడ్చును)

నీదు చేదోయికి నిన్నెత్తుకొన్న నాదు చేదోయికి!
అఖిలురకు శ్రేయమగుత!
రాజ్యమగుత నిర్విఘ్నమ్ము
జయించుత ఋతమ్ము!

[కుమారుని వలెనే బ్రాహ్మణుడును చేతులు జోడించును. శంబూక ఋషిని చుట్టుముట్టియున్న పొదలు, అడవి, నశించును. రెండు బాహువులు బైటికి గానవచ్చి, మెల్లిగా ఆశీర్వాదముద్రయందు నిలబడియుండును. దేవ వీణాగానము వాయుమండలమంతట నిండును. పుష్పవృష్టి గురిసి ఆ వర్షధారయె నేసినతెర యన్నట్లుగా దృశ్యపుతెర వ్రాలును.]

## పాత్రల పరిచయం

రాముడు

సీత

లక్ష్మణుడు

సూత్రధారుడు

వాద్యబృందము, గానగోష్ఠి

స్థలం :— పంచవటియందలి
పర్ణశాలకు - లోపల - బైట

కాలము :— సుమారు రూపకమంతే.

# హారిణాభిసరణము

## నాందీశ్లోకము

(రాగము – అమృతవర్షిణి)

(వృత్తము) శ్రీరాముని సతికాయెను మాయామృగవాంఛ
శ్రీరామాయణమాయెను ముని కరుణా గాథ,
పంచవటిగల ఆ దివ్యుల దుఃఖము తలఁచి,
అల్పులము, మనదు చింతలుడుగనీ, తఱిగి

సూత్రధారుడు

(రాగము – ధన్యాసి)

(వృత్తము) మధురగీతి నర్పింపగను మహిష్ఠ చరిత,
కవితోడ మనమిందు గలిసికొంద
మింటింట గల జన మనఃపీఠివసించి,
కరుణింపు వాగ్దేవి! యని నుతింప!

(రాగము – సావేరి)

(గీతి) తండ్రి చనిపోయెనని పెద్దయన్న యెడలఁ
దోఁపఁజేయు తమ్మునెనరుదోచు పతికి
నతినొనర్చి చిలిపిమాయఁగళ తొలగఁ
జానకి స్మరించి, చిత్తమ్ము శర్మమందు.

తే. గీ. వనసుమ నిరీక్షణ నిమగ్న వందనీయ
లోకమాత కనులకు గూర్చుగద యింపు,
ఆది కవికోకిలగళమ్మునందు నింపె
నార్ద్ర మధురిమల్! రాము నిల్లాలు సీత!

[పాట – ౧]

నతిసేయు మనమిది మంగళసుందర
రూపిణి తరుణినిగాంచి ॥ ప ॥

ఇంద్రాణి నవఘుళింపగజాలు
నిర్మలసౌందర్య నిధినిగాంచ ॥ అనుప ॥

అడుగుపెట్టినచోట నలరులలర నలరించు
తనమృదు పదగతి ధారుణి పులకించు
కొండలకు కోనవాగులకు గుంభ్రదన, వంకర
నేర్పి సృష్టికి బరసీమ యనిపించు
రూపిణి తరుణినిగాంచి ॥ నతి ॥

దృశ్యమూలముల పూటుపడియున్న
పరమానందము తొణుకులాడగ జేసి
ఉనికితీరున, రాకపోకల వెలుగు
వాకలత్రోవల ముదము చిమ్మ
రూపిణి తర [illegible] గాంచి ॥ నతి ॥

వెనుకటి వీరపురుషుల వెదకిచూచిన
ఎవరు నిలువగలరీమె ముందున ?
పెనిమిటి తానె ఈమె కీడగు
నేమొ యని సందియము మనమందు:
ఓ జోరూపిణి దరుణిని గాంచి ॥ నతి ॥

(మాట) ఆహా ! పురుషులిర్వురయందును
ధరనెందును చూడని యందచందములు !
ఈమె యొక్కతెయందు పురుషోత్తము రాము
ప్రీతి నెలకొనియుంట యబ్బురమ్ము.

(రాగము - తిలంగ్)

(పాత్రము) కొండ చఱియలోన గోదావరి పరుగు
లెత్త సుమాంజలు లిచ్చునీమె
ఎవరికోసరమొక్కొ యింత పులుకుపుల్కు
మనుచువెఱగున దారాడు నిపుడు ?

(పోవును)

సీత

[పాట - ౨]

అలపిల్ల చెలగాట కాశ్రయమ్ముగ వ్రేల
లాడు రవి ధరించు గోదావరీ
నీదు పొలపు సొలపుల గొండాడు నీ
తీవె తీవెల సుమాలు కుసుమలహరీ!
పుడిసిలి నీళ్ళిచ్చి బ్రతికింతు మమ్మ!
విపుల జలవాహినీ గోదావరీ!
నీ యతులసత్త్వము గొండాడి, తుదిముట్ట
దీ లోయలోయల చెంగలించు
వన్రదివన లహరి
నేనేడ నీవేడ! నీకు గోదావరీ!
ఇదె మనసు గుబాళించు సుమమంజరి!

(రాగం - హంసనాదం)

(వృత్తము) సీతాకోక చిలుకకు రంగులు నేర్పెడు పువ్వు
నేర్పి నేర్పి గుత్తులు గుత్తులు విడుచు,
పాటకంటెనూ, మౌనమె చవియగు,
మధుపము నాపునదే మొల్లయగు,
అదిగదిగో! పొదలోనే మది వెలుగు!
రత్నంపు మొలకవలె! చెన్నొందు చిగురువలె!

(మాట) ఓహో! మొగ్గకాదు, చిగురుకాదు హరిణమది!
అబ్బ! ఎంతటి చక్కదనము! మోహవెట్టు నిజము!
ఆర్యపుత్రా! ఆర్యపుత్రా! వేగరా! వేగరమ్మ.

[పాట - ౩]

రా వేగ! రా చూడు! రఘురామ! రమ్మ!
అదిగదిగో చూడు మెటువంటి హరిణమ్మ!
ముట్టిరా రవికిరణాల పట్టి
నుగ్గు.నూరార్చ

రంగు రంగుల మెరుగుల జిమ్ము
చున్నదీ హరిణమ్ము!
రా వేగ! రా చూడు! రఘురామ రమ్ము
అదిగదిగో చూడు మెటువంటి హరిణమ్ము!
పరిత్యక్తమో చెత్త(, ప్రాణాలపాలికి
బంగరుముద్ద చే(బడిసయట్లు
అందాల బరిణ, అచ్చెరువు తునక
అసదృశ సుందరమీ హరిణమ్ము
రా వేగ, రా వేగ, రా చూడు రఘురామ రమ్ము
అదిగదిగో చూడు మెటువంటిదీ హరిణమ్ము!
కానలు కోనలుద్యానవనముల గాచు
తానని స్నేహంపు చూపులామెతలిచ్చి,
మిసిమిబంగరుకల మేకొన జేసెడు
నీ హరిణమ్ము
రా వేగ, రా వేగ, రా చూడు, రఘురామ రమ్ము,
అదిగదిగో చూడు మెటువంటిదీ హరిణమ్ము!

(మాట) ఆర్యపుత్ర! ఆర్యపుత్రా! పరుగెత్తుకొని రా, రా, రా!

రాముడు

(మాట) ఆహా! చూడదగినదీ లేడిపిల్ల!

(పాట)

పోలె నప్పురస వనమృగాల నీయది
ఎటువంటి బంగరులేడి యిది
వలపు పూబోడి!
బంగార మ్మురంగారు లేడి!
బుజావైన దృశ్యాల భ్రమనుగల్పించెడు
నీ హరిణమ్ము
కొనిది ఈ వన ప్రాణాభరణమ్ము
అధిగో కనవచ్చు నెటువంటి హరిణమ్ము

ఈ గిరి కానన చేతనాభరణమ్ము
అదిగో కనవచ్చు నెటువంటి హరిణమ్ము
కదలి కెరటాలు వెలిజిమ్ము నీలంపు తళుకు!
హృదయరాగాలు చిందు వెళుకు!
మైపూత కనువైన గందంపు పలుకు!
గాలి కెరటాలపై కదలియాడు నాట్యంపు
గళలకాణాచి ఈ హరిణమ్ము
నిజమిది కానన జీవనాభరణమ్ము
అదిగో కనవచ్చు నెటువంటిదీ హరిణమ్ము!

**సీత**

(పాట)

అలల యంచులబట్టి పీచిన గాడ్పుల
కుద్యానమందొదిగిన సుడిగుండమె
ప్రియుడా!
ఉద్యానమందొదిగిన సుడిగుండమె
ప్రియుడా!
మన కుటీరమున కింతకుమున్ను లేని వెసగు
తెచ్చిపెట్టు నీ హరిణమ్ము
పో పొమ్ము పట్టుకొని రఘురామ రమ్ము
అదిగదిగో। చూడు మెటువంటి
దీ హరిణమ్ము.

(మాట) ఈ జింకఁబట్టుటకు నీకు రాదా లక్ష్మణా?

**లక్ష్మణుడు**

[పాట – ౪]

నిజమెంత తళుకైన దీ జింక
చూడఁజూడ కలుగుచున్న దెదలోన నెదో శంక
నిజమెంత తళుకైన దీ జింక!

మనుజుల భీతియె గనరాక పెరిగిన
మృగమువలె నున్నదిదియు,
అడవి మర్యాదల నతిక్రమించి నడచు
మాయామృగ మీ జింక,
చూడఁజూడ కలుగుచున్న దెదలోన నేదో శంక
ఓహో! ఎన్ని తళుకులొలుకు నీ జింక!

సీత

విడిచిపోయేముందు వనదేవి మనకిచ్చు
కానుకవోలె నిదియుగలదు జింక,
ఇందు మనకేమిశంక?
తల్లులకయ్యెడు తొందర తొలగగ
పొమ్ము రఘురామ పొమ్ము,
సిమురుపాటును గోరి నిలిచె నీ హరిణమ్ము
అదిగదిగో చూడు మేటువంటి దీ హరిణమ్ము!

రాముడు

కానకు నగరంపు గమగమల్ గొనివచ్చు
లేడియందు చిక్కె మనము
చేటిక్కుదాక
లేడిబడియేగు మనము?
విల్లంబులదెమ్ము పోయెద తమ్ముడ,
దీని బట్టిగా పోనిమ్ము వనికి
ఎన్నడు గలగద ఈమెకు కోరిక
చెల్లనీ సీత యుల్లాసమిపుడు,
అదిగదిగో కనవచ్చు! నెటువంటి
హరిణమ్ము
పర్వమ్మునకువోలె పరమాలంకృతమ్ము
వనహరిణమ్ము
అదిగదిగో కనవచ్చు నెటువంటి
హరిణమ్ము!

లక్ష్మణుడు

[పాట – ౪]

యోచింపు యోచింపుమన్నా!
　　దీనినిఁబట్టపోవు మున్న!　॥ ప ॥
జింక కేల ఇట్టి మైపొలపులు
మతిలేని మాట! శ్రుతిలేని పాట!
　　జింక కేలుండు మై పొలపులు
　　ఎల్లరకు గన్నెరలౌనటులు ?　॥ యోచింపు ॥
వేటను కోరునె – తానై
వేటను గోరునె తానై – ఎన్నడుగానీ
ఇది వలయుననిి పిలిచినట్లున్నది
చూడమిట్టి లేడి – మోసంపు
మాయామృగమని తలంతు　॥ యోచింపు ॥
　　శూర్పణఖాది మోహనరూపమనుకొందు,
　　పైఁ బచ్చికఁగప్పిన పెనుగూపమనుకొందు,
　　రక్కసి మాయలకు బుట్టినిల్లు వనము,
　　మృగము దీనిఁ దనదారి బొమ్మనుము　॥ యోచింపు ॥

సీత

(మాట)　ఆర్యపుత్ర! నిజముకావచ్చు మఱదిమాట,
కానమిట్టి జింక కలలోనగూడ,
నా యెడంద సహజశంకాకులమ్ము
దాని–అదిగదిగొ రామ–విడిచిపోనిమ్ము!

(పాట)

ఈ హరిణమ్ము
సింగారమ్ము జూచి, తీరనీ! మన కంటి ఋణమ్ము
కాదగు నీ మృగము జగదాభరణమ్ము
అదిగదిగొ, చూడు మెటువంటిదీ హరిణమ్ము

రాముడు

(మాట) నిజము నీవన్నది దేవి! సీత!
రాతిపైజెక్కిన రంగవల్లికలఁ గీష్వాఱవి,
ఎంత యందము నాచికొన్నది!
చూడజూడగా, నీలోనగూడ
దీనియందలి ప్రీతి మిక్కుటమైనది
ఇంచక్క మృగము వనవాస దుఃఖమ్ము
గడచి, మనతోడ నాడుకొనగ
ఎంచక్కగానుండు, సీత! నీ
కేలుకెందమ్మి నీర్గుడియుటలు!
రత్నమైన సంగ్రహింపదగు దీని ననుజ!
మోసగాడైన నిగ్రహింపనగు దనుజు
నెట్లు యోజసేసిన హరిణాభిసరణమ్ము
మేలనితోచు నిటు నాకు లక్ష్మణ!

[పాట - ౩]

దీని, జింకను నేను పట్టితెచ్చెద ॥ప॥
దానితో నాడనీవు మదినిమెచ్చెద ॥అను॥
బంగారు జుత్తును, రత్నంపు జుక్కలు
రంగారు పక్కలు చెంగారు జింకను
తెచ్చియిచ్చెద నేను: చంచల హరిణమ్ము
తేకుండ మరలువాడనా నేను! హరిణాక్షి ॥దీని॥
ఎన్నడుకోరని కోరిక నీయది
తులలేనిది లేడిపిల్ల కనుమిది
తెచ్చియిచ్చెద సాటిలేనిదిది
సందియమేలేద - అందంపు నా రాణీ
పూదోట నిర్మింతుబూన్కి నిచ్చోటనే ॥దీని॥
పట్టువడకయున్న బాణమ్ము నాకెద
బైటవడు దీని మర్మము,
తెచ్చెదను స్వర్ణచర్మము,

అది యమర్చిన పీఠమిత్తునీకు
సుఖసింహాసనముగ ॥దీని॥

(మాట) బహుళశ్రద్ధ వదినెఁగాపాడు మనుజ!
రక్కసులమోసమునబడనీక ధరణిజ

[ధనుష్టంకారము చేయుచు వెళ్లును]

లక్ష్మణుడు

(మాట) అన్న నీ యాజ్ఞ శిరసావహింతు నేను
ఇచ్ఛ నీయది యప్రతిహతముచూవె
పరిశమించెడుగాక పాపౌఘమెల్ల
పూర్తి గనుగాక మన పూర్వపురుష సుకృతి.

సీత

సౌమిత్రి! రక్కసతండమ్ము దున్మాడె
నగ్రజుండవలీల లేటిపిల్లనుబట్టఁ
బోవనేలొకో యింత కళవళమ్మిది నీకు ?

లక్ష్మణుడు

కీడు వచ్చుఁబోమ్ము కీడు రూపమ్మున
పరిహరింప దాని వలనుపడును;
లో నశివము పైకి రూపము శివముగ
దాల్పు దుష్కరమగు దానినడఁప.

సీత

మృగమిద్ది రక్కసమాయగాఁ దలపోసి
వ్యర్థచింతానిమగ్నుడవైతి లక్ష్మణ!
అచ్చెరువులకేమి యంతుండు వనభూమి
నదిగాక బేలవైతివొకో సల్లక్షణ!
ఎంతచక్కని దృశ్యమిదె పట్టఁబ్రియుడెంత
త్వరగామి, చూడుమీ హరిణాభిసరణమ్ము!

[పాట - ౬]

ఘనవిపినచల హరిణమ్ము
ఓయి మఱది చూడుమోయి!
ఘనకుఘనన ఝణకుఝనన,
చూడుమోయి మఱది!
నేలవిడిచి నింగినంటినడచు నడకతీరుల
ప్రాణాలనొడ్డి పరుగెత్తు
బంగారు మృగపు చెంగలింపుల
మదిదవులవేయుమో వీర!
ఝనకుఝనన ఘనకుఘనన
చూడుమోయి మఱది ॥ ఘన ॥

మెఱిసి పరుగెత్తు నిదె మృగమ్ము
ఎదుట శక్రచాపమ్ము వోలె
వేగాన విక్రమక్రమాన నిండెనెల్ల కొండ,
గిరులదరుల చులకనడుగుల పర్వెత్తు
చెల్లింపగోరుచు నాదుకోరిక
అలసటనెన్నక వనమృగము
పట్టుపనికి పూనుమో వీర!
ఘనకుఘనన ఝనకుఝన
చూడుమోయి మఱది ॥ ఘన ॥

తరుతరువున పులుగుపులుగు రొదలిడువేళ,
దడదడల నడుగునిడజాలక మృగమ్మరుచువేళ,
కొండనిప్పుకణము మోసితెచ్చెడు గాలినా
వేటకాడు నేర్పుమై లేడిఁబట్టునాటనా ॥ ఘనవిపిన ॥

కొండకొండకూ మకుటమై పుటపుట నెగురుచుండ
ఇదె దొరకెననిపించు, మించి పర్వెత్తు మించుతీవెలా
చిక్కబోయంచు చెయిఁజాప,
తప్పుకొని చెంగలించి చక్కబోవు

భీతిమెయి జింకపరువెత్తిపో, నడవిదానికి
మఱుగునిచ్చు ॥ ఘనవిపిన ॥

అరరె! తనయొడలె తనకువైరి – ఎంత వెఱ్ఱిదిది
తానుండుమఱుగు తనమై జిలుగులు బైటవెట్టి
బరులదృష్టి నాకర్షించు,
నల్లమబ్బులలోన తెలతెల్లగ వెలుగు చిన్ని
మెఱుగుతీగెలా,
పిగుచోటెల్ల నడవిచీకట్ల, వెలుగుదివ్వెల తరుమ
॥ ఘనవిపిన ॥

లక్ష్మణుడు

మాయయొ! మంచియొ! వనమృగమిది
–దానివెంట పోయెనతడు
వేగరియైననేమి దానివేగముబడి పోవువాడు
కొత్తకొత్త వెఱగులేల, ఏలతెత్తువు చుల్కన
రాఘవులకు
మింటినుండి సాయపడదె సురకిన్నర సమూహం
॥ ఘనవిపిన ॥

పృథ్వియెల్ల మథియించువాడో అన్న
లేటిగర్వమున
గ్రుచ్చి పడగొట్టడేల దీనివింటియంపవాదఱ?
అహాహా!
కాముని చేనుండి తొలికిలిపోవు నాశారేఖవలె
పరుగెత్తు నింత వింతలు! రాముచేఁజిక్కి
నట్లెచిక్కి చిక్కదును
ఘనవిపిన చలహరిణమ్ము చూడరాదె వదిన ॥

సీత

(మాట) లక్ష్మణ! ఇందనుక కనబడువీరు
గహనకాననసీమఁ గన్మఱగిపోయిరి!

కనుచాటుగాగ, మనమేలో కళపళించెదు,
లక్ష్మణ మాయపుచ్చెదుగద! మృగము
కీడెంచునో రామునకు ?

లక్ష్మణుడు

విడువిడుము వదినా !
మాయకానీ! మర్మముకానీ! అది;
ఇందుకె ఎదగుందుటయేల ?
దేవతలంగాచు వీరునికి
నెవరేమిసేతురు కీడు ?

సీత

నే నిందులకె కోరియుంటిని ఓన్న
తేరాదో మరిగాని !

లక్ష్మ : అది మాయగానిచో
కోరదగినదే వనమృగమ్ము వదినె ?

సీత : మాయమాటే నిజమైన! కీడువాటిల్లదా! ఈయనకు!

లక్ష్మణుడు

కీడెంచి రామునకు బ్రతికినవారెవరు
కీడెంచి కైకేయిగన్న సౌఖ్యము తెలియదో
తల్లియని యామె భరతుడు
మన్నించివిడిచె,
అగ్రజుని భావమెటిగియుండి;
కీడెంచి చెడె నా విరాధుడు
కీడెంచి బ్రతికిరె ఖరదూషణ త్రిశిరాదులు ?
చెట్టియా జింక గతిని మునదే
చింతింపనేల ?

[దూరమునుండి రామునికంఠ ధ్వనితో "హా సీతః హా లక్ష్మణః" అని కేక]

సీత

లక్ష్మణా!

లక్ష్మణుడు

ఏది గతి! స్పృహతప్పెను తల్లి!

సీత

(స్మృతికలిగి)

కీడాయె! కీడాయె! పో లక్ష్మణ పో!
వినలేదా రామునార్తస్వరం?
వేవేగ నడుము, లక్ష్మణా నడుము
ఏల మెదలక నిల్తువు?
అన్న ఈల్గుటనీకు సమ్మతమె సౌమిత్రి?

లక్ష్మణుడు

అన్నదికాదీ ధ్వని – మాయలేడిది వదినె
రాముడిట్లఱచునె – అతనికిట్టి దైన్యమె?
రక్కసుని మాయ అది – చానున్న మృగమఱచినదట్లు,
ఓర్చుకో తల్లి! తాల్మితెచ్చుకోవమ్మ!
గడియలోన రాముడేతెంచు.

సీత

ఇంకెక్కడి రామురాక – అతనిదే ఆ కేక!
అనుకరింప నెవరికౌను – నా పెనిమిటిదే ఆ ధ్వని
అయ్యో! క్రమ్మెనెటువంటి దుఃఖమ్ము
ధీరగంభీర మేఘనిస్వనము వినవె!
తండ్రి లక్ష్మణ! పొమ్ము పొమ్మతని సాయమునకు.

లక్ష్మణుడు

చెప్పెదనెన్నొసార్లు రామునకులేదు కీడని,
నమ్మకింతడలుచుండె వదినె,

సురనరోరగ యక్షరాక్షసుల నే దివిజునికైన,
అతని నోడింపరాదెందును,
రక్కసులవైరమీ మాయామృగముగ బాధించు మనల
బెదరకుమి, కల్యాణి! అతని రక్షకైగలదతని ధర్మమ్ము.

సీత

క్షుద్ర! చాలు నీ యుపదేశమ్ము
మృగముకాదు రాక్షసి, నీవె రక్కసుడవు
వనములో నా పతివిడువ ప్రాణమ్ము
మాయమాటలఁ జేయుచుంటివి కాలహరణమ్ము!

లక్ష్మణుడు

నీదు కావలికై రాముడుంచె నిచట నన్ను
నీ నుడులబడి కదలుదునె నేనతడు రాకమున్ను

సీత

దుష్ట! నా పట్టు నేలవిడుతువు నీవు!
ఇట్టివేళకనిపట్టి వచ్చితి వనమునకు,
అన్న మృతినంద నందవచ్చునన్నని,
ధూర్త! వంచక! కపటి!
నా యెదుటనిల్చి నీవేమైనసరియె
నేను నీకు సరియె?
రాముడువినా గడియయైన నుండనోప,
కొండపైనుండి దొరలుదునా! గోతిలో దుముకుదునా!
అంతెగాని, నీచే జిక్కుటొల్ల!

లక్ష్మణుడు

నారి! కడుజాణవు నీవు నయనిష్ఠురాల,
తండ్రియతడు, తల్లివీవని యెంచుదు నన్నయాన
దోషమ్ములేనిచోట దోషమ్ము వెదుకఁగీతు;

1 ధర్మము = ధర్మబుద్ధి, ధనుస్సు అనం.

రాముడు భద్రమూర్తి - నే తొలగించనిన
కీడు వాటిల్లు నీకు.

**సీత**

రాక్షస!
ఆ ధ్వని వినికూడ మంగళమనుచు పలుకుదువె?
ఏమనవచ్చు నిన్ను?
అన్న మృత్యువాతపడ, నాయెదుట చక్కంగ
కులుకుచుంటివి నీవు!
భ్రాతృప్రేమగలదె సవతిబిడ్డలయందు!
చెట్ట! మమ్ము వెన్నంటి వనికివచ్చుటలు
కపటబుద్ధితోడ!
ధూర్త! నా ప్రాణమది నా వశమ్ము; తెలియుమిద్ది
దానిఁ గైవసమొనర్చుకొను త్రాణగలదెనీకు!
అయ్యో! నాథ! కీడుమూడె నాకిపుడు
తొలగించనుము! కంటబడకుము! తొలగుతొలగు!

**లక్ష్మణుడు**

రామరామ! వినవచ్చె వినరాని నుడులు,
ఆడరానిమాటలాడితి వాడుదాన! హరహరతోడ!
కీడుతెచ్చితివెల్లరకు
ఇదిగో! బైల్వెడలి నిల్చితినేను నీముందు
ఓసి దైవమా! నీయిచ్చయిట్టిదె!
ఓ రవీ! అస్మత్కులపతీ!
నీ రక్షకీమె వదలుచుంటి,
మింటిదేవతా! మారుతా! సర్వభూతములార!
శిపసత్త్వములార! అప్పగించెదనీమె
మీ బాధ్యతకు!
నతిసేతు వదినెకుఁ, గదలితి నీ పలుకువెంబడి,
పొమ్ము! కుటిలోననుండుము! బైటికిరాకు
మేమైనగాని,

అన్నగూడి తిరిగివచ్చునందాక
ఉండవలెజుమి! నీవచ్చటనె!
(లక్ష్మణుడు వెళ్ళిపోవును)

సీత : (ఉద్విగ్నురాలై)
హా నాథ! హా ప్రియ! హా పురుషోత్తమ రాఘవా!
[అని నిట్టూర్చుచు, కుటీరాంతరమున ప్రవేశించును]
(కొంచెంసేపు విశ్రాంతి)

రావణుడు

[పాట – ౭]

బాపురె! బాపురె!
భయవిస్మయముల గొలిపెడి రాక్షసప్రత్యయము
అడవిలో నీ సరుల యార్భాటము పెల్లుగాగ
మాయమర్మముల నింపి మనమున
మితిమీరు నుత్కటరాగాన
హరము పట్టినట్లు, తొరతొరగ ప్రేరేచ
వికటనటనలో – వెనుకాడకుండ
దిటవుచూపెడు భటునికి – 'అక్కట' యనిపించు మనము
బాగు! బాగు!
ఈ నేల నెలవాయె రావణువాంఛలదు
బళిబళి! మారీచ నీకు నా మెప్పుగలదు
బాపాడినరీతి సెబాసన నడిచితివిదర్పముగ
ఇదిగిదిగో నాడునతి.
'హా సీత!' అనువాడాపో౽డని యెంచి
సంతసించితినెంతో! లోలోన నేను
అటుగాంతునేమి?
మడిసిన మారీచు శవము!
ఇదె భృత్యునకు నా చేతిమంటిబుఋణము!
కాన–నత నిగాని

మతని తమ్మునిగాని
ఇచటనే నాదు కోపానికి నిండకాపువెట్టైద
ఉండనీ! ఈ జగడంపువేల యంతైనగానీ!
అతని పడతిఁగొంతు మొదట నేను
అదిగదిగా! ఏమిత్తళుకులీనెడు నా గవాక్షము?
పడతి ఎంచక్కనిచుక్క!
కండ్ల నరగడియలోనె నింపి, నిలిపె నా కంటిరెప్పల
నేమిచేయుదు, నేమిచేయుదు గొంతుడస్సె
బాహువులు వెనకంజవేయు,
జారిపడు నా రక్కసత్వ మెటులదాతు
ఈ చెలి ప్రకాశింపజేయు లోవెలుగు
పట్టువాడనెట్లు?
తపస్సమాధిలో స్ఫురియించు తేజమ్మురీతి,
కానవచ్చు; నాదు చింతెల్ల దూరమాయె
నిండి పొంగులుదేరు నీమెదాక౯ె చింత!
దగ్గఱరాదీమె నేనీ రక్కసవేషమున
మునివోలె చేరువాడనేను
సాధుపర్ధితముగాదె సకలతోషము.
(కుటీరములోపల)

సీత

[పాట – ౧౮]

పాపభూయిష్ఠమైనది పాపిష్ఠమైనదీవాంఛ
రేకెత్తుభయము, నాలో! ॥ ప ॥
అడవిజింక మేనికాంతిఁ కాసపడి యిటువంటి
స్థితికి లోనైతి పతిఁ ప్రాణాలఁగావ ॥ అను॥
'హా సీత' అనుకేక భయముగొల్పుచున్నది
ప్రాణములజొచ్చి నా క్షేమమ్మె పారద్రోలె
త్రిప్పివైచెను భాగ్యరేఖ – నేను వేరైతి ॥ పాప ॥

ఆసఁజేసెద నగరసుఖముల నడవులలో
రాచనగరు పూదోటవేడ్కల నెమరువైతు
బిక్కుమను జింకయెడల కులుకునగవుల సొగసుకై
తల్లినెనరునఁజూచి సంభ్రమించెదను
పతి కస్తివడినచోటఁ జేరెనో మఱది
మితిమీరుకోపాన తరిమితిననిగుందు మనమిది,
అతి భీకరాకృతిఁబూను నీ వనమిది ॥ పాప ॥

రావణుడు

బెదురుచెమటలూరు నక్షత్రపూర్ణముఖివీవు
వెడదగనుగాంతుల నల్దెసలకుఁజిమ్ము దీవు
ఎవరు? నీ వెవరిదానవు? ఏ కతాన
వచ్చితీవనికి?
శనిగూడి మైత్రినెఱప చో తెలేదో వేరుకడ?
అడవిఁజొచ్చితివోసి భీరు! నీ వొంటరిగ,
ఎవరు నీవెవరిదానవు? ఏ కతాన
వచ్చితీవనికి?

సీత

(మాట) ఎవరది ఎవరది?
ఎవరు మీ రెవరన్నా! సాధువా! రక్కసుడవా?
కాషాయాంబరము గమండలువు
వ్రతములఁబండిన నిష్ఠను దెలుపు
మొగముకళ చూపఱ ప్రణమిల్లజేయు
కళలబిమ్ము, బడగట్టు, రాగిజడలు నీవి.

రావణుడు

దేవి! నేను భిక్షార్థిని
వేషమిది తెలుపదె వృత్తినాది
కష్టమెదొ గ్రసింప, క్షేమమ్ము తొలగి
నట్లు కనిపింతువీవు
తెలుపదగదొ కారణమేమొ తెలుపదగిన?

సీత

సాధుపురుష! వచ్చితి మంచియదనున,
దేవసముడవు నీ వతిథివి, చూడ సంతసమాయె
నిన్ను నాకు,
అదెపీఠ మధివసింపుము, అర్ఘ్యపాద్యములందిత్తు
తెచ్చియిత్తు పండ్లగుత్తులను
ఆకలిదప్పులణగారు విమ్మట
ఎరుగదగునాదు వృత్తమీవు.

(లోపలికిబోవును)

రావణుడు

(స్వగతము)

(రాగము - అసావేరి)

(వృత్తము) అహహా!
ఎటువంటిదీమె లావణ్యమున్మాదపఱచునిదె!
లేకున్నఁ గనికరింపదగునీమె
నింతలాకర్షించు కృశించియున్న యీామె
సుఖములనెంతగా జొక్కజేసెడు నీమె చెలువు!

(రాగము - గౌరీమనోహరి)

చెమ్మగిలు గుండెలవి; నీదు చెంపనుండి
జారి యీా మనమ్ము బిగియబట్టు తీవి
లాస్యమాడి, నడకలందమ్ము చిందజేయు
చారువక్షోజ వృత్తమునకవశమై
యుండనేర్చునె నేత్ర మీనమ్ము!

(రాగము - హమ్మీరకల్యాణి)

నేడు ఇర్వదియైన సుందరికంటి నొక్కసారి
సర్వము నొడ్డదగిన పాత్రమునుగంటి
సర్వ విభవములకు వెలగూర్చు వెలదిఁగంటి
ధశముఖములఁ గండ్లు గలిగిన సుఖముగంటి.

అందంపు గనివి!
చందంపు ధ్వనివి!
కంబుకంధరే!
శ్రోణీమంథరే! లంకా
ధీశ్వరీశ్వరివై వర్ధిల్లవె!
మహామాయ!
నీవు నన్నొల్లవే!

సీత

(మాట) రామరామ! ఏమిప్రల్లదమాడుచుండె
నీ బైసిమాలినవాడు!
అయ్యో! ఓరోరి భ్రష్టమునీ!
నీవు పాతాళమునకురుక! నీ యీ
పాపము నరకాన పడద్రొబ్బుగాక! నిన్ను

(పాట)

నిన్ను
మాయావి శాకిని
ఆవేశించె మిగుల
సుందరుడు
మన్మథ సుందరుడు
శర్వ బంధురుడు[1]
దశరథరాజ కుమారుడు నా పతియైయుండ
మాయావి,
నిన్ను
మాయావి
శాకిని ఆవేశించె మిగుల!
ఆవేశించె పిశాచిక!

రావణుడు

మోహినీ!
మమహృదయవాహినీ!

---

1 శర్వబంధురుడు = శివునకు హృద్యమైనవాడు అను.

విశ్వమోదినీ! నీవు
దశకంధరు సతియగుచో దశదిశల హర్షమగు!
శచిని తలదన్నెడు మండోదరికి
మిన్నవై చెన్నెసగుదు, మహామాయ! నీవు
నిను వలచితినే!

సీత

దుష్ట!
తొలగుమనిష్ట! అతినికృష్ట! నా
పతివరిష్ఠుడు, ఓయి
భ్రష్ట!
నీవలె కులకాంతల వంచించుచు
పరవనితల కాశించెడు కులపాంసనుల
తలపై కాలిడు, తాండవేశ్వర సమానుడా
పురుషుడు గలడునాకు, నిన్ను
మాయావిపిశాచి పూనెనయో!

రావణుడు

సుమంగలీ!
ఎదకడలిఁబొడిచిన నెలా!
నా పేరాసలకాదరువు నీ యంగాంగములు
సుమంగలీ! నీవు
సురరాజుగుండె లవియజేయు విక్రముడ
సరిలేని బలశాలి, నన్నేలియవు!
గడ్డిపోచకు సరిగాని నను
నగ్గింతు వాకసమునకు!
మహామాయ! నీవు
నాదానివే!
నన్నేలవే! సుమంగలీ!

సీత

ఓరి చోర!
నీవేపాటి వీరుడవు! – ధీర
ఖరదూషణ త్రిశిర సంహారుడు
రాజగంభీరుడు, సుందరుడు
నాదుపతి రానుండె,
మాయావి – ఉండు
మాయావి నిన్ను
శాకిని పట్టు మిగుల
ఓరి చోర!

రావణుడు

ధూర్తురాల!
చాలుచాలు మగని కూర్ములు – ఈ
దేవాసురమల్లుడా క్షుద్రుతో బెనగునె?
అందమ్ముగని మెత్తవడినంత, ధిక్కరించి
తెప్పింపకు గోపమ్ము
మహామాయ వీవు
నన్నేల్లవె
సుందరీ!
కామకల్పవల్లరీ!
పయోధరమంజరీ! నీవు
అరుణ గగనాన గుబుసమూడ్చి పల్లికిలించి,
తెల్లనిమంచు నాలుకల, నిప్పుకణాలు మాటలు చెరగి,
నా యెడద దహింతువో!
మహామాయ! నాకు
నా దానివైతివే!
నా యొడలిరాణివి
సుందరీ!

సీత

(మాట) అయ్యో! అయ్యో! వినలేను వినలేను!
చెట్టపీడు! వీని యందమ్ము చందమ్ము
మట్టిపాలుగానీ!
ఈ సిగ్గుమాలిన ఎగ్గరుల సొగసు
మట్టిపాలుగానీ!

రావణుడు

ప్రియురాల! ఈ రావణు కూర్మి
పొందవేలనే!
తే తెమ్ము! తే తెమ్ము! కరకమలమ్ము

సీత

మండింపు మండింపు మీ కాయమ్ము నగ్ని!
వచ్చునితడు నన్ను చెఱబట్టనిపుడు
కాల రాచెడువారు లేరె ఇతని!

రావణుడు

ఆహా హా హా హా!
ఇంద్రియ కేంద్రమ్మిది!
ప్రాణ నిధానమ్మిది!
హర్షజనిస్థానమ్మిది!
ఆహా హా హా హా!

సీత

పీనుగగుగాక నను బట్టవచ్చునితడు
నిష్క్రియుడగుత నిష్కరుణుడితడు
ఓయి రామ! ఓయోయి లక్ష్మణా!

రావణుడు

ఇర్వది బుజాలవాని తప్పించుకొనగలవె?
రా రమ్ము! ప్రియా!

సీత

ఓయి లక్ష్మణా! రామానుజ! రమ్ము కాపాడు
మాకుగా సుఖముపోనాడు ధర్మిష్ఠ! కాపాడు
కాపాడుడీ శివసత్త్వములార!
రక్షింపుడు! రక్షింపుడు! మృగములార! పక్షులార!

[గాలి రొద, మృగములయు, పక్షులయు అరపులు, ముసలిగద్ద విసరు రెక్కదెబ్బకు కూఁ కూఁ మను కీచుధ్వని – ఈ మధ్యలో అవ్యక్తమైన, అస్పష్టమైన గర్జనము]

జటాయువు

క్రూర రాక్షస! దుష్ట! నిలుమురోరి!

(తెర)

సూత్రధారుడు

క్రూర రాక్షస! దుష్ట నిలుమురోరి! అనెడు
రౌద్రవాక్యమ్ముతో నిలుపనిమ్ము రూపకమ్ము
సాధుజనుల హెచ్చరిక చాలు; చెడుగుల నిర్వారి
యని మెచ్చియుండు శివసత్త్వ సంజ్ఞాపకుండ.

పాత్రల పరిచయం:

పరశురాముడు

వటువులు

జమదగ్ని

రేణుక

దూత

కశ్యపుడు

# గండ్రగొడ్డలి

## మొదటి దృశ్యం

[జమదగ్ని యాశ్రమారణ్యంలో భార్గవుడు వీరాసనస్థితుడు. గండ్రగొడ్డలి పట్టుకొని పదునుపెట్టుతూ, నూఱడానికి తగిన పాట పలుకుతూవుంటాడు. రామునికి దగ్గిరగా వీరాసనాసీనులైన వటువులు కొందరు. రాముడు పలికే ప్రతి పలుకూ వటువులకు ఆనందదాయకంగా వుంటుంది. మేళం మొదలవగానే పైకి తెర లేస్తుంది.]

పరశు : నూరండి క్రూరమైన క్రాంతికుఠారం!
వటువులు : నూరండి! క్రూరమైన క్రాంతికుఠారం!
పరశు : కావాలి నేలమట్టం వైరివిహారం!
వటువులు : కావాలి నేలమట్టం వైరివిహారం!
పరశు : నవ్వాలు చిందుత మాశ్రమవదనం!
వటువులు : నవ్వాలుచిందుతమాశ్రమవదనం!
పరశు : తొలగాలి నేడే ఈ చిరదాస్యం!
వటువులు : తొలిగాలి నేడే ఈ చిరదాస్యం!
పరశు : ఈ మాహిష్మతి దమననీతి!
వటువులు : ఈ మాహిష్మతి దమననీతి!
పరశు : అర్జునునిలో మీరింది మితి
వటువులు : అర్జునునిలో మీరింది మితి
పరశు : నరజాతిప్రాణాలు కాపాడుదాం
వటువులు : నరజాతిప్రాణాలు కాపాడుదాం
పరశు : తేవాలి క్రాంతి లేక రావాలి చావు
వటువులు : తేవాలి క్రాంతి లేక రావాలి చావు
పరశు : కృతవీరుని కొడుకీరాజు

వటువులు : కృతవీరుని కొడుకీరాజు
పరశు : మన ఈ మాహిష్మతికే భారం
వటువులు : మన ఈ మాహిష్మతికే భారం
పరశు : దేశంపీడా తొలగిద్దాం
వటువులు : దేశంపీడా తొలగిద్దాం
పరశు : తేవాలి క్రాంతి లేక రావాలి చావు
వటువులు : తేవాలి క్రాంతి లేక రావాలి చావు
పరశు : చత్రూతిమీద పదునుపెట్టి నూరు; గొడ్డలి నూరు
వటువులు : చత్రూతిమీద పదునుపెట్టి నూరు; గొడ్డలి నూరు
పరశు : క్రాంతికై విక్రమించి నూరు! నూరు గొడ్డలి నూరు!
వటువులు : క్రాంతికై విక్రమించి నూరు! నూరు గొడ్డలి నూరు!
పరశు : దేశవీరులం మనమనిచెప్పి మరీ నూరు! గొడ్డలి నూరు!
వటువులు : దేశవీరులం మనమనిచెప్పి మరీ నూరు! గొడ్డలి నూరు!
పరశు : దేశంజెండా ఎగరాలి! నూరు గొడ్డలి నూరు!
వటువులు : దేశంజెండా ఎగరాలి! నూరు గొడ్డలి నూరు!
వ॥ఒకడు: భార్గవులు! ఎటుచూడ మీ క్రాంతినినాదం!
కారణమేమిటో?
పరశు : ఏమని అడిగెదో! నీవుండు నెలవెదో?
వటువులు : జమదగ్ని ఆశ్రమమదో!
పరశు : జమదగ్ని ఆశ్రమమా! నీవుండు నెలవు
కాదు కాదయా!
దాస్యం నెలవది. అది నీవుండేది
నీవేకాదు. మనమంతా వుండేదచటే
ఒకనాడు శశ్వత్స్వతంత్రభూమి – నేడు దాస్య
మరుభూమి!
ఇంత తెలిసి తెలిసీ! ఏలనడుగుతావు
క్రాంతి! క్రాంతి! ఎందుకంటావు
ఓ పక్షంరోజుల వెనుక
ఆశ్రమానికివచ్చె నా కార్తవీర్యుడు; వచ్చి

విడిచె, చూఱగొనె నతిథి మర్యాదలన్నీ
ఆశ్రమధేనువు, దివ్యసురధేనువు
గొట్టి తీసుకొనిపో యత్నించాడె, ఎరుగవో నీవు
మనమున్న ఈ నేల? ఇదె మాహిష్మతీక్ష్మాపు డేలునేల!
అట్టి ఏల్బడి, క్రాంతి ఏలందువా?
ఆశ్రమ కష్టసుఖము లట్టుంచుము
పట్టణం – కార్తవీర్యార్జునుని పట్టణం – తెలియునా?
దమననీతి కత్తిమొనకు ప్రజంతా గోడుమని
మొరలిడుతోంది

రెండుదినాలక్రిందట, మాహిష్మతిలో ఒక
ప్రేమికులజంట నిలిచింది, అర్జునుని భావమఱచి
నిలుచుండెనచ్చోట; చూచె నా యందగత్తెఁ
రాజుది రాజ్యమని, రాజు తనవాడని,
మదించి, సుందరి లోగొన యత్నించాడు,
వలపుగత్తె యార్తనాదం విని, వలపుకాడు తెచ్చిన
చేతి మచ్చుకత్తి – కినిసి మండిపడింది.
తానామె పెనిమిటి, తాను కాపాడవలెనని
మచ్చుకత్తినెత్తాడు పైకిః అర్జునుని స్యాలకునికి
రక్తాభిషేకం! యముసిపజ్జనిషేకం!

రాజిది తెలిసికొని మండిపడ్డాడు; మఱది మఱుగుపఱిచాడు,
వలపుగత్తె కూర్మికాని, పట్టితెచ్చి
వీపున మాటిమాటికి కశాఘాతంచేసి,
అతని సర్వస్వం గుంజి, కోశమందుంచి,
కళ్లు కుళ్లగించి, అయ్యో! నెట్టాడు బైటికి
ఇటువంటివెన్నెన్నో! లెక్కలేనన్ని!
స్మృతిదవుల నివియన్ని – వీళ్ళ పుట్టేర
మనసు చెంగలిస్తుంది – వేడిరక్తం నాడుల
చూసి చూసి, విసిగాయి ప్రాణాలు – ఓర్పులేమికమిద
అవధి అంటూ, అంతమంటూ గలదన్నిటికి,

క్రాంతి పిలిచెందువా? ఎందుకో ఉఱుకాయెనా?
నేటి అత్యాచారాలకు నెత్తురుడికిపోతోంది,
రక్తముడికిపోయి, నాడి పటపటలాడేను, వింటావా?
వేడి చెమ్మగిలి బొట్టులైకారు, ఎర్రని కొల్మిముందు
ఉబ్బిన పెనుకండల భుజబలంగల, కమ్మరి
హుమ్మనుతో, ఉచ్ఛ్వసిస్తోంది
ముందున్న ఇఱుగల్లుమీద,
సుత్తినెత్తి బలంగాకొట్టే పెట్లవోలె
ధుమధుమలాడుతూ పొంగులువారుతోంది
        ఉష్ణరక్త ధమని!
గట్టి బలమైన రాతిబండ
కొండతుది కొమ్మునుండి జారి
చెల్లాచెదరుగా పడిన
రాళ్ళను ప్రజ్వలింపించి
పొడిపొడిగానగుట తెగిరిపడేరీతి
ధణ ధణ ధంధణ ధంధణ, ఉష్ణరక్తధమని!
        పర్వతాగ్రసీమనుండి పడి
        శిలాఖండాల మధ్య,
        క్రింది నేలమీదకు కోపంతో
        నినదిస్తూ దొర్లిపడి, ఘోరున గర్జించే
        కందరశిలా ఖండాలలో బందిగా ప్రవహించే
అతిలంబమాన, పతయాళు జలపాత రీతి
ధణ ధణ, ధంధణ, ధంధణ పొంగువెట్టుతోంది,
        ఉష్ణరక్త ధమని!

[లోపలినుండి 'భార్గవ' అనే కేక మరోసారి]

వటువులు: భార్గవ! అదే! జమదగ్నుల కేక!
పరశు: పదండి పోదాం. విశదంగా వినబడుతోంది

(అని అంతా పోతారు)

## దృశ్యం — రెండు

[జమదగ్ని ఆశ్రమం. ముని జమదగ్ని ఎదుట రేణుక తల వంచి నిలబడింది. తప్పుచేసినదానివలె, దుఃఖితురాలై నిలబడింది. భార్గవుడు జమదగ్నిని సమీపించి నమస్కరిస్తాడు.]

పరశు: ఏమి ఆర్య! ఎందుకీ పిలుపు?
జమ: గండ్రగొడ్డలి గండ! పరశురామ! సరిగలదా గొడ్డలి మొన
పరశు: నూరాను నే డిప్పుడిప్పుడే
జమ: మంచిది! వధింపు మీమెను
పరశు: అమ్మ! (రేణుకకు కుడి ప్రక్కగా వంగి నమస్కరిస్తాడు)
రేణు: కంద! కమ్ము చిరంజీవి వోయి నీవు!
పరశు: అమ్మా! రమ్మా!

[రేణుక రాముణ్ణి అనుసరించును. వాళ్ళుపోయిన దారినిచూస్తే, గొడ్డలిపెట్టు తలమీద పడ్డ శబ్దమవుతుంది. కార్తావీర్యార్జునుని దూత ఒకడప్పుడు సరభసంగా వచ్చి జమదగ్నికి నమస్కరిస్తాడు. వెంటనే రాముడూ సమీపిస్తాడు. భార్గవునికి రక్తసేచనతో శరీర మంతా నిండిపోయింది. గొడ్డలిపై ఇంకా అరుణజలంగడ్డ కట్టు కొనే వుంది.]

దూత: కాపాడాలి, కాపాడాలి.
పరశు: (గొడ్డలి పైకెత్తి) కుక్కపిల్లా!
జమ: రామ! దించు గొడ్డలి. కార్య మేమైంది?
పరశు: పూర్తి అయింది.
జమ: మంచిది. సైరణ వహింపు – ఎవరన్న వీడు?
పరశు: ప్రజాపీడకుడు కార్తవీర్యుని దూత.
జమ: (దూత నుద్దేశించి) ఆశ్రమస్థలి కరుగుదెంచావు. ధైర్యమందు మీవు. అభయమిచ్చాను నేను.
దూత: మునివర్య! అర్జునుని గుప్తచరుడ నేను. ఆశ్రమనివాసినిని, అందమైన ఆడుదానిని. రాత్రింబగలూ కనిపట్టి వుండి, వార్త నందింపుమని రాజునాజ్ఞ నాకు.

జమ : రేణుక యేనా ఆమె! (దూత 'ఔ'నని తలయూప భార్గవుడు మండి పడుతాడు. మరోసారి పరశువు పైకి లేస్తుంది)

పరశు : నా తండ్రీ!

జమ : రామ! (అని అతనిని వారిస్తూ దూతతో) చూచితే జరుగు సందర్భం పో! పోయి తెలుపు మర్జునునికి.

(దూత వెళ్లుతాడు)

పితృవాక్య పరిపాలక! సౌభాగ్య సాధకము సైరణ! బల్లుడుకు బల్చెడుగు! రేణుకయు ముగియుటేలని తెలియ నాళింతువా?

పరశు : దత్తావధానుడ నేను.

జమ : పొద్దుపొడిచే వేళ
పూలు కోసే వేళ
రేణుక వెడలింది రేవునకు
ఆమె ధ్యాన నిమీలిత నేత్ర – అచట,
కన్దెఱచి చూసింది, నీళ్ళవైపు.
రాణివాసము గూడి, రాజు
కార్తవీర్యుడు సరస జలకేళి
లీలనాడుచు కండ్లబడె నంత
కార్తవీర్యుని గని జారింది మనసు
వేచి యున్నాడ చాల ప్రొద్దునుండి నేను
రేణుక మరలి వచ్చె నాశ్రమమునకు
వదనసీమ వాడువారి కంపించింది
దోషమునకు గలదు శిక్ష
శిక్ష చెప్పెద నిప్పుడె నేను.

పరశు : రేవునకు వచ్చెనే అర్జునుడు ?

జమ : ఔను. వచ్చెనర్జునుడు

పరశు : కార్త-వీర్యార్జునుడు

జమ : కార్త వీర్యార్జునుడె!

పరశు : మాహిష్మతీక్ష్మాపుడు కార్త వీర్యార్జునుడు

జమ : మాహిష్మతీక్ష్మాపుడు కార్త వీర్యార్జునుడు

పరశు : పక్షం క్రిందట స్వర్గధేనువుకై
యత్నించినవాడు ?

జమ : ఔను ! వాడే అర్జునుడు.

పరశు : ప్రజాపీడకుడు — కార్తవీర్యుడు ?

జమ : కార్తవీర్యుడు

పరశు : అమ్మపై కన్ను వేసినవాడు ?

(జమదగ్ని తలయూచి ఔనను)

పరశు : ఆర్య ! అర్జునుడు.
ఆశ్రమమునకు రానేల ? పావనమైన రేవు
ఇది అంతఃపురోద్యానమా యేమి ?
ప్రజాపీడకుని పరపీడన హెచ్చినది
అణిగించవలె దాని.

జమ : మనది కాదు రేవు మాహిష్మతి రేవు
అతనిది మాహిష్మతి అతనిది ఆశ్రమం
పాల మునిగెడివాడతండు
నీళ్ళ మునిగెడివాడతండు
వినలేదో భార్గవ ! 'నా విష్ణుః పృధ్వీపతిః'

పరశు : రాజుది కాదు రాజ్యం
దేవునిదీ సమస్త రాజ్యం
దేవు నెదుట భూపులు గీపులు నొకటే !
మనవలెనే ఇతడొకడు — కార్తవీర్యార్జునుడు
దొర అనే పేరు తగిలించుకొన్నంత,
స్వైరవృత్తి వహించి, కులకవలెనా !
మన ఇంట స్వతంత్రత మనకెలేదా !
ఈ దాస్యమందుండి మనకు లేదా
ఉద్ధారమనేది ? ఉదారహృదయ !
ఇల్లు వాకిలి, చుట్టాలపక్కాల
వీనివెడదనుండి, వీరి తప్పింప

సైరణ చాలదు — పాచిపట్టిన యీ
పరశు వొకడె పరమాధారం!

[అని గొడ్డలిపై చేయి వుంచుతాడు]

జమ : దుడుకు వద్దు భార్గవా! దుందుడుకు వద్దు
అర్జునునకు గలదపార సేన!
మాహిష్మతికి కోట గలదు
కోటకుపై బురుజులుండు
సజ్జీకృత సైన్యుడు సార్వభౌముడు!
వాని నీవొక్క చేతిమీద
నెదురొడ్డి నిలుతువో భార్గవ!

పరశు : అభిమానం మనకేమీ లేదా?
మాహిష్మతి కోట, కోట బురుజులో లెక్కా!
ధాత్రి క్రుంగనీ, ధాతగుండె లవియనీ
మురహరుని బొడ్డు పొందామర పొక్కనీ!
గండ్రగొడ్డలి మొన రుచి వానికి తోపజేయనా!
చేత గండ్రగొడ్డలి! సమరరంగాన నేను!
ప్రళయకాలా నలమగుదు! వేరుమాట లేదార్య!
క్రొన్నెత్తురు కాల్వలు గట్టి నేడు ముంచెత్తదో!
శిలలు ద్రవించి యేడ్చెడిని — సీమకు కళ్లెడు చేటు చూచి
నా యెద రేగెడు ఝంఝువు చూచితిరా?
మృదులకేశ పాశము గూర్చి తూగుటుయ్యేల లూగమేలా?
పిగడియలో నెట పడునో? ఎవరాడువారు?
మాహిష్మతీ క్ష్మాపుడటంచి బొబ్బలు పెట్టనీ!
చివరి కొమ్మలనున్న గూళ్ళు చెదరగొట్టిన చాలు
దెబ్బకు పిల్లలవి క్రిందకు పడిపోవు రీతి
నుగ్గునుగ్గై నూరారుతై గజిబిజి యామాహిష్మతి;
గడగడవడంకి భూమిఁ గ్రుంగిపోవు మాహిష్మతి!
విల్లుగొడ్డలి పూను కేలకో! పేరుకు విల్కాడనో!
గండ్రగొడ్డలియు మాకు భుజశోభామాత్రమె?

చూడుమార్య! పశువులను, బలికి బలియై
పోరు, వేరు గతిలేక, రోసి వెన్దిరిగి
గుడ్డిధైర్యము పూని దున్న వేటకాని నెదుర్పదె?
హలాన్ని లాగే దుక్కిటెద్దు – సాధువులలో సాధువది
కోపం హెచ్చితే తన యజమానుని గూడా
కొమ్ముల క్రుమ్మి గగనానికి చిమ్మదా?
కొట్ట శక్తిగలడతండు మొట్ట శక్తిగలడతండు
ధర్మవు మనయందుండె, దైవబలముండె మనకు
దైవబలముంట గెలుపు సిద్ధము మనకు.

జమ : రామ! యుద్ధ మతి భీకరం.
చుట్టిముట్టు భీకర శరాసారం
భటులు మూల్గుతారు; సైన్యం దొరలుతుండ
శత్రు సైన్యం శూన్యమా
భీష్మమిది సంగ్రామం, సమర దేవతతో
సంగమ మొనర్చినట్టు లోసారి!
ఎటు చూచిన ఆమె విడిసియుండు
శక్తి యుండిన కూడ యుక్తినే చేబూని
రక్త బిందువుల చిందక గెలుపు చేబూను
వాడు, మాన్యుడై తనరారు

పరశు: దైవ మిచ్చిన దాని ననుభవించనేవలె
అయిన, మనుజుల న్యాయ పరంపర
సహింపజాలరు; నెత్తురోడికలు
గట్టుగాక! కట్టకుండు గాక!

జమ : ఔనౌను బిడ్డ! నేను – ముదుసలి – నేను
నాకె ఈ ప్రజాపీడన చూడ మనసు రోత,
మిమ్ము నడుగవలెనె? పాపి తెచ్చుకొన్న
పాశమున జిక్కి తానై చచ్చును
సైరింపు బిడ్డ! సైరింపు మిపుడు.

పరశు: సైరణ! సైరణ! ఎంతకాల మీ సైరణ!
వినుమార్య! అర్జునుని మన్నింతునిం కొక్కసారి!

అటుపైన మీ మాట 'టాటా డఢాణా' నాకు!
మనము రోసింది, మనము గాసివడింది
సైరణయు చెల్లిపోయింది!
స్వాతంత్ర్యమె మా ఊపిరి
ఊపిరి దీసే ఓపిక లేదు
చిన్ని మొక్కల మొదట వేన్నీళ్ళుపోతునా
ఊత్తనే! పరశుధారిని నేను! భృగువంశి నేను!

జమ : అది యటుండనీ! భార్గవ! మాట చెల్లించినావు!
నిన్ను మెచ్చాను నేను, వరమువేడు మేదైన!

పరశు : ఆర్య! దోషనిర్ముక్తురాలే మాత!

జమ : "పరమ పాతివ్రత్య భవ్యచరిత"!
పరశుధార తవిలి, పోయిందామె దోషం!

పరశు : అటులైన అప్ప! బ్రదికింపవలె నామె - దయజూపి

జమ : మంచి వర మడిగినావు! తథాస్తు క్రాంతినాథ! భీష్మము
నీ ప్రతిజ్ఞ. అపై నా ఆజ్ఞవినా, నీవతనిదాక వలదు సుమా!

పరశు : ఆజ్ఞ యిది శిరోధార్యం!

జమ : నీ కోరిక తీరున, ప్రాణమిత్తు
నామెకు, రా!

(ఇరువురు నిష్క్రమిస్తారు)

## దృశ్యం — మూడు

[జమదగ్ని ఆశ్రమవనం. భార్గవుడు భీషణ భ్రుకుటియు భుజ లగ్న పరశువునై దిక్కు లదర క్రుద్ధుడై వచ్చాడు]

పరశు : మట్టమధ్యాహ్నమేమి ప్రభంజనమ్ము కానౌను
ప్రళయమాగు వరకె మందానిలంపు జెలువు!
ప్రభంజనం వీచేది కొలదిసేపు మాత్రమె!
పగలెల్ల రవి కిరణవర్షమ్ము గురియు!
మధ్యాహ్నం మంటవేడి క్షణకాలం మాత్రమె!
జ్ఞానపథం మేలు కొరకు చెమటలోడ్చు రాదా

భూమినేలగలడు బొందినుసురుండు దాక!
దమన నీతి మధువు గ్రోలి మద మెత్తినాడు
పిత్తమ్ము నెత్తికెక్కి ఉన్మత్త గతిని
కళ్లుమూసికొని, నృత్యమొనరించు నాపిచ్చి, దమననీతితో
చేయిచేయి గలిపి,
ప్రజల బాగోగులెంచక క్రౌర్యమె వహించి
ఉన్మాదివలె తానుకూడ
చిందులేసెడు పుడమిరేడు
రెప్పవాలినయంతఁ గప్పువడిపోవు ధూళి!
ఎన్నిక కెక్కని ఏల్బడి
ఇలా భాగంలో కలిసిపోనీ!
ఎల్లరిని వదిలి, ఏ ఒక్కనినో,
ఏలికయని పైకెత్తి మెచ్చి
గద్దె నిల్పుట దెందులకొ?
శిష్టులను దుష్టులనుండి
కాచి రక్షింపనె గదా!
న్యాయాన్యాయముల తూచి తోపనెగదా!
సర్వసమభావమున నుర్విజనులఁ బాలింపనెగదా!
మితిమీరి, మైమరచి, మనసువచ్చినరీతి
తందనాలాడ గాదు!
దమననీతి యను కత్తి ఝుళిపించి
జనులహింసింపఁగానె గాదు!
అందోళనల నణపవలెనని గాదు
దేశస్థులతాడించి,
ఇడుములవ్వారివి జూచి
నేల యంచులుదాక, మత్తుడై
కహకహార్భటుల నవ్వి
పోయవలెనని గాదు
దేవుడనువాఁడు కలడు

శిక్ష చెప్పగ, న్యాయమీయగ
విధిని వ్రాసెడు వాడు,
దేవుఁ డొకఁడు గలఁడు
చెడుగు నూడ్చెడి
పిడుగునై,
ఇచటనేనుంటి, న్యాయమ్ము నెలకొల్ప!

[లోపలినుండి "భార్గవా! చేటు! చేటు!" అని కేకలు. భార్గవుడు నివ్వెఱపడతాడు]

ఏమిటేమిటిది కేక!
ఎవరీ ఆర్తురాలు!

[తిరిగి అదే కేక]

అమ్మ రేణుక గొంతు! అరయువాడ
నేమాయెనో! (గొడ్డలి పట్టుకొని ధ్వనివచ్చిన జాడ వెళతాడు)

## దృశ్యం – నాలుగు

[జమదగ్ని ఆశ్రమం. జమదగ్ని, శరీరంలో కత్తి నాటుకొని వుండగా పడివుంటాడు. రేణుక గోలపెట్టి రోదిస్తూ శవముపై పొరలాడి భార్గవుని పిలుస్తుండగా రాముడు వస్తాడు.]

రేణుక: భార్గవా! చేటు! చేటు!

పరశు: అమ్మా! ఏమైనది! అప్ప చనిపోయెనా!
ఎవరిదీ క్షురిక! ఎవరి కైయాట ఈ హత్య!

రేణు: కార్తవీ...

పరశు: కార్తవీర్యుఁడు! ఎటుచూడ నా కార్తవీర్యుడె!
ఎటనుండె నా పాపి?

రేణు: వినుము బిడ్డ! దూత వొక్కడు
నాదుహత్య తెలిపె నతనికి

అది విన్నంత వచ్చెనితుకు, సమాధి
మగ్ను, ముదలకించె, విదలించి,
మారు వలుకకుండ జమదగ్ని కూర్చుండ,
విచ్చుకత్తి గ్రుచ్చె; నాదు కేక విని
పాదిపోయె రాజునకు నా....

[ అని అక్కడే ఆగి తలవంచి దుఃఖిస్తుంది ]

పరశు: తెలిసింది తల్లి!
మదగజము మూలముట్టుగ విరిగిపడుట
కిది చివరి కొయ్యసుమా!
ముగిసె నతని గాథ. సైరణకు సమాధి నేడు!
తండ్రియాజ్ఞ పడయుటసాధ్యమాయె!
అయ్య ఆజ్ఞ అవతలకు నెట్టి వైతు
క్రాంతికాలానికిది కమ్మని తరుణం!
బ్రహ్మాండ కల్మష రాశి దగ్ధమగుగాక!
ఈదిన మిద్ది ప్రళయకాలసన్నిభం!
కలదు కండపుష్టి; కలదు గుండె నిబ్బరం
నాకు గల బలంపై గలదు పూర్తి నమ్మకం నాకు!
మనయెడల గలదు ధర్మం;
మన బుజాల గలదు బలం,
ఆయుధముల మణికిరీటమ్ము; క్రూరంపు మొనది
ఇట్టింతయు నొక్కకడకూడి గండ్రగొడ్డలి వున్నది తల్లి -
విలయకాల భవనమై నిలవాలి నేను!
కాలసర్పము తోకత్రొక్క నిలిచి లేచినది నేడు,
తాను తెచ్చిన మెడత్రాట, తనగొంతు కురివైతు నేను,
దుష్టపాలకునిపై నేడు పరశువెత్తెద నేను,
ఈ కృతవీర్య సుతునిట మొదటగా
నంత మొందించి దహన సంస్కారము నడిపి,
గండ్రగొడ్డలి గండడని భూమి గంపింప
భూచక్రమంత తిరిగి, ముయ్యేడు మార్లు

మూలముట్టుగ నిక్షత్ర మొనరించివైతు,

పిల్లపీచు మిగుల రాదెవరు క్షాత్రమున

వెళ్ళి వత్తును తల్లి! దీవించి నన్పంపు

క్రాంతి దీప్ర మిద్ది నిష్ఠుర కుఠారం!

నా ప్రాణ ప్రాణ మిద్ది దీని దీవింపుమమ్మ

[రేణుక పాదసీమ గొడ్డలినుంచి, దాని పక్కనే తానూ ఆమెకు నమస్కరిస్తాడు. ]

రేణుక : ధన్యాత్మ! భార్గవ!

నీదెపో దేశభక్తి!

వేయేల! మనకెల్ల స్వర్గ సుఖమ్ము

కలిగించునయ్య దేశవిముక్తి!

దుడుకు కైదువుచేగలాడ! దురము సాగించు

మైగలాడ!

అరిశిరముల చెండాడు

మృత్యువును ముద్దాడు;

పెనుగుట్టలై పెరుగనీ, అస్థిరాశి!

మ్రోత లెత్తుతు పాఱనీ! రక్త జలరాశి!

నాటిరీతుల నాణ్యమెరిగే,

మాటిమాటికి మాతృముక్తిని

జ్ఞప్తి కెలయిస్తూ,

ముందుకడుగువేయుము వీర!

పట్టు పట్టిన దాని,

ప్రజ్ఞతో నెఱవేర్పు వీర!

ఒడలి యందున, నొక్క బిందువైన

నెత్తురుండుదాక - నెమకువేయి

ఒడలినుండి యుసురు వెడలునందాక

నెమరువేయి - మన మందరము

తల్లి భూమికనుగుబిడ్డలమని!

తల్లి ముక్తికి తగవులాడవలెనని!

దైవబలము గలదు మనవెంట
ధర్మానికి పెనగులాడుచునుంట;
దైవబలము గలిగి యుంట
గెలుపు సిద్ధము మనకు;
తెలియుమిద్ది నిశ్చయముగ
అచలబుద్ధి కదన భూమి
కాలూని నిల్వు మీవు పుత్ర!
పట్టు పట్టిన దాని
ప్రజ్ఞతో నెరవేర్చు వీర!
ముక్తి సేనానివి, మాతృదేవి
జయమిచ్చె సాకుగాత నిన్ను!
జామదగ్నికి జై!
క్రాంతి కదనానికి జై
విప్లవానికి జై! జై!

[ అని ఆశీర్వదిస్తుంది ]

## దృశ్యం — ఐదు

[ఆశ్రమవనంలో - భార్గవుడు, భయదాకృతితో భుజాలపై క్రాంతికై ఎత్తిన గొడ్డలి.]

ప్రజాపీడక! నీ ఘోరముష్టి విడిపించి
జనపదమునస్మదాశ్రమమ్మును గాపాడవలెనేను
ఒకరిగోడు గొడవలేకయె నేనుంటి ఇన్నినాళ్లు!
పరశువెత్తెదనేను అరగడియమాత్రమే!
నీవు నా శాంతిఁబోనాడి చెర్లాడి,
జనజీవనామృతమునఁకాల కూటముగలిపి,
రక్తపాతమునకు నన్నొడఁగట్టజేసావు,
నీదుజీవితంపు వెలుగునార్పనడ్డగించు.
మాతంద్రిఁజంపి, చప్పరము నెత్తిపైకిలాగికొంటి!

ఎదియనిష్టమొ, హేయమో, అదే ప్రియమగు నాకు- నేడు,
తన ప్రేగైన తల్లిశిరముపై
పరశువుంచినవాడు,
కదనభూమి నెదిరిశిరము ఖండింపఁగా గలఁడు,
మాతృపావన రక్తముననోలలాడిమున్నె
-ఈనా పరశువు నెత్తురుచిఁ జూచెరాజ!
తల్లినెత్తుట కత్తి దోఁగుటయును,
కారణము విన్నాను — కాఁకుచవిఁగని విన్నాను
అప్పుడు, నా యనుభవాల నరకయాతనలలో
నరకజ్వాలాముఖంలో, సంకటసన్నిధిలో
మనసునఁగృత నిశ్చయుఁడనైతి
ముందుగా మునుముందుఁగా, పరశుధార
నీతలఁ దెగనరకి, ఎగురవైతునని,
ఘోర ప్రతిజ్ఞయిది — పవిత్రతరసన్నాహమది.
ఋణమిఁగ గాలహరణమ్ముచనదు,
కాలమాసన్నమై వొదిగి వచ్చినదిపుడు.
కావచ్చు రాజవీవు, కావచ్చుఁ బరమాత్మ
పనిచిన ప్రతినిధి వయిననేమాయెఁ
పరమాత్ముడెటనైన నినుబోలి,
యిట్టి కశ్మలమాడునో! జనులగొంతులఁ
గాల్మెట్టి పకాలున నవ్వి, పగలబడిపోవు
దుడుగాట నీయదిమెచ్చునో ?
ఎగిరిపడు మెగిరెగిరపడుమేమాయె!
పాపానికి మేరకలదోయి! పాపిష్ఠివాడ!
చేసినదానికి! జేటుగుడుప రానేవచ్చు
దేవునెదుట నిలిచి వినిపింప జీవిత నివేదిక
కార్త వీర్యార్జున — కట్టుమీ వయనమ్ము
తెగనలిగి, సన్నమాయెను,
జీవనసూత్రము నీది
భువినుండి నీకునేఁడెముక్తి!

రా పరశువా! రారమ్మ
నీవె నాభుజబలానివి! నీవెనా బలస్కంధం!
ఆశ్రమకు శగ్రాసాల సవరింతువీవు నేటిదనుక!
గడ్డగెనుసుల నరికి, చేసిఫలాపచయమ్ము,
రాశిపేర్చెదవీవు హోమేంధనాల!
వేరునేడు నీకార్యమే.
కొట్టియుంచిన చెట్టుచేమల జీవరసం
స్రవించుటలు చూసియున్నావు మున్ను నీవు;
దేశపీడాకరకరిప్రాణరస
మోడికలు గట్టి పారుట చూతుమా!
పోయినేడు! జనులనెత్తురు పీల్చివున్న
అధమర్ణుల పట్టితెచ్చి
ఋణము చెల్లింపఁ జూతుమా! రా పరశువా! రా రమ్మ!
పసితనమునుండి నేటిదనుక
కూడిమాడి తిరిగాము మనము!
మద్భుజాగ్రానఁ బ్రతిఫలప్రదమైన
బ్రదుకుబ్రతికావు నీవు!
ఇదివరకు ఏమిచేసామొ! లేదో!
లెక్క లేదు దానిదిపుడు.
నేడుచేయబోయేది – నిజమైనపని!
క్రాంతి కాలానికి కాంతులిచ్చేడు పని!
మనపాలిట యింతవరకు గలదు శాంతి!
నేటినుండి మనకు రాగలదు క్రాంతి
పవిత్ర క్రాంతి!

[తెరపడుతుంది]

## దృశ్యం — ఆరు

చాలాకాలం గడచిన తరువాత.

[అక్కడ, స్యమంతక పంచకం దగ్గిర, భార్గవుడు ఉద్దీప్తనేత్రుడూ, ముక్తకేశుడూనై ఒక్కొక్కసారి క్రిందికి చూస్తూ గర్జిస్తూ, నురుగులు గట్టి చిమచిమలాడు నెత్తుటిని పరశు చాలనమున విదిలింప, చింది మీదపడుతున్న రక్తబిందువులజూచి, రేగి మొదటివలెనే తిరిగి గర్జిస్తాడు]

ధరణి ఒరిగివచ్చిన మృత్యువునకు !
భార్గవుని క్రోధానలానికి !
పడగ విఱిగిన కాలసర్పపు దౌష్ట్యానికి
విప్లవవిజయానికి !
క్రాంతిఁజేపట్టి బలవంతాన తెచ్చిన
కల్యాణకూటానికి !
భార్గవుని స్వర్గధామానికి !
క్షాత్రహననానికి :

[ఇట్లు అతడు చెబుతూవుండగా కశ్యపుడు వస్తాడు]

కశ్య: భార్గవ ! చాలుచాలునీ ఘనకార్యం చాలుచాలు !
తండ్రి మృతికి వగచి, మండిపడ లేచి,
కారకుడైన కార్తవీర్యునొక నిగాక,
ఐతకు, క్షాత్రమంతటి ప్రక్షాళింప !
ఖండ పరశుధార యఖండమని ఋజువుచేసె
తవభుజా ధృతనిశతపరశువు ! ఆశ్రమప్రేమమ్మై
తవభుజాధృత నిశితపరశువు !
ఇప్పుడిటు పూర్ణతనందె నాపూనిక

నీ ఆగ్రహానికి దొరికినది కానిక
క్షాత్రకుల జలధినుండి చేదిపోసిననెత్రు
మడుగుల స్యమంతపంచకమిదెముందు.
ఇంతలు చేసియు నీ క్రోధమునకు శాంతి లేకున్నదా!
క్షాత్రమంతటినూడ్చుట గొప్పకాదు భార్గవ
ఇంతకంటె ముఖ్యం లోకరక్షసేయుటది
పాలనకు పాత్రుడు లభించుట మరియుముఖ్యము!
ఇదెల్ల మఱచి, పాడుకోపానమైమఱచి,
అరుణజలసరసి నోలలాడుటదెంత?
జ్ఞానివీవు భార్గవ! సకలమెఱుగుదీవు!

[రెప్పవాల్చకింతవరకు చూస్తూవుండి కాలు నేతులు కట్టుబట్టలు నెత్తురుముద్దలుగాగ - నెదుటనిలబడి, మాట్లాడునతడు. రాగివలె ఎఱ్ఱనైన కుడిచేతిగొడ్డలి నెత్తురు గ్రక్కెడు నాద్యంతములు లేక]

పరశు : మారణహోమమ్మె స్మరియించి,
ఇతరమెల్లను మరువలేదు తపస్వి!
గుర్తులేదాకా మీకు – నేనునేడుచేసినది.
పూస్కి పూర్ణత చెందె – తండ్రికి సంస్కారమ్మునడిపి,
సకలలోకమును ధారవోసితి సత్పాత్రులకు,
పూర్వదిగ్రాజ్యమును హోతృగణమునకు,
బ్రహ్మగారికి దక్షిణదిగ్రాజ్యమ్మలై!
పశ్చిమ మధ్వర్యువులకు
ఉద్గాతలకుత్తర దిగ్రాజ్యమ్ము!
ఉపద్రష్టలకు నార్యావర్తము!
మిగిలిన ధాత్రీ ఖండమంతయు నీకె! కశ్యప!
ఇంతకంటె వేరేమికలదు – ఆపైని
తపమాచరించు పనియెనాకు.
గతించినతండ్రి యాత్మశాంత్యర్థమై!
నాయొనరించిన దురితక్షయార్థమై!!

కశ్య : అయినగూడ భార్గవ!
నీవు నిలిపేదాక నెవరుగాని
మనసువెట్టరు లోకపాలనమున!

పరశు : అక్షేలనో!

కశ్య : భార్గవ క్రోధ పరశువులకు చుక్కలె రాలిపడు.

పరశు : అట్లనా? నా ప్రాణాల చెలికాడీ పరశువు!
ఏప్రొద్దుజనియించి తనువు పెంచానో!
ఆప్రొద్దునుండి ఎదగుండ దెపుడుదీని
సహవాసమున!
క్షత్రజాతికెదురెత్తాను దీని
లోకహితార్థమై!
మత్తునున్మత్తు, తొలగమొత్తాను
లోకహితార్థమై!

[అని పలుకుతూ గొడ్డలిని జలాశయంలో పారేస్తాడు]

కశ్య : భేష భార్గవ! భేష!
మరలివచ్చింది సైరణనీకడకు.
రోషమ్ము నింఢ మోసమ్ము : నాశంపునిసుగు క్రోధమ్ము
భార్గవ! దోషి యర్జునునితోడ ని
ర్దోష లెందరెందరో రాజులఁ జంపితి,
వందువలన; అలుక కలుగ
జేసిన వాడొకండె, కాని దున్మాడితి
చేత గొడ్డలియుంట, క్రోధమొక్కడెగాంచి,
భూ చక్రమెల్ల గాలించి తిరుగాడితి
వంతపోక, యిలా తలమెల్ల ఈవిగా
నిచ్చావు నీవె; ఇక నీకు నిటనెటగాని
నిలువ నీడెలేదు; తెలుసునా!

పరశు : కశ్యపా! నాకిట నిల్వ నీడేలేదు!

కశ్య : దానమిచ్చినవాడు తానె కుడువడు దాని,

పరశు : అటువంటైన నా కెడ మెచ్చుటనో ?

కశ్య : తపస్వికి
నెలవా కులగిరులందలి మహేంద్ర
మొక్కచోటు, శాశ్వత శాంతి
ప్రసాదించెడు భవ్యతలము.

పరశు : నేనట నడుగిడ నౌనె ?

కశ్య : తప్పదుమరి.
మిగులునేల నెల్ల దానమిచ్చావు కాదె!
నేడు ప్రొద్దుగ్రుంకక మున్నె పయనింపవలె.

పరశు : మాతృభూమిని వీడి ?

కశ్యప : దానమాడితిగాదె

పరశు : పుట్టినూరు తొలగి ?
దాన మిచ్చితి గాదె

పరశు . నేడొక్క సంజ ?

కశ్యప : మాట పోవును గాదె !

పరశు : నే డొక్క సంజ ?

కశ్య : చూడుమటు.
అర్కు డస్తమిస్తున్నాడు.
పశ్చిమాంగనోత్సంగాన తలదూర్చి

పరశు : ఇంకొక్క సంజ ?
కశ్యపా ! నేడొక్క సంజ ?

కశ్య : పొద్దులేదిక, అస్తమయమయ్యె

పరశు : అస్తమయమైంది ! ఐంది అస్తమయం !

[ అనుచు అడుగెత్తుచుండగా తెర పడుతుంది. ]

## పాత్రల పరిచయం:

శంభురాయలు — ఇంటి యజమాని

నీలకంఠరాయలు — యజమాని తండ్రి

గజాననుడు — యజమాని కొడుకు

కాసక్క — యజమాని పెళ్ళాం

# ఎత్తిన చేయి

[ ఒక పాతతరహా ఇంటిలో, వసారా నేలమీద, మధ్యగా గవ్వల పీట వుంది. అతుకులువేసి కుట్టిన పాత జంపకానా పఱచివుంది. దానిమీద ఒకటి రెండు విరిగిన బెంచీలున్నాయి, ఒకమూల ఒక బరువైన పాత నమూనా విశ్రాంతి కుర్చీ పడివుంది. కూచుంటే చాలు వొరిగిపోతూ వుంటుంది. మరో చివర అందమైన నగిషీ పనిచేసి, అద్దం అమర్చబడి వున్న పెద్ద టేబిలు. దాని ముందు చేతులున్న రెండు కుర్చీ లున్నాయి. టేబిలుమీద, గుడ్డ, పుస్తకాలు, సిరాబుడ్డీ మొదలైనవి చిందరవందరగా పడివున్నాయి — గోడమీద పాత కాలం బొమ్మ, కులదేవత అయిన అంబా భవాని ఛాయా చిత్రం కనబడుతోంది. ప్రత్యేకించి ఓ పక్క రవివర్మ చిత్రించిన సరస్వతి, మరోప్రక్క లక్ష్మి ఈ రెండు పెద్ద పటాల్ని వేలాడదీసారు. సరస్వతి బొమ్మంతా దుమ్ము గొట్టుకొని వుండడంతో, దగ్గిరకు వెళ్లితేనే గాని ఆనవాలు పట్టేటట్లు లేదు. లక్ష్మి చిత్రపటానికి పూలదండలు వేసి అప్పుడప్పుడు పూజా పురస్కారాలు చేస్తూరావడంవల్ల, చాలాభాగం, కొంత కొంతైనా కానవస్తోంది. రాత్రి తొమ్మిది గంటలు, చీకట్లు అంతటా వ్యాపించి వున్నాయి. కాసక్క చేతిలో చిమ్నీ దీపం పట్టుకొని వసారాలోకి వచ్చి తలవాకిటవద్ద నిలబడి పరకాయించి చూస్తోంది. ఎవరూ కానవచ్చినట్లు లేదు ]

కాసక్క : (కనుబొమలు ముడివైచి తనలో తాను) వీళ్ళ కేం దాడి వచ్చి పడ్డదో, ఇంత పొద్దు పోగొట్టడానికి, మూడుజాముల రాతిరి అయిపోనాది. ఇంకా రావడానికి తికానా కనబడలా (తిరిగిపోతూ) వచ్చే టప్పటికే రానీ. ఉన్నవోళ్ళకింత కూడు పెట్టేసా (నట్టింటి వాకిలి దాకా వచ్చి) ఏం గజా! ఇక్కడకురా (గజాననుడు కళ్ళు నలుపుకుంటూ రాగా) పో, తలవాకిలి వేసేసిరా, ఊఁ!

గజా: (మొహం చిట్లిస్తూ వొళ్ళు విఱిచి) కాసక్క! నిద్దరొస్తోంది మళ్ళీ.

కాసక్క: నోరుమూసికొనిపో. మీకు అన్నం వడ్డించా. తలుపు వేసేసిరా, ఖోంచేసి చక్కానిద్రపో అంట!

గజా: (మొహం విప్పారింది) వడ్డించా! (తిరిగి ఆలోచిస్తూ) శంబణ్ణ రాలేదే ఇంకా....

కాసక్క: ఆయన గొడవ నీ కెందుకు? వచ్చినప్పుడు వస్తాడు. ఆయన నొసటిరాత ఇది రోజూ వుండేదే. మీపని పూర్తి అయింది. ఊఁ. పో. (గజాననుడు వెళ్తాడు) అటూ ఇటూ పోకూడదు. ఆయన దగ్గిర కింతపోయి అన్ని సంగతులు మాట్లాడి చీకటి పడేలోపల ఇంటిలో వుండాలి అని తొంభై సార్లు చెప్పిపంపించా. తగలబడి మార్కెటికి పోయాడో ఏమో! నా దౌర్భాగ్యం, నేను అనుభవించాల్సిందే (నిట్టూర్పు పుచ్చుతుంది) [గజాననుడు తలుపువేసికొని, తిరిగి పరుగు నడకతో వస్తాడు] పద. మామయ్యగారు అక్కడ దేవుడి గట్టుమీద కునికిపాట్లు పడ్తున్నారోయేమో, ఆయనకూ నీకూ విస్తరి వేయి. మిగతా పిల్లలంతా సాయంకాలం కాకమునుపే ఖోంచేసి నిద్రకు పడ్డారు (గజాననుడు ఊబ్బి తబ్బిబ్బై పోతూ పిల్లాటుగా చిమ్నీమీద గాలి ఊదేటప్పటికి అది కాస్తా ఆరిపోతుంది, ఆర్పేసావా కొఱవి వెధవా! నా తలరాతరా! ఇటువంటి అపశకునాలు చూసి చూసి ప్రాణం విసుగెత్తి పోయింది. పో. నట్టింటిలో వున్న ఆ కొవ్వొత్తి దీపం తెచ్చిపెట్టు వసారాలో.

(లోపలికి వెళ్తుంది)

[గజాననుడు వత్తి దీపం తెచ్చిపెట్టే ఈ లోపల తలవాకిలి చప్పుడౌతుంది, 'శంబణ్ణ' వచ్చాడు అంటూ అతను పరుగెత్తి పోయి వాకిలి తీసేటప్పటికి, పాత పార్సీకోటు, తెల్ల రుమాలు, మొదలైన వేషంవున్న శంభురాయుడు లోపలికి వస్తాడు]

గజా: శంబన్నా! మరి నువ్వు లగూన వచ్చావు కాదేం? [శంభురాయుడు జవాబివ్వకుండా ముందు సాగేటప్పటికి] మళ్ళీ నువ్వు ఇంకా రాలేదని కాసక్క ఒకటే తిట్టిపోస్తోంది.

శంభు: నోరు మూసుకో అధిక ప్రసంగి! లోపలికి పద.

గజా: (సంతోషంతో) శంబణ్ణా! రేపు మాకు బడికి సెలవు.

శంభు: ఇంకా ఎందుకో సెలవు? అబద్ధాలాడుతున్నావు బడి తప్పించు కోడానికి!

గజా: కాదు; మరే! మా ఇంగ్లీషు బడి మొదట పెట్టినాయన, ఆ గడ్డం మాష్టారు ఇవ్వాళ సాయంకాలం చచ్చిపోయాడుట!

శంభు: అం! అల్లాగేం! నీకేం! సెలవు సంతోషమే సంతోషం! చదువూ లేదు సంధ్యాలేదు. పద లోపలికి.

[ గజాననుడు వెళ్ళిపోయాడు - మొహం వేలాడేసికొని అటూ ఇటూ తిరుగుతూ కోటుతోపాటు విశ్రాంతికుర్చీలో కూలబడి రుమాలు చేతిలోకి తీసుకొని కూచున్నాడు. ఓ క్షణం ఏమో ఆలో చిస్తున్నట్లు కుర్చీలో కూలబడే, చేయిపైకి చాచి *'రావుపాన్' అని ముసిముసి నవ్వులు నవ్వాడు ]

కాసక్క: (ప్రవేశించి) (ఆశ్చర్యంతో) ఏమిటది? ఎప్పుడు రావడం? వేళాపాళా - గమనం ఏమీ లేదా? (శంభురాయడు కాసక్క మొహం చూసి జవాబివ్వకుండా మెదలకుండా వుండిపోయాడు) ఇల్లా ఎందుకు కూలబడ్డావు కుర్చీలో, ఇసుకలో పడివుండే మొసలిలా! మాట్లాడడానికి నోరూ వాయీ ఏమీ లేదా? ఎందుకల్లా చెయ్యి పైకెత్తావు? ఇంత సేపు చేసావేం ఇంటికి రావడానికి?

శంభు: (లేచి కూచుని చెయ్యి లాగుకొని) ఎందుకంటే?.... పొద్దుపోయింది; నిజమే!

కాసక్క: ఏం పొద్దుపోయింది! అంతా తెలుసు. దిమ్మతిరిగి కాళ్లు బలపాలు కట్టేటట్లు తిరగడం - ఆ చా దుకాణంలో రేడియోనో 'పీడియో'నో దానిపాట వింటూ కూచోటం. ఇంతదాకా దారి చూసి చూసి మేం కృశించిపోతూ వుండడం!

శంభు: ఎందుకు చింతిస్తావు; భోంచేసి కమ్మంగా నిద్రపోతే సరిపోదూ!

*రావుపాన్ — తీర్మానం ప్యాసైంది. అను.

కాసక్క: ఏమైనా సరే అనాలిసింది అననే అంటాను లేండి. ఇహనైనా భోజనం చేయడానికి లేండి. ఇంకా ఎవరూ భోంచేసింది లేదు. ఆ కోటూ, ఉత్తరీయం ఇటు తెండి తీసి అవతల పెడతాను. మరిచిపోయి కొంపదీసి, ఎక్కడైనా, పెంటకుప్పమీద పారేస్తిరా అయినట్టే పని! (రెండూ తీయించి చేతిలోకి తీసుకుంటూ) నేను చెప్పిం దేమి చేసారు? చెప్పినట్లు ఆయన దగ్గరకు పోయినారా లేక అంతా మరచిపోయి కూచున్నారా?

శంభు: అట్లా ఎల్లా మరచిపోతాను పిచ్చిగాని? .... మొట్టమొదట ఆయన దగ్గిరికే పోయా.

కాసక్క: ఆయనంటే?

శంభు: మీ 'అప్ప' *స్నేహితుడు.....ఈ ఊరి ఛీఫ్ ఆఫీసరు.

కాసక్క: ఊం! తర్వాత ఏమైంది? మా 'అప్ప' ఇచ్చిన ఉత్తరం ఇచ్చారా ఆయనకు?

శంభు: ఇచ్చా....ఇచ్చిం తర్వాతనే ఆయన నన్ను కూచోమన్నాడు.

కాసక్క: ఇచ్చిం తర్వాత? ఆఁ?

శంభు: ఇచ్చింతర్వాతనంటే, ఆయన చదువుకున్న తర్వాత, మీ 'అప్ప' అల్లుణ్ణి అని తెలుసుకొన్న తర్వాత.

కాసక్క: (మొహం చిన్నపుచ్చుకొని) పసిపాటూ లేక ఇల్లుపట్టుకొనివున్న ముసలాడాయిరి! (రోదనధ్వనితో) మనకు విలువ ఎవరిస్తారు? మనల్ని అడిగేవాళ్లూ ఆనపట్టేవాళ్లూ ఎవరున్నారు?

శంభు: ఇల్లా ఎందుకు చేసావు? నీకు విలువ ఇస్తారు, మీ 'అప్ప'కు అల్లుణ్ణి గదా అని నాకు విలువిస్తారని చెప్పావు? తెలుసా?

కాసక్క: ఆపైనేమైంది? ఏమన్నారు?

శంభు: ఏమీలేదు. నాలుగు మంచి మాటలు చెప్పినట్లు చెప్పాడు. ఒక్కటంటే ఒక్కకప్పు చేదు చా (Black tea) ఇచ్చాడు. వచ్చేసే ముందన్నాడు మ్యునిసిపాలిటీలో గుమాస్తాపని ఏమీ లేదని, చెప్తూ వుంటేకూడా ప్రతి మెంబరు సిఫారసు జతపఱచి, తమ ఓటు బలంతో

* అప్ప — నాయన

కాగితాల కట్టలతో సహా రోజు తొంభై మంది అర్జీదార్లు వచ్చి వేపుకు తింటారనిన్నీ.

కాసక్క: అల్లా అన్నాడా? నేను చాలా చాలా ఆశ పెట్టుకొని కూచున్నా. 'అప్ప' నమ్మకంగా ఎంత చెప్పారు. మీరు నేరుగా నోరు తెరచికొని అడిగే ఉండరు. నీళ్లు నమలి ఉంటారు. నా కంతా తెలుసు. నోరు చచ్చిన మనిషివి. అంచేతనే మన తలరాత ఇంచక్కగా వుంది.

శంభు: (ఊర్పు విడిచి) ఇంకా ఎట్లా దేవురించి అశగాలి. చచ్చినచావు. "చెప్పు చెప్పు" అని అంటే, ఆ ప్రకారమే ఓ మాట అన్నా, పనికి మాలిన సుంకరి పాక *దగ్గిర గుమాస్తా పని అది. నెలకు పదిహేను రూపాయలు వస్తాయి, కావాలంటే చెప్పు అన్నాడు.

కాసక్క: ఇల్లా అన్నాడా అయన? దానికి మీ రేమన్నారు? ఒప్పు కొన్నారా లేవా?

శంభు: ఏమీ అనలేదు. ఆపడాన అల్లాగే వచ్చేసాను.

కాసక్క: అట్లా ఎందుకు వచ్చేసారు? అటువంటి చవీ, సారంలేని పనికి మాలిన పని ఎందుకు చెయ్యాలి అనే దురభిమానంతో గదూ! మీదంతా తెలిసిన సంగతే నాకు. చదివింది చూడబోతే నాలుగో తరగతి ఇంగిలిపీసు, గర్వం చూడబోతే కొండంత!

శంభు: (తలపట్టుకొని కూచుని) సరే. ఏమనాలో అంతా అనేసెయ్యి. అన్నమాట నిజమే. బ్రహ్మ లిఖితం తప్పేదెట్లా?

కాసక్క: సరిపోయింది. బ్రహ్మలిఖిత మనుకోవడం. బుర్ర గోక్కుంటూ కూచోడం. ఇదే మీరు రోజూ చేసేపని; కటాకెటీ, చురుకుతనం, అనేవి ఏమిటో తెలియనే తెలియవు మీకు. అవి వంట పట్టించుకోండి. పోనీండి. ఇహనైనా, ఏమైందో అయింది, రేపు తెల్లవారి లేస్తూనే పోయి 'ఊ' సరేనని చెప్పివచ్చి మరో పనిలో జొరబడండి. నెలకు వచ్చినంత రానీ.

శంభు: అంతేనంటావా?

---

* సుంకరిపాక - ఘట్టకుటి: Toll gate అని.

కాసక్క : అంతేలేదు; గింతేలేదు; 'ఊ సరే' అనంది ఇప్పుడు నాముందు, మొదట.

శంభు : కాదే....గొప్ప కుటుంబం....జనం....ఏం....

కాసక్క : తగలబడి పోనీండి, జనాన్ని, జనం మాటనీ, మొదట 'ఊ' కొట్టం డిప్పుడు.

శంభు : (చటుక్కున చివాలుమని లేచి ఏమిటో ధ్యానిస్తూ చేయిఎత్తి) ఊం ! 'శరావు పాసు ! (పొంగివస్తూవున్న నవ్వు ఆపుకొంటాడు)

కాసక్క : ఇది బాగుంది ! 'శరావు' 'గిరావు' అని ఎందుకు అంటారు. ఇదే మైనా సభా, గిభా ? (బైలుదేరుతూ) రేపు పొద్దున్నే లేచి....అంతంత మాత్రమే జ్ఞాపకం ! .. ఊం ! లేండి ! భోజనానికి ! మామయ్యగారూ, 'గజా', దారి చూసిచూసి, విసిగిపోయారు. (లోపలికి పోతుంది) (శంభురాయడు లోపలికి పోవాలని అడుగుపెట్టే లోపల 'శంబు శంబు' అని అరుస్తూ నీలకంఠరాయడు లోపలినుంచి వట్టి వంటిమీద భోజనానికిగా మడిబట్ట కట్టుకొని, చేతిలో రుద్రాక్షమాల పట్టుకొని జపంచేస్తూ వస్తాడు.)

నీలకంఠ : శంబూ ! ఏమప్పా ! ఎంత పొద్దు రాత్రి అయింది....ఇంటికి వచ్చే టప్పటికి ? చిన్నపిల్లల్లా....ఇంకా చెప్పించుకోవాల్సిందేనా ?

శంభు : (మొహం కిందికి వంచి) లేదప్పా ! ఇవ్వాళే కొంచెం పొద్దు పోయింది.

నీలకంఠ : ఇవ్వాళేం ! ఆహా ! రోజూ ఇంతే ! ఎక్కడికైనా వెళ్లావో యేమో ?

శంభు : ఎక్కడికీ లేదప్పా ! మీరు నాకోసం దారులు చూడకుండా, పెద్దవారయినారు....భోజనం పెందలాడే చేసేస్తూవుంటే ...

నీలకంఠ : సరిపోయింది....బాగా చెబుతావప్పా ! మేం భోంచేయకుండా కూచుంటేనే, నువ్వు తొమ్మిదీ, పదీ కొట్టేటప్పటికి గాని రావు.... భోంచేసేస్తారులే అని....అల్లాగే ఊరుకొంటే....తెల్లవారుజామునగాని కొంప చేరవు....శివ శివశివ.

శంభు : అప్పా ! వొట్టు. ఇహమీద బైటికి పోయేదే లేదు చీకటిపడ్డ తర్వాత సరేనా ?

నీలకంఠ : అల్లా చెప్పు ... పెద్దవాళ్లమాట కాస్త వినప్పా....ఇంట్లో ఆకులు ఏసి కూచోడంగా వుంది. మన మెవరనుకున్నావు? వతన్‌దారులం. నౌకరీ చేసుకొనేవాళ్లలా, వాళ్ళింటి చుట్టూ వీళ్ళింటి చుట్టూ తిరిగి, చాయి తాగడం, గప్పాలు కొట్టుతూ వుండడం, పనికిరావు మనకి! ఎల్లాగుండాలంటావా : మన తాత ముత్తాతలు ఎల్లా సరదారులై .... వెనక స్వతంత్రంగా వుండి వున్నారో అట్లా ఎవరి మెహర్బానీ మన కక్కర్లేకుండా వుండాలప్పా! ఏమంటావు?....

శంభు : అల్లాగే నప్పా! నువ్వు చెప్పినట్లే చేస్తా. మీకు భోజనానికి పొద్దు పోయింది. కాళ్లూ చేతులూ కడుక్కొన్నారా?

నీలకంఠ : నువ్వు కడుక్కో. ఇక్కడికి రా. ఈ జంపకానా కొంచెం మడచు (వసారా చివరికి వచ్చి వెనక్కు నట్టింటివైపు చూసి) ఇటురా. ఇటు దగ్గిరసా. అన్నట్టు అదేమైంది ?

శంభు : ఏమిటప్పా! మీ నస్యమేనా....తెచ్చా జేబులో వుంది....

నీలకంఠ : అదేనయ్యా ...అమె, నీ పెళ్ళాం .... కాసీబాయి .... చెప్పిపంపించిందే అది.

శంభు : కూరగాయలేనా? రేపు పొద్దున్నే తాజాగా తెస్తాలే.

నీలకంఠ : చ్చుచ్చుచ్! నే నడిగేదోటి, నువ్వు చెప్పేదోటి! అదిరా! ఆ మునిసిపాలిటీ చీఫ్ ఆఫీసరు దగ్గిరకుపోయి – ఆ! ఔనా!

శంభు : అదా! అదేమీ కాలేదప్పా! ఆయన పని చూపించిందేమీ లేదు.

నీలకంఠ : అవునా మరి! నాకు తెలుసు – నేను చెప్పలా నీకు ఆ గర్వపోతు జనం దగ్గిరకు పోవద్దని. వాళ్లు ... ఉద్యోగం ఇచ్చేదున్నా మన ఇంటి హోదాకు తగదనిన్నీ.

శంభు : నువ్వు చెప్పినట్లే అయిందప్పా!

నీలకంఠ : ఔనామరి! ఎవరిస్తారప్పా ఈ రోజుల్లో నౌకరీ పిచ్చిగాని! తమ నౌకరీమీదే తమకు నమ్మకం లేనట్లుగా అఘోరిస్తారు – దానికే నేను చెప్పేది – పొలం, ఇల్లూ, చూసుకుంటూ వుండమని ... విశ్రాంతిగా కడుపులో చల్ల కదలకుండా వుండమని – చదివి, చదివి దుడ్డు పాడు చేసికొని – ఏమిటయ్యా అయ్యేది అంటే ... ఆహా....గొంతుక్కు గుది

బండ కట్టుకోడమంతే....అల్లాగైతే ఏమైనా ఎక్కడైనా సరే పని మాశే ఎత్తలేదన్నమాట ?

శంభు: పని సంగతి ఎత్తారప్పా!

నీలకంఠ : ఏం పని అది ? దాన్ని ఇప్పిస్తా అంటూరా ?

శంభు : మునిసిపాలిటి పన్నుపాక దగ్గిర గుమాస్తా పని – పదిహేను రూపాయల జీతం పనికి మాలింది – ఇప్పిస్తామంటారు.

నీలకంఠ : (కళ్లెర్రజేసి జపం చేయడం చాలించి) ఆ! మునిసిపాలిటి 'తోలు గేటు' గుమాస్తాలాంటి పనికిమాలిన పనికోసం నా పిల్లవాడా! నెలకు పదిహేను రూపాయల కోసం 'హమాలా' కావాలా ? జమీందారీ కుటుంబంవాళ్ళం మనం.

శంభు: 'హమాలా' కాదప్పా! తోలుగేటు....

నీలకంఠ ! అంతా తెలుసురప్పా! 'హమాలా' కాకపోతే దాని 'అప్ప' 'ఇంకోటి' పన్నుపాక దగ్గిర కూచోని, పెంటకుప్ప తోలే బండ్లవాళ్ళ తోటి వ్యవహారం. భోజనంలేదు. నిద్రలేదు, మనిషి అంటే విలువ లేదు. చూసాంతే. నీమామ, సిఫారసు బలం ? నీ పెళ్ళాం చేసిన పనికి ఫలితం....మరి నువ్వు దానికి 'ఊం' అని గంగిరెద్దులా మెడ తిప్పావో యేమో!

శంభు: లేదప్పా! ఏమీ చెప్పలా. మిమ్మల్ని అడిగి చెప్పవచ్చులే అని అల్లాగే వెనక్కు తిరిగి వచ్చా.

నీలకంఠ : దీనికే శంబు, నిన్ను సుపుత్రుడనాలి చూడు నిజంగా! .... ఆ చీపు ఆఫీసరు ఇంటిలో ఇంక – ఆ తెలిసిందా – కాలుపెట్టకు సుమా! ఆయన మోహం చూడకు – ఆ పన్నుపాక నౌకరి అంటే నరక సమానమే ననుకో – ఔనా మరి!

శంభు : అవునప్పా! అల్లాగే అనిపిస్తోంది.

నీలకంఠ : అనిపిస్తోం దేఖిటి ? అది అంతే మరి చూడిటూ (వంటింటివైపు చేయి చూపించి)ఆమె మాట విని 'ఊఁ' అని రేపుతెల్లవారే పోయి చెప్పివచ్చేవు కొంపదీసి! తెలిసిందా !

1. హమాలా — పోర్టరు.

శంభు : లేదప్పా! లేదు. చెప్పేదిలేదు. మీరు పెద్దవాళ్లు చెప్పిం తర్వాత నిలిపేసా ఆ ఆలోచన.

నీలకంఠ : అల్లా చెప్పు. ఇంకెక్కడా – నౌకరీ, చాకరీ – అంటూ వీధి కుక్క రొట్టె తుంపుల కోసం, వీధి వీధి తిరిగినట్లు తిరుగవుకదూ! ఔనామరి! అవునను!

శంభు : ఔనప్పా! ఔను.

నీలకంఠ : ఇటు చూడు. మనస్సులో గట్టిగా నిర్ణయం చేసేసికో. నీవు చాలా మొదటినుంచీ త్రిశంకు వంశస్థుడివి – ఊఁ!

శంభు : లేదు; నువ్వు చెప్పిందే ఖాయమప్పా!

[తెరలో "'అప్ప' కాసక్క పిలుస్తోంది కాళ్లు కడుక్కోమని' అని గజాననుని అరపు.]

నీలకంఠ : పద; ఇంక కాళ్ళు కడుక్కొని లగులగూన సంధ్యావందనం ముగించు.

శంభు : (లోపలికి పోతూ వెనకటి జ్ఞాపకంతో చేయెత్తి) సరే. శరావు పాసు! (లోపలికి వెళ్తాడు)

గజా : (ప్రవేశించి) తాతా! కాసక్క, భోజనానికి పిలుస్తోంది. అప్పనీ నిన్నూ.

నీలకంఠ : ఇదేవచ్చా. పద. మీ అప్ప ఇప్పుడే వెళ్ళాడు చూడు. ఒరేయి, గజా! పది కొట్టేటప్పటికి వచ్చాడు. రోజూ, ఎనిమిదికల్లా పడకమీద కనబడే వాడివి ఇవ్వాళ ఎందుకు లేచికూచున్నావు? పారి, గిరిజా, బాళక్క, పిల్లలందరూ కలలు కంటున్నారు – మరి నువ్వు ఇంకా నిద్రపోలేదేం?

గజా : (మరికొంచెం దగ్గిరకుపోయి) తాతా! మరి ఇవ్వాళ కురుక్షేత్ర నాటకం, పిలుచుకొని పోతావా?

నీలకంఠ : అహా! అందుకే లేచికూచున్నావన్నమాట కొంటవిదయ్యంలా! కురుక్షేత్రంట కురుక్షేత్రం! ఇంట్లో నడుస్తున్న కురుక్షేత్రం నీకేం తెలుసు! పిచ్చివాడా! భోంచేసి నిద్రపో నోరుమూసికొని.

గజా : లేదు తాతయ్యా! ఇదొక్కటే చివరిది చూస్తాను తాతయ్యా!

నీలకంఠ : మాబాగుంది. కంపెనీవాళ్ళ చివరి నాటకం అన్నా, నువ్వు చూసేది చివరినాటకం అన్నా, రెండూ నమ్మితే ఋవ్వతిన్నట్లే నేనేమీ వచ్చేది పెట్టేదీ లేదురా.

గజా : నే నొక్కణ్ణే పోవాలా ఏమన్నానా! మరి తాతా! పక్కింటి నారయ్య, శీనాయి వాళ్లూ వెళ్తున్నారు.

నీలకంఠ : అబ్బా! అంతా ప్లాను వేసావప్పా .... ఏం కావాలిసి వుందో! మీ నాయన్ను అడుగు నన్నెందుకడుగుతావు?

గజా : నాన్న నిన్నే అడుగమంటాడు తాతా!

నీలకంఠ : అల్లా అయితే నే నెవరిని అడుగమంటానో వింటావా? అడుగు మీ అమ్మ కాసక్కను. ఇప్పుడు ఈ ఇంట్లో వుండే ప్రతికాసు ఆవిడ దగ్గిరే వుండేది --

గజా : తాతా! నువ్వే కాసక్కకు చెప్పి....

నీలకంఠ : పోరా పిచ్చి వెధవ! చదువులేదు, సంధ్యలేదు. ప్రతిరోజూ సినిమా, నాటకం, జలసా రెండేళ్లుగా తప్పి కూచుంటున్నావు. సిగ్గు లేదు? మీ అయ్యలాగా మానేసి కూచుంటే సరి. పద పద. భోజనానికి. మీ 'అప్ప' ఈపాటికి సంధ్యావందనం ముగించి వుంటాడు. (ఇద్దరూ వెళ్తారు) (శంభురాయడు సంధ్యావందనం ముగించుకొని, వసారాలోని వత్తిదీపం లోపలికి తీసుకురావడానికి కాసక్కచేత అజ్ఞప్తుడై వస్తాడు. దీపం ఎత్తి తిరిగి అడుగులు పెట్టేలోపల, కాసక్క మెల్లిగా వసారాలోకి వచ్చి నిలుస్తుంది.)

శంభు : నేను దీపం తెస్తుంటినిగా. నువ్వెందు కింతలో వచ్చావు?

కాసక్క : (నవ్వుతూ) ఎందుకంటే? మీ రెక్కడ కిందికి దిగజారిపోయారో అని, పరుగెత్తుకుంటూ వచ్చా. దాన్ని అక్కడే పెట్టండి. (దగ్గిఱకు పిలిచి) ఇక్కడకు రండర్రా! కాదుగాని నేను లోపల మడికట్టుకొని వడ్డించడానికి పోయినప్పుడు ఇక్కడికి మామయ్యగారు అప్పుడే వచ్చారు కదూ!

శంభు : ఔను; వచ్చారు.

కాసక్క: వచ్చిం తర్వాత చాలా పొద్దు మాట్లాడుతూ నిలబడ్డారు. మరి ఏం ఉపదేశం చేసారో యేమో మీకు?

శంభు: ఉపదేశం, గిప్దేశం ఏమీ లేదు. ఎందుకు ఆలస్యం చేసావు? ఎక్కడకు వెళ్ళావు? అని అడిగారు.

కాసక్క: అట్లాగా! మీరేమి చెప్పారు? ఎక్కడకు వెళ్ళానని చెప్పారు? ఆ సంగతీ చెప్పారు ఔనామరి! నాకు తెలుసుగా!

శంభు: ఔను. అక్కడికి పోయివచ్చానని చెప్పానే.

కాసక్క: (తగ్గు స్థాయిలో) చెప్పా! చెప్పకుండా ఎందుకుంటారు? నౌకరీ ఇప్పించలేదనికూడా బైటపెట్టేసి వుంటారు. అవునా? నన్నూ మా 'అప్ప'నీ, అవమానపఱచడమే మీకు సంతోషంగా వుంటుంది!

శంభు: ఎంద కిట్లా పిచ్చిదానిలా మాట్లాడుతావు! అయిందేదో చెప్పాను.

కాసక్క! అవును. నేను పిచ్చిదాన్ని. మీరు మాంచి తెలివైనవారు. పన్ను పాకలోఉన్న ఖాళీ చెప్పారా మామయ్యగారికి? ఆయన దానికి కాదన్నారుకూడా! ఔనా మరి!

శంభు: తెలిపాను. ఔను (వెనక్కు జరుగుతూ) వద్దన్నారు.

కాసక్క: ఓహో! వద్దన్నారా? అనే వుంటారు. ఆయనకేం పట్టింది ఈ సంసారంచింత? 'నేను ఆ పని చేయడానికి ఒప్పుకొన్నా' అని మీరు ఘట్టిగా చెప్పి వుండాల్సింది, చెబితే మీదేమి పోతుంది?

శంభు: చెప్పా. అన్నింటితోబాటు కలిపి చెప్పా. అయినా 'అప్ప. వినలా ఆ టోలుగేటు నౌకరీ అంటే నరకంతో సమానం, అది వద్దనే వద్దు అని ఆయనంటాడు.

కాసక్క: ఇల్లా అన్నారా? నరకంతో సమానమని! మన మంటే ఆ నరకంలో పురుగులు లా అయ్యాము ఆయన పాలిటి! కానీ, కానీ! మీరు నే చెప్పినట్లు రేపేపోయి, చెబుతారా లేదా?

శంభు: చెబుతాగా! ఇల్లా ఎందుకు గొడవ చేస్తావు? 'ఆయన' ముందు నువ్వు మాటతీసుకురా. ఆయనకు తెలిసేటట్లు చెబుదాం// అక్కడినుంచి నేను

గజా : లేదు తాతయ్యా! ఇదొక్కటే చివరిది చూస్తాను తాతయ్యా!

నీలకంఠ : మాబాగుంది. కంపెనీవాళ్ల చివరి నాటకం అన్నా, నువ్వు చూసేది చివరినాటకం అన్నా, రెండూ నమ్మితే బువ్వతిన్నట్లే నేనేమీ వచ్చేది పెట్టేదీ లేదురా.

గజా : నే నొక్కణ్ణే పోవాలా ఏమన్నానా! మరి తాతా! పక్కింటి నారయ్య, శీనాయి వాళ్లూ వెళ్తున్నారు.

నీలకంఠ : అబ్బా! అంతా ప్లాను వేసావప్పా .... ఏం కావాలిసి వుందో! మీ నాయన్ను అడుగు నన్నెందుకడుగుతావు?

గజా : నాన్న నిన్నే అడుగమంటాడు తాతా!

నీలకంఠ : అల్లా అయితే నే నెవరిని అడుగమంటానో వింటావా? అడుగు మీ అమ్మ కాసక్కను. ఇప్పుడు ఈ ఇంట్లో వుండే ప్రతికాసు ఆవిడ దగ్గిరే వుండేది --

గజా : తాతా! నువ్వే కాసక్కకు చెప్పి....

నీలకంఠ : పోరా పిచ్చి వెధవ! చదువులేదు, సంధ్యలేదు. ప్రతిరోజూ సినీమా, నాటకం, జలసా రెండేళ్లుగా తప్పి కూచుంటున్నావు. సిగ్గు లేదు? మీ అయ్యలాగా మానేసి కూచుంటే సరి. పద పద. భోజనానికి. మీ 'అప్ప' ఈపాటికి సంధ్యావందనం ముగించి వుంటాడు. (ఇద్దరూ వెళ్తారు) (శంభురాయడు సంధ్యావందనం ముగించుకొని, వసారాలోని వత్తిదీపం లోపలికి తీసుకురావడానికి కాసక్కచేత ఆజ్ఞప్తుడై వస్తాడు. దీపం ఎత్తి తిరిగి అడుగులు పెట్టేలోపల, కాసక్క మెల్లిగా వసారాలోకి వచ్చి నిలుస్తుంది.)

శంభు : నేను దీపం తెస్తుంటినిగా. నువ్వెందు కింతలో వచ్చావు?

కాసక్క : (నవ్వుతూ) ఎందుకంటే? మీ రెక్కడ కిందికి దిగజారిపోయారో అని, పరుగెత్తుకుంటూ వచ్చా. దాన్ని అక్కడే పెట్టండి. (దగ్గిఱకు పిలిచి) ఇక్కడకు రండర్రా! కాదుగాని నేను లోపల మడికట్టుకొని వడ్డించడానికి పోయినప్పుడు ఇక్కడికి మామయ్యగారు అప్పుడే వచ్చారు కదూ!

శంభు : ఔను; వచ్చారు.

కాసక్క : ఇంకో సారి ! ఇంకో సారి ! సరిపోయింది. మీరు ఆయన్ను అడిగి ఆయన లాగానే సంసారం సాగించండి. నాదేముంది. ఈ ఇంట్లో! (ఏడుపు ఆవేశంతో) నేను పోతున్నా మా పుట్టింటికి. మీరంతా సుఖంగా వుండండి.

శంభు : అల్లా అనకూడదు. పెద్దదానివైనావు.

కాసక్క : అవును. పెద్దదాన్నయినా. ఇంటినిండా పిల్లా జెల్లా. ఒక్కళ్ల వంటిమీదకూడా ఏడాదికి ఏడాది, చొక్కాలేదు, కోటులేదు. పఱుపు లేదు తివాచీలేదు. మీరేమైనా గడించి మీ పిల్లలకు, నాకూ ఓ చిన్నెం బంగారంతో వస్తువు, నగ ఏమైనా చేయించిన పాపాన పోయారా? అంతా బైటనుంచి గుంజిన సొమ్మే! ఇల్లా ఇంకా ఎన్నాళ్లు ఈ సంసారం సాగించడాని కొతుంది? ఆయన ఒక్కరూ, సుఖవిశ్రాంతిగా వుండి అప్పుచేసి, పప్పుకూళ్ళతో నాశనమైనారు; అయనకు పుట్టిన మీరు చక్కగా చదువుకొనేది పోయి, రాబడి వస్తోందని, బోంచేసి, కాలక్షేపం చేసేసి, బాజీరావులా కూచుండిపోయారు. మీలాగ నే ఆ 'గజా' కూడా బడి ధ్యాసలేకుండా, సందులూ గొందులూ పట్టుకొని తిరుగుతూ వుంటాడు ఎప్పుడు చూసినా. తప్పి తగుదునమ్మా అని ఇంట్లో కూచుండిపోయాడు. ఆయనలా మీరు, మీలా మీ సుపుత్రుడు, వాడిలా వాడి సంతానం, మనుమలూ, మునిమనుమలూ! బాగుంది వంశపరంపర!

శంభు : అదంతా సరే. ఇటు విను. ఇప్పు డేమి చేయబోతున్నావు? రోజా ఈ నీ లెక్చరు విని విని నాకేమీ పాలుపోకుండా బుర్ర తిరిగిపోతోంది చెప్పొద్దూ! ఏం చేస్తావో చెప్పి మరీ చెయ్యి!

కాసక్క : ఏమంటేనా? ఎక్కడైనా సరే ఎటువంటిదైనా సరే, పని సంపాదించండి, లేదంటారా నా పుట్టింటికి నన్ను పంపించేసెయ్యండి.

శంభు : అట్లనా? సంపాయించేసానేపో! పద ఇంక రాత్రిపొద్దు పోయింది.

కాసక్క : ఊరికేనే ఉత్తుత్తమాట సంపాయించా నంటున్నారు. మళ్లీ మీదారి మీదే. రేపు తెల్లవారే పోయి ఆయనతో సరేనని చెప్పిరావాలి. 'సరే' నని నాకు ముందు మాట ఇవ్వండి.

శంభు : ఊం! పద (బైలుదేరుతూ చేయి పైకెత్తి) రరాప ..

కాసక్క : (ఆపి) అదేమిటి రోత! అల్లా అనకండి పుణ్యముంటుంది! కావలిస్తే ఆయన ముందర అనండి.

[ ఇద్దరూ రెండడుగులు వేసేలోపల నీలకంఠరాయ డక్కడికి వస్తారు ]

నీలకంఠ : ఏరా శంబూ! కాసీబాయి! ఎక్కడ మాయమయ్యారురా మీరు! (దగ్గిరకు వచ్చి) ఇక్కడ లేరా? ఇవ్వాళ్లేమిటి – రాత్రల్లా జాగర ణేనా ఏమిటి? ఏమిటోయి! మహా మంతనాలు నడుస్తున్నట్లున్నాయి!

కాసక్క : ఏముంది ఆలోచన? పసారాలోని దీపంబుడ్డి తీసుకురావడానికి వచ్చారు. తెచ్చేలోపల అది ఆరిపోతే నన్ను పిలిచారు. దానిలో నూనె అయిపోయింది. మళ్లీ పోసి వెలిగించేటప్పటికి ఆలస్యమైంది.

నీలకంఠ : అట్లనా? పదండి ముందు భోజనం ముగిద్దాం. ఆ 'గజా' గాడు ఒకటే కునికిపాట్లు పడి పడి అక్కడే విస్తరాకు మీదనే పడి నిద్ర పోయాడు.

కాసక్క : పడుకోనివ్వండి. ఏం పోయింది.. సాయంకాలం దాకా తినడం, జరుగుతూనే వుంటుంది. తెల్లవారగానే మళ్లీ మొదలు భక్షణకాండ! (లోపలికి వెళ్లుతుంది.)

నీలకంఠ : శంబూ! ఏం ఆలోచన చేస్తున్నావో! ఇంకా నీ నిర్ణయం ఏమీ తేలలేదా ఆ విషయంలో! (ఈమాట విని కాసక్క వెళ్లేది ఆగి పోతుంది)

శంభు : అయిందనే అనుకో 'అప్పా!' అపని....మరి .... కొన్నిరోజులు చేసిచూస్తే....ఎల్లా....ఎల్లా....

నీలకంఠ : ఓహో! మంత్రం పారింది! మళ్లీ ఆవిడ నీ బుర్రలోకి బాగా ఎక్కించినట్లుంది. ఔనామరి! తెలుసప్పా తెలుసు. నీకు సొంత బుద్ధి అనేది ఎక్కడనుంచి తెస్తాం? శంభు కాదు శుద్ధ 'శుంఠన్న' నువ్వు! కాదుగానికాసీబాయి, దీపంలో నూనెపోసిందో లేక యజమాని తలలోని జిడ్డు తీసేసిందో!

కాసక్క : (ముందుకు వచ్చి రోషంతో) అవును .... జిడ్డు .... పోయింది?

నీలకంఠ : ఇప్పు డెంత తెగబడ్డావు నువ్వు? మానం మర్యాద....?

కాసక్క : మానం మర్యాద అనుకుంటూ ఆడవాళ్ళ నోళ్లు కట్టి పడేసి తాము మాత్రం, చాలా మాన మర్యాదలతో నడుచుకుంటారు! నన్ను రాచి రంపాన పెట్టింది చాలు!

శంభు : (దగ్గిరకు పోయి) ఒసి! అల్లా నోరు విచ్చలవిడిగా పారెయ్యకు. నువ్వు చెప్పినట్లే అని చెప్పానా లేదా ?

నీలకంఠ : చూశావా! శంభూ! సంహో ఇచ్చిందిగా? ఏమైంది? ఇప్పుడు సమాధాన మియ్యాప్పా! ఒడ్డు చేరింతర్వాత తెప్ప తగలేసినట్లు! ఒక్కమాట చెప్పవయ్యా! తొరతొరగా – ఓహో! ఈ ఇంట్లో నీవు నీ 'అప్ప' చెప్పినట్లు వింటావో లేక పెళ్ళాం చెప్పినట్లు వింటావో! తేల్చుకో!

కాసక్క : ఔను. చెప్పితీరాలి. నాకూ ప్రాణం విసిగిపోయింది.

శంభు : (ఏ మీచెప్పకుండా తల కిందికి పెట్టి) అదెట్లా ... చెప్పేది .... ఇద్దరూ .... నాకు

నీలకంఠ : వద్దు ఇటువంటి అక్కచ్చన్న మాటలు–ఇద్దరూ నాకు కావాలి – ఇద్దరి మాటా వింటాను – అంటే తేలేదేమీ లేదు. ఇద్దరు చెప్పేదాన్ని విని చేయి పైకెత్తి గాడిదలా ప్రవర్తించకు.

శంభు : నాకేమీ తెలియడం లేదు – అంతా అయోమయంగా వుంది – అంచేత మీరే చెప్పండర్రా!

నీలకంఠ : నేనేమిటి చెప్పేది? పదేళ్ళైంది. చెప్పాకుంటూ వస్తున్నా - మళ్లీ ఇవ్వాళా చెప్పా. ఆ విధంగా నడుస్తావా?

శంభు : అల్లాగే కానీ! నువ్వు చెప్పినట్లే (చేయి పైకెత్తి చెప్పబోతాడు గట్టిగా)

కాసక్క : (మధ్యలో కల్పించుకొని) ఇదే ఖచ్చితమా ఔనా మరి! నేను వెళ్ళిపోతున్నా. మీరు మీరూ ఏం కావాలో చేసుకోండి. పాడు నూతిలో పడి చావండి.

శంభు : అల్లాకాదు. కొంచెం సంభాళించుకో! నువ్వు ఏమిటి చెబుతావు?

కాసక్క: చెప్పి చెప్పి నానాలుక చిల్లులుపడి పోయింది. వినేది లేదు అని ఢంకామీద దెబ్బకొట్టి చెప్పొచ్చు.

శంభు: అల్లా ఎందు కంటావు? ఇహమీద నువ్వు చెప్పినట్లే (చేయి పైకెత్తుతాడు)

నీలకంఠ: ఛూ! శంబణ్ణా! (పెడమొహం పెట్టి నుంచుంటాడు)

కాసక్క: సరిపోయింది (ఎత్తిన చేయి చూసి) ఇది ఎక్కడినుంచి నేర్చుకొన్నారు ఈ చేయెత్తడం? ఊరికే చెప్పడం చేతకాదా?

శంభు: చేయి పైకెత్తితే, ఇటు చూడు, నువ్వు చెప్పినట్లు చేస్తాను. 'ఠరావు పాసు' అని అన్నట్లు.

కాసక్క: ఎక్కడిదీ 'ఠరావ్ పాసు' ఈ పీడ ఎక్కడిది? ఎవరు నేర్పారు మీకు?

శంభు: అట్లా అడుగు. బావుంది. ఇవ్వాళ సాయంకాలం చీఫ్ ఆఫీసరును కలుసుకొని రోడ్డువెంట పడ్డా. అక్కడ దారిలో థియేటరులో ఏమో జనం సందడి, కనిపించింది. నాకూ ఎందుకో విసుగుగా వుండింది. లోపలికి వెళ్ళి కూచున్నా నేనూ.

కాసక్క: ఔనా మరి! నాకు తెలుసు ఇటువంటి అడ్డ దిడ్డం చోటుల్లో ఇంటి ధోరణి లేకుండా కూచోడం. అక్కడేముంది ఆ తీటరులో.

శంభు: ఏమో ఏకీకరణ సమ్మేళనం నడుస్తోందిట. అందులో ముఖ్యులైన నాయకులు మహాజోరుగా ఉపన్యాసాలిచ్చారు. చివరికి సభలో వాళ్ళచేత చేతులు పైకెత్తించి 'ఠరావు పాసు' అనిపించారు. అదెందుకో, ఏమిటో ఆ దేవుడికే తెలియాలి! నేనూ అల్లాగే మళ్ళీ మళ్ళీ చేసా. ఇంటికి వచ్చినమీద ఇంట్లోనూ అది ఉపయోగించబడుతోంది. అని చెబుతున్నా. అందుకే...

కాసక్క: తెలిసింది; ఇహ వుండండి. మీవంటి వాళ్లు చేరే ఆ 'ఠరావు పాసు, చేసారో యేమో! (దగ్గిరకు పిలిచి) ఇటురండి. ఇక మీద నేను చెప్పేది వినండి. ఇటువంటి సభా సమ్మేళనాలకు పోకండి. మరి రేపు తెల్లవారే పోయి ఆ పనికి సంబంధించిన ఆయనతో .

శంభు: ఊం! 'ఠరావు పాసు' (అని చెయ్యి పైకెత్తుతుంటే చెయ్యి పట్టుకొని, కిందికి గుంజి, కాసక్క నవ్వింది; నీలకంఠరాయుడు 'శివ శివ' అంటూ తలపై చేయి పెట్టికొని, నేలమీద చదికిల బడుతాడు)

(తెర పడుతుంది)

## పాత్రల పరిచయం :

| | | |
|---|---|---|
| సూత్రధారుడు | — | నాటకకారుడు |
| మిత్రులు | — | స్నేహితులు |
| దొర | — | దివాను |
| కొత్వాలు | — | గృహస్థు |
| సన్యాసి | — | ఇరువురు శిష్యులు |
| కూలి | — | పురనివాసులు |
| గవళ్లది | — | వేశ్య |

# చచ్చే ఆట

## విషాదాంతం

### నాంది

సూత్రధారుడు: (ప్రవేశించి)

చచ్చిన్నవారు కడదాక సుఖముగా నుండనీ
సుఖముగా చచ్చిన్నవారు కడదాక నుండనీ
కడదాక చచ్చిన్నవారుండనీ సుఖముగా
చచ్చిన్నవారు, చచ్చిన్నవారుండనీ సుఖముగా
చచ్చిన్నవారెన్నటికీ చావకుండనీ
యముడూ రుద్రుడూ చావకుండనీ
చచ్చిన్పవారు చావకుండనీ ॥౧॥

మృత్యు దేవతా ప్రార్థన ఈ మాత్రమేచాలు, ఈపాటి ప్రార్థనతో దేవుడు ప్రత్యక్షమే అయితే ఎటువం టెటువంటి మనుష్యులూ కూడా చావనే లేరు. దానికితోడు, నాటకంలో చచ్చేవాళ్ల పాటేమిటి? నిర్భయంగా ఈ ఆటను ఆడడానికెటువంటి అడ్డూ కానరావడంలేదు, సభ్యులారా! నేను మా ఆట ఆరంభంలో మీకు రెండు చేతులూ జోడించి విన్నపం చేసుకొనేదేమిటంటే – మా ఆట మృత్యుపరిణత మైన సంగీత నాటకం![1] దీనిపేరే చచ్చే ఆట (విహాదాంతం) మీవంటి చక్కగా చదువుకున్న పండితులు, ఇంగ్లీష భాషలో దేన్ని Tragedy Tragedy అంటూ ఉంటారో అదే ఇది, – చచ్చే ఆట నాటకం అంతం, నాయకుని అంతం ఎట్లాగైతే నేం, చివరికి అంతా చేరి మీవంటి వాళ్ళకానందం సంపాయించిపెడితే అంతే చాలు. ఇంతకు ముందే ప్రకటనపఱిచి వున్నట్లుగా ఈ నాటకంలో, మూడు శవాలు పడుతాయి, అంతలోనే మీరంతా సంతోషపడాల్సి ఉంటుంది. ఇదే

1. Melodrama —అను.

మా విన్నపం. ఈ ట్రాజిడీ ముందు నిజంచెబితే, షేక్స్పియరు ట్రాజిడీ కూడా దిగదుడుపే అయిపోయింది. మేము మా ఆట మేమే పొగడుకోడం ఏమంత యోగ్యమైన పనికాదు, మన పాతకాలపు సూత్రధార పద్ధతి ననుసరించి పొగడుకోడమే తప్ప కొత్తగా మా అంతట మేం చేస్తున్నదేమీలేదు. తప్పు – దోషం – ఏమైనా ఉంటే, మన ప్రాచీనుల తలపై మోపాల్సి ఉంటుంది. మేము అర్వాచీనులం. ఆ మర్యాదకు తగిన వాళ్ళంకాం అని మేమే ఒప్పేసుకుంటున్నాం.

[మిత్రుడు ప్రవేశిస్తాడు]

మిత్రుడు: ఏమప్పా! సూత్రధారుడివిగదా అని కాస్త అవకాశమిస్తే పొడుగు పొడుగ్గా మాటలు రానిస్తూ ఇక్కడే నిలబడి పొమ్మన మని అర్థం కాదయ్యా! చావాలిసిఉన్న 'దొంగ' పాత్రధారి ఓపదం మరీపాడి, ప్రాణాలు విడవాల్సివుండడంచేత, వచ్చిపడ్డాను. లోపలికి రా! ఆట ఆరంభంకావాలి మరి!

సూత్ర: నాటకంలో చచ్చేవాళ్ళకు కూడా ఎంతెంత ఆశ చూడండి! పదం పాడి చావాలి అనుకుంటున్నాము, వున్న కాస్త ప్రాణం పాట పాడడం శ్రమలో ఎగిరి చక్కాపోవచ్చు, మిత్రుడా! సూత్రధారుడు, ఇల్లా చెబుతున్నారని తెలియజేయి. చచ్చే సమయంలో మెదలకుండా ప్రాణాలు, వదిలివేయడం మాని, ప్రాణాయామంగా పాడి ప్రేక్షకులకు ప్రాణాలమీదికి తెచ్చి పెట్టడం, దొంగవంటి సత్పురుషుడికి కూడా తగదు బాబూ! ఇంతేగాకుండా, ఈ నాటకం పేరుకు తగినట్లుగా, మొదట్లోనే ఒక పాట పాడిపెట్టి వుంచాను. ఇప్పుడిప్పుడే విషాద సంగీతం పాడడమైంది. 'చచ్చే ఆట' ఆడడం మాత్రమే మిగిలివుంది.

[చెలికాడు వస్తాడు]

చెలికాడు: అప్పా! సూత్రధారుడా! దొంగ వాడి పెళ్లాం తానెప్పుడు విడవాలి అని అడుగుతోందయ్యా.

సూత్ర: చూసారా సభ్యులారా! ఇటువంటి పాత్రల్ని కట్టుకొని మేమేమి అఘోరించాలి? స్నేహితుడా! ఆదొంగవాడి పెళ్ళాన్ని అడుగు చూసేవాళ్ళంటూ లేకుండా తెర చాటున దొంగతనంగా ఏడ

ఏమిటి లాభమంటూ నలుగురి జనం ఎదుటా చచ్చినా పిడ్చినా, చక్కంగా వుంటుందిగాని.

మిత్రుడు: అయ్యో! ఉండనీ నడుఅప్పా! సూత్రధారుడే ఇంతపొద్దూ మాట్లాడుతూ వుంటే పాత్రధారులు ఎక్కడైనా 'చచ్చే ఆట'

చెలికాడు; దీన్నేగా మనం ఆడి చూపించాల్సి వుంది.

సూత్రధారుడు: అల్లాకాదు మనంచేసి చూపించాల్సిందేగాని, మాట్లాడి చూపించాల్సింది కాదు.

ఆడక చేయును రూఢిగా నుత్తముడు
అడిచేయును మధ్యముడు తాను
[1]నాటి చేసినవాడు 'సర్వజ్ఞుడు'
లాడముచేసినవాడు' నాటి చేసినవాడు.
[2]త్రాడుగట్టినవాడు
[3]ధారవోసినవాడు సర్వజ్ఞుడు.

అని అంటావా మిత్రుడా! నెచ్చెలీ! మీరు సూత్రధారుడు చెప్పినట్లు చేయవలసే వుంటుంది. ఎందుకంటే అతడే మరి సర్వజ్ఞుడు. అన్నట్లు మీరు ముందుపోయి ఆ దొంగని నోరు మూసికొని మరీచావమని చెప్పండి ఆ రండ ముండను ముందు ప్రక్కకు చూస్తూ ఏడ్వమని చెప్పండి, లేకపోతే మనగతి బాగా వుండేటట్లు లేదు. పొండి, నడవండి.

మిత్రుడు:
నెచ్చెలి: } చిత్తం.

[ఏడుపు ధ్వని]

సూత్ర: ఆహాహా! ఎటువంటి చిత్తాకర్షకమైన శోకమిది. దీన్నివిని నా స్థితి ఇల్లా అయింది; మీరు మిక్కిలి చూసిన మీదైతే మీ స్థితి ఏంకావాలిసి

1. నాటిచేసినవాడు - కర్షకుడు
2. త్రాడుగట్టినవాడు - గృహస్థు
3. ధారవోసినవాడు - కన్యాదాత
అవి విశేషార్థములు కావచ్చును —అను వాదకుడు.

వుంటుందో! కళ్ళనుండి కారే శోకరసం రుచికంటె రుచిగలపదార్థం వేరే ఏమైనా వుందా? దాన్ని పుచ్చుకున్నవాళ్లే తెలిసినవాళ్లు. అయిన ప్పటికీ పండితులైన ఓ ప్రేక్షకులారా! కాదు కాదు ప్రేక్షకులైన ఓ పండితుల్లారా, పెరవారి దఃఖమ్ము గాంచి నగకండి మీరు.

## ఒకటో దృశ్యం

(దొంగవాడు చచ్చిపడివుంటాడు. అతని పెళ్లాం ఏడుస్తూ వుంటుంది)

దొంగ భార్య: అయ్యో మహారాయా! ఎటువంటి చల్లటి వేళ చల్లబడి పోయావు! నువ్వు చచ్చిపోయినా ఎవరూ రావడంలేదు. నేనేడ్చి మొత్తుకున్నా ఎవరూ రాపడాని కిష్టపడటం లేదు. ఈ ఇంట్లో వాళ్లూ చచ్చినాళ్ళేనా? నాపాలికి ప్రపంచమంతా చచ్చిపోనాదే. నట్టడవిలో ఏడ్చేది దండగ అని పెద్దోళ్లు చెప్పేది అబద్దంగాదు. మనుసులు లేక పోయిన మంద ఇదీ అడివే, నలుగురు జనంవుంటే వినడానికంటూ ఏడ్చేవాళ్ళకే ఇంత మురిపెంగా వుంటుంది. ఉచ్చాగం లేకుండా, నా వంటి బలంలేని ఆడది ఎంత పొద్దని, ఏడుస్తుంది? అయ్యో! చావంటే అదో నిద్దిర అనే గదూ సెప్తారు. నువ్వు నిజంగా నిద్దిరే పోతుండా వేమో! మహారాయా! పొద్దు పొడవకముందే నన్నొంటిదాన్నిచేసి సచ్చిపోనావా! ఇంకో ఒకటి రెండు గడియలాగి సచ్చి వుంటే నీ దేం పానంపోతుంది? ...అయ్యో! సచ్చినోళ్ళ ముందేడ్చి మొత్తుకొంటే ఏందవుతుంది? ఇంక ఎవరిద్దైనా పొడకనిపించేదాక నోరుమూసికొని వుండడమే లెస్స (అటు ఇటూ చూసి) ఇదిగో, ఈ ఇంట్లో వాళ్లు ఎవరో పుణ్యావంతులు బైటికివస్తూ వున్నారు. వాళ్ళ చెవుల్లో మన శోకమింత పడనీ. (గొంతెత్తి ఏడుస్తుంది)

గృహస్థు: ఇదేమిటి నెత్తికి వచ్చిందప్పా! పొద్దున్నే! అపశకునం అవడం మూలాన ఏడుస్తోందేమో పాపం!

దొంగపెళ్లాం: అయ్యో! అయ్యో! నా మొగుణ్ణి పోగొట్టుకున్నా బాబూ! తండ్రీ! తిరిగి తెచ్చి ఇస్తావా?

గృహస్థు: ఏమమ్మా! అతడెక్కడికి పోయివున్నాడు.

దొంపెళ్ళాం : అప్పా! అదేమీ నాకు తెలియదు. ఈ ప్రపంచమే వదిలేసి పోయాడు. సగ్గానికే పోయాడో నరకానికే పోయాడో తెలియదు. ముత్తెంలాంటి పెనిమిటి మిత్తిపాలయ్యాడు బాబూ!

గృహస్థు : అయ్యో! పాపం! ఎట్టాగో చచ్చిపోతే మళ్లీ ఎట్లావస్తాడు? ఎన్ని రోజులైందేం ?

దొంగ పె : ఓనాతండ్రీ! దినం కాలేదు; గంటా కాలేదూ! పానం విడిచి ఓ రెండు గడియలౌతాది. ఇగో! ఈ మట్టి కుప్ప కింద సచ్చి పడి వున్నాడు.

గృహ : అల్లా ఎందుకైంది ?

దొంగ పె : ఓపని చేయబోతే మరో పనైంది. తన మెడలోనికిపోయే వేర గోడ తవ్వపోతే, మొత్తం గోడే మెడమీద వచ్చిపడ్డాది, లటుక్కన వచ్చిపడ్డ ఆ బరువు తట్టకోలేక పానాలు విడిచేసాడు.

గృహ : అంటే మరి దొంగతనం చేయడానికి వచ్చాడన్న మాట.

దొంగ పె : అదేలేండి. తన పనిమీద వచ్చాడు.

గృహ : అయితే వుండు; కొత్వాలుకు తెలియజేస్తాను (వెళ్లాడు)

దొంగ పె : ఆపాటి చేసి పున్నెం కట్టుకో అప్పా! అయ్యో! మహారాయా! నీ పనిలో మునిగి సచ్చిపోయిన నువ్వే ధన్యుడివి – నువ్వే ధన్యుడివి.

[ కొత్వాలూ చేతులు కట్టుకొన్న గృహస్థూ వస్తారు ]

గృహ : చూసారా న్యాయం? 'చేసినవాడి పాపం చెప్పినవాడి నెత్తిన'[1] అన్నట్లుంది. అచ్చంగా అల్లాగే అయింది. చెప్పడానికంటూ వస్తే నన్నే పట్టేసుకున్నారు.

కొత్వాలు : వినవయ్యా, ఈ అడకూతురు ఇక్కడకు వచ్చేలోగా, పారిపోయిందనుకో కాస్సేపు. ఆ తర్వాత మనం ఎవర్ని పట్టుకోడానికుంది? ఎవరప్పా నువ్వు ?

దొంగ పె : అన్యాయమైపోయ్ను అనాదను.

కొత్వాలు : ఏమైం దన్యాయం ?

1. 'దారిన పోయే శనేశ్వరమా మా ఇంటిదాకా రమ్మనమని' అన్నట్లు అనవసరం తెలుగు మర్యాద — అనువాదకుడు.

దొంగ పె : ఇదిగో, పెనిమిటి ఇక్కడ చచ్చిపడి వున్నాడు.

కొత్వాలు : అట్లు ఎట్లా ?

దొంగ పె : పొట్టమీది రంధితో కట్టపడుతూవుంటే ఈ పాడు గోడ మీదొచ్చి పడిపోనాది.

కొత్వాలు : అదేం పొట్టకైన పని ?

దొంగ పె : డబ్బున్న దొరలు దేన్ని దొంగతన మంటారో అది.

కొత్వాలు : అల్లాగా ? ఇప్పుడేమిటి నువ్వు చెప్పేది ?

దొంగ పె : పెనిమిటేమో చెయిపీడి వెళ్లిపోనాడు. ఇంక నాకు నాయం కావాలి. నాయం.

గృహస్థు : అవునులే దొంగావిడ ! ఎటువంటి న్యాయం కోరుతావు నువ్వు ? అన్యాయం ?

కొత్వాలు : ఏ రకం న్యాయం ?

దొంగ పె : ఈ ఇంట్లో వాళ్లెవరైనా నన్ను పెళ్ళైనా చేసుకోవాలి. లేకపోతే 'పానానికి పానం' అనే కట్టడిపకారం ఈ ఇంటి యజమాని పానమైనా తీసుకోవాలి.

కొత్వాలు : వహ్వా ! నిజంగా ఆలోచించాల్సిన మాటే ఇది. అల్లాగైతే ఏం చేయమంటావు ? ఓహో సుదైవమా ! రాత్రిళ్లు గుప్త వేషంతో నగర సంచారం తీర్చి సంస్థానాధీశులూ, దివానుగారూ ఇటే వస్తున్నారు (దొర, దివాను వస్తారు)

కొత్వాలు : (నమస్కరించి) దొరగారూ ! ఈ అనాధయై యున్న ఈమె పెనిమిటి తన దొంగతనం ఉద్యోగంలో పనిచేస్తూ వుండగా ఈ ఇంటివాళ్ల గోడ అతనిమీద పడి అతను ప్రాణాలు విడిచాడు. ఇప్పుడీ అడకూతురి విన్నప మేమిటంటే ఈ ఇంటిలో తనకు ఇంకో ప్రాణ పతియైనా దొరకాలి. లేకపోతే ప్రాణమైనా బదులు దొరకాలి.

దివాను : చాలా వివేకిగా కనబడుతోందే. ఆమె అడిగినట్లు చేయకుండా పోతే రాజ్యంలో న్యాయ మంతరించి పోయినట్లే – దొరగా రా విధంగా ఆజ్ఞాపించాలిసి వుంటుంది.

దొర : అల్లాగే కావాల్సి వుంటుంది. ఏ మప్పా మీరే మంటారు ?

గృహ : (స్వగతం) దొంగకు తగ్గ కొత్వాలు, కొత్వాలుకు తగిన దివాను దివానుకు తగిన దొర (ప్రకటంగా) దేవుశా – దొంగతనం చేయడానికి, వచ్చినందు కతని కేమీ శిక్షే లేదా ఏమి ?

దొర : ఎంత పిచ్చివాడివి నువ్వు! దొంగ కెప్పుడో దేహాంత శిక్ష జరిగే పోయింది. ఆమేమో అనాథ అయింది పాపం!

గృహ : అవడం మంచిపనే అయింది.

దొర : అదెట్లా ఒప్పుతుంది ? దొంగకు శిక్ష కలగడం, యోగ్యమే అయినా ఈమె పెనిమిటి ఖూనీ అవడం, అన్యాయం కదూ ? ఇతని ఖూనీకి కారణమై వున్న వాళ్లని, దండించడమే, ఉచితమైన న్యాయం.

గృహ : దొరగారూ ! ఏమి అజ్ఞ ?

దొర : ఇహనైనా వివేకంతో మసలుకొని శిక్షకు సిద్ధపడు.

గృహ : నేనే

దొర : నువ్వే ! నువ్వే ! ఎంత అమాయకు డితడు! నిన్ను తప్పించి, నేనుగాని మా దివానుగాని చావాలా ఏమి ?

గృహ : ఛీ ఛీ అంతమాటే ! నే నల్లా ఎందుకంటాను ? కానున్నది కానీ, మహాధురంధర పితామహుడైన ప్రతాపచాహూ మహారాజులుంగారి ఏల్బడి 'నభూతో నభవిష్యతి' అని పొగడ్త కెక్కుతూ వుంటే నేనా విధంగా ఎల్లా అనగలను ?

దొర : అల్లాగైతే చెప్పు. మంచి మాటలతో చెప్పు. ఈ బిహుగు-ప్రాణాన్ని (దొంగ - పెళ్లాంవైపు చూపుడు వ్రేలితో చూపి) పెళ్ళి చేసుకొంటావా మరి ?

గృహ : ఈ ప్రాణిని పెళ్లాడడానికి నేనేమైనా పశువునా ?

దివాను : అదేమిటో నీకే తెలియాలి. దొరల్ని ఆ విధంగా ప్రశ్నించరాదు. పెళ్ళిమీద కోరిక లేకపోతే – మరణ దండనకు సిద్ధపడవోయి!

గృహ ! దీన్ని పెళ్లి చేసుకోడం కంటె, నిజానికి చచ్చేదే మంచిపని. సరే కాని గోడ ఇతని చావుకు కారణమైతే వేమెదుకు చావాలో ? దేవర వారు అజ్ఞాపించాలి.

దొర : దివాన్జీ! ఇప్పుడు వ్యవహారం కొంచెం గడ్డుగా మారింది. వృధాగా బ్రహ్మహత్య అవుతోంది. నిజంగా ఈ గోడకు శిక్ష చెప్పాలి.

దివాను : నాకూ అదే సమంజసంగా తోస్తోంది ప్రభూ!

దొంగ పె: ధర్మరాజులుం గారి విధంగా, అన్యాయం జరపకూడదు. దేహమే చచ్చి జీవమే ఉండివుంటే మన్ను – దేహాన్ని చంపిన మన్ను – గోడకు శిక్ష చెప్పడం బాగుంటుంది. ఓ మంటికి బదులుగా ఇంకో మన్నన్న మాట. కాని దేహం మిగిలివుంది. ప్రాణంమాత్రమే ఎగిరిపోయింది. ఆ కారణంగా, ఆ ప్రాణానికి బదులుగా, మరో ప్రాణం పోయేటట్లు, దయాళువైన దొరలు అజ్ఞాపించాల్సి వుంటుంది.

దివాను : దొరవారూ! నిజానికిదే సమంజసంగా కనబడుతోంది; ఇదే న్యాయం.

దొర : దివాన్జీ! చాలాసేపు ఆలోచిస్తూ కూచుంటే ఏది న్యాయమో, ఏది అన్యాయమో తెలియకుండా పోతుంది. ఎల్లాగైనా ఓ న్యాయం నిర్ణయించిన మీదట, అది అన్యాయం ఎల్లా అవుతుంది? క్షుద్రమైన ఓ జీవానికై మనం ఇంత పొద్దు విచారణ సల్పి కాలక్షేపం చేస్తూవుంటే మన రాజ్యంలోని అసంఖ్యాకమైన జనానీకం గతి ఏమిటి?

గృహ : చరమగతే!

దొర : ఏమిటంటావు?

గృహ: తానుగా గోడను నెత్తిన వేసుకొంటే దానికి నేనేం చేస్తాను?

దొర : చావడానికి సిద్ధంకా. అటువంటి గోడ నెందులకు కట్టించావోయి!

దివాను : మరోమాట. ఇంట్లో దుడ్డు తేనె తుట్టలా ఎందుకు కూడబెట్టావు? మన దొరగార్ని చూడరాదా! దుష్టులేమైనా అనుకోనియ్యి గాని – రాజమహలులో దొంగతనం చేయడానికి దొంగంటూ వస్తే – అతని కేమైనా చేతికి చిక్కేదీ, చిక్కనిదీ. ఆ విషయం దూరంగా వుంచు – వాడు చిక్కిందే పరమ భాగ్యమని దొంగవాడినే జీతగాడిగా ఎక్కడ నైనా జాకట్టు పెట్టి డబ్బుతెచ్చి దొరగారు ధుమధుమలాడించేస్తారు. "ఇచ్చేది తన కోసం, దాచిపెట్టేది ఇతరుల కోసం" అనే మాట

ఎంతమాత్రం అబద్ధం కాదు - ఇంట్లో దుడ్డుందనే కారణంచేత ఈ పేదవాడికి దాన్ని ఎత్తుకొని పోవాలనే బుద్ధి పుట్టింది.

దొంగ పె : ఔను మహారాయా! దుడ్డు లేనిచోటికి మేమెందుకు పోతాం ?

దొర : నేను మరీమరీ చెబుతున్నా చూడు - ఎవరైనా కన్నంవేసి వస్తే గోడ పడిపోయి వాళ్లు చావాలనే దుర్బుద్ధితోనే నువ్వు ఇటువంటి పాడుమట్టి గోడ కట్టివుంచావంటాను.

గృహ : (స్వ) ఎంతగా తప్పిద్దామని చూసినా, మిత్తి నెత్తికొచ్చి పడుతూనే వుంది. ఇహమీద ఇల్లా చేసిచూస్తా .... ఈ అడివిగోడు రాజ్యంలో అడ్డదిడ్డం దారిపట్టడం తప్ప వేరే విడుగడయ్యే ఉపాయమే లేదు. (దివాన్జీకి సైగచేసి ప్రకటంగా) మహాప్రభూ! కట్టించిన వాడ్ని నేనే అయినా కట్టినవాడు వేరు. నిజానికి ఆ ఉప్పరాడికే శిక్ష కావాల్సి వుంది. అన్యాయం జరగకూడదు తమ ధర్మరాజ్యంలో నని విన్నపం.

దివాను : ఔను దొరగారూ! ఇతడు చెప్పేదానిలో ఎంతో అర్థముంది.

దొర : అర్థ ముండకొన్నదా! అల్లాగైతే ఇతన్ని వదిలెయ్యండి. ఆ ఉప్పరివాడినే పిలుచుకొని రప్పించండి. ఇతనే చావాలవి మాకేమీ పట్టుదల లేదు. ఎవరైనా ఒకళ్లు చస్తే సరిపోతుంది. అదే న్యాయం.

దొంగ పె : దొరవారూ! ఇతడే చావా........

దొర : దొంగముండకాన! నోరు మూసికొని పడివుండు. ఎవరు చస్తే నీకేమి ? నీ కళ్లా కావాలిసింది న్యాయం జరగడం. ఊరికే మా ప్రాణాలు తోడిపారెయ్యకు. ఉప్పరాణ్ణి రానీ.

దివాను : (కొత్వాలుతో) పో; పిలుచుకొని రా.

కొత్వాలు : స్వామీ! వాడి పేరేమిటో ?

దివాను : వాడిపేరు గీరు మ్మాట ఎత్తకు. మెదలకుండా పో. ఎవడినో వోణ్ని పట్టుకొని చక్కా రా. వా డుప్పరివాడైతే చాలు.

[కొత్వాలు పోయి ఓ కూలివాడితోపాటు తిరిగి వస్తాడు. కూలి వాడు మూర్ఛ పోతాడు.]

గృహ : ఇతడే మాలద్దైవం చేతిలో పడ్డాడో!

దివాను : చూసారా ఒక్కొక్కవన్నాగం! జనాని కనిపించి వుంటుంది. 'అయ్యో! పాపం! మంచి మనిషి. లేనిపోని నేరం నెత్తిని మోపితే మానభంగమైన దానికంటెనూ, మరణ ప్రాప్తి మంచివని, మంచీ మర్యాద కోసం పడి ఛస్తున్నాడు' అని. కొత్వాలుగారూ! ఏమిటి చూస్తూ అలా నిలబడి పోయావు కోటగోడలా! ఒంటి పులుసు వదల గొట్టు ఇంతోటి మైకానికి అదే మందు.

కొత్వాలు: దేవా! జడిసే కారణమే లేదు. దేవుడు తానే ప్రాయశ్చిత్తం చేసాడు. తానులేస్తే తనకు చావు వస్తుందనే ఎఱుక ఇతని కున్నప్పుడు, ఇతన్ని చచ్చేదాకా కొట్టితే మాత్రం. మెలకువ ఎల్లా వస్తుంది? ఇతడు చచ్చేదే మంచివని.

దొర : ఛీ! ఇల్లా అన్యాయంగా ఇతనికి చావు రాకూడదు.

దివాను : అల్లా అయితే దొరగారి అజ్ఞ ఏమిటో?

దొర : మొదట ఇతన్ని ఏ ఉపాయం చేతనైనా సరే మేల్కొల్పండి. ఆ పిమ్మట, ఈ ముండకు మొగుడవడానికి తను ఒప్పుకుంటాడేమో, అడిగిచూద్దాం.

దొంగ పె: (స్వగతం) వీ డొప్పుకున్నాడో నేను చచ్చిందాన్నే!

దొర : ఒప్పుకుంటే ఆ తర్వాత న్యాయంగా చావనిద్దాం. చచ్చినా అన్యాయం వద్దుసుమా!

దివాను : దొరలు సెలవిచ్చేదీ న్యాయమే మరి! (కొత్వాలుతో) లేపు అతణ్ని. (అంతలో కూలివాడికి మెలకువ వస్తుంది.)

కొత్వాలు : పెళ్ళి ఖాయమౌతుందని లేచినట్టున్నాడు. పెళ్లాం పేరు చెబితే పీనుగైనా పిలపిలలాడుతుందిట! (కూలివాడితో) ఒరేయి! రావణా సురుడిలా పడ్డావేమిరా! దొరల కల్లాగే పొర్లి దణ్ణం పెట్టు.

[కూలివాడు అల్లాగే చేసి వణుక్కుంటూ లేచి నిలుస్తాడు]

దొర : దివాన్జీ! అడగండి! పెళ్లిచేసుకోడానికి సిద్ధమౌతాడేమో?

దివాను : ఎంత చెడ్డా అది ఆడుది! వద్దని ఎందు కంటాడు? మెడలో పూదండ వేస్తాడు. ఒరేయ్! ఈ మెను పెళ్ళి చేసుకొంటావుగా!

కూలి : (దాన్ని చూసి బెదిరి) నే నంతటి నేరం ఏం చేసాను దొరా!

(తిరిగ మూర్ఛపోయి పడతాడు)

గృహ: వేస్తాడు చూడండి పూదండ.

దొంగపె: అయ్యో! మాటికి మాటికి మూర్ఛపోయే ఈ మలరోగి నెందుకు కడతారు స్వామీ! నామెడకు!

దివాను: ఆ గొడవ నీకెందుకు? శాస్త్రానికో మగవాడు నీకు చిక్కవలసి వుంది.

దొర: ఏమయ్యా దివాన్జీ! వీడు పడివుండి ఏమిటి ఆలోచిస్తున్నాడింత సేపు?

దివాను: ఎక్కడి ఆలోచన? ఆలోచనంటూ వుంటే వీడిగతి ఇల్లా ఎందుకౌతుంది? ఆలోచన పాలుపోకనే పాపం మూర్ఛ పోయిపడివున్నాడు మలరోగి అయివుండొచ్చు.

దొర: అంతా చిత్ర విచిత్రంగా వుంది! పిలిచి పిల్లనిస్తామంటే ఇతనికి మలరోగం పట్టుకొంది. ఇంక సామోపాయం చాలు, ఇటువంటి వాళ్ళకు దండమే కావాలి, దివాన్జీ! చూస్తారే మిటి?

దివాను: కొత్వాల్జీ! ఎందుకలా చూస్తూ నిలబడి పోయారు?

కొత్వాలు: (బిత్తరపోయి) ఏమీలేదు దేవర వారూ: చస్తూవున్నాడా బ్రతుకుతూవున్నాడా అని గమనిస్తున్నా.

దివాను: చావడానికేం ఖర్మంపట్టింది వాడికి?

దొర: మరోమాట, రాజాజ్ఞలేనిది యమాజ్ఞయైనప్పటికీ ఎల్లా చెల్లుతుంది? ప్రజలకు నిజానికి రాజే యమధర్మరాజు

గృహ: అవును దొరగారూ! తమ ఈ రాజ్యంలో తామేమాకు యములు. తామేమాకు మృత్యుదేవతలు. తామేమాకు చావు, సర్వమూ తామే!

[కూలివాడు మేల్కొంటాడు]

దివాను: ఒరేయి ఉప్పరాడా! (జవాబులేదు) ఎంతకావరం! తానీకు మాటకు జవాబివ్వ కున్నావ్! నీతస్సాదియ్యా!

కూలి: దేవరవారు నన్ను పిలిచారా? (లేచి నిలబడుతాడు)

దివాను: నిన్నే! ఈ పనికి మాలిన ఇంటిని కట్టి నువ్వు ఈ బీద మనిషి మరణానికి కారణమయ్యావు. నువ్వు ఈమెను పెళ్ళి చేసుకోడ వి తొప్పుకోడం

లేదు. ఆ కారణంచేత, ఓరేయి ఉప్పరాడా! నువ్వు దేహాంత ప్రాయశ్చిత్తానికి సిద్ధంకావాల్సి వుంది.

కూలి: (స్వల్ప ధైర్యంతో) దేవరా: నేనుప్పరాణ్ణి కాదండి: ఓ కూలిపేదను

దివాను: ఉప్పరి వాడివి కాకుంటే ఇక్కడికెందు కొచ్చావు?

కూలి: కొత్వాలు దొర బడబడా లాగుతూ మరీ తెచ్చాడు.

దివాను: ఆయన ఇష్ట మొచ్చింది ఆయన చేస్తాడనుకో, అయితే మాత్రం నువ్వెందుకు రావడం?

కూలి: నేనుకూలి ఏదైనా దొరకుతుందేమోననీ, ఎట్లా దొరుకుతుందా అనిన్నీ, యోసించుకుంటూ, రోజూ మల్లీ నే నాదారినిబడి, నాసింతలో నేను పోతూ వుండా. అంతలోకి ఈ దొరోడు, తప్పేమిలేని నన్ను పట్టుకొని గుంజు కుంటూ వచ్చి ఇక్కడికి తెచ్చాడు. నేనుకూలోడ్ని! ఉప్పరోణ్ణి కాను.

కొత్వాలు: దేవరా! ఉప్పు కారం నింపి ఇతను చెప్పేది వింటున్నారా?

దొర: దీంతోనే వీడు ఉప్పర వాడనేమాట ఋజువౌ తోంది.

గృహ: (స్వగతం) కూలి వాడనేది అబద్ధమేనా?

కూలి: దేవరా! మా బాబులూ! ఎక్కడి ఉప్పు ఏంది ఉప్పరాడు?[1] కూలోడ్ని కూనీ వాడని అంటున్నారా?

దివాను: కూలివాడా, ఉప్పరాడా! మాల మాదిగల్లో వుండే పద్ధెనిమిది. జాతుల పేర్లు అన్నీ మనం జ్ఞాపకం పెట్టుకొంటామా? శూలాని కెక్కించాలంటే కూలి వాడేమిటి ఉప్పరాడేమిటి? కూలి వాడంటే మరెవడో కాదు. ఉప్పరి వాడికి సాయంచేసేవాడే, ఖూనీ చేసినట్లే వాడు! (కూలివాడేమీ తోచకుండా నిలబడుతాడు)

దొర: ఓసీ న్యాయదేవతా! ఇదేమన్యాయం మేం రాజధర్మాన్ని ఎంచి శిక్షించ డానికి సిద్ధంగావుంటే, చావడానికి ఎవరూ సిద్ధంగా లేరే! చావడానికి నేను ముందంటే నేను ముందు అని అనడం దూరంగా వుండనీ,

---

1 ఉప్పరాడు - పైదేశంనుంచి వచ్చిన వాడని అర్థం. తెలుగు కర్నాటక ప్రాంతంలో ఓఢ్రదేశంనుంచి వచ్చినవని పాటుల వాళ్లు ఎందరో ఉన్నారు వాళ్ళను ఒడ్డి ఉప్పరోళ్ళు) అని అంటారు ఒడ్డి, ఓఢ్రుడు, ఓఢ్రుడు మనకు పై దేశమేగదా! అనువాదకుడు.

అందరూ, గొంతువురి తప్పించుకునే బ్రతుకు దొంగలేనా? ఈవిధంగా మన రాజ్యంలో అధర్మమైన పిమ్మట రాజ్యం నిలిచే ఆశేలేదు.

గృహ: అది నిజం!

దొర: దివాన్జీ! చంపి మరీ విడవండి ఆ నాపవెధవని! దాంతో తెల్లవారు జామునుంచీ, నడిచిన ఈ వ్యవహారం ముగిసినట్లౌతుంది. ఈ ఆడది చిన్నవయస్సులోనే వుంది. ఈమెకు పొట్టకు ఇంత కూడు పడేసే వాళ్లెవరైనా దొరికే దాకా, కొత్వాలు వశంలో ఉండనీ. ఈమెకు ప్రపంచానుభవం లేదు.

[కొత్వాలు ఆశనిరాశలతో దొంగపెళ్లాన్ని చూస్తాడు]

దొంగ పె: (స్వగతం) సూసినోళ్ల ఇల్లు నిలపడానికి నానెవరని అనుకుంటున్నారో యీాళ్లు?

దివాను: (గృహస్థుతో) మీరైనా ఈ మతిమాలిన దానికి తెలియజెప్పండి ఊరికే మెదలకుండా ఆలోచన లేకుండా చావవద్దని చెప్పండి.

గృహ: (కూలివాడి చెవిలో ఏమో చెప్పి) పిచ్చివాడా! అల్లాచేయి.

కూలి: దేవరా! మీసేతిలో సెయ్యేసి ఒట్టుపెట్టి సెబుతన్నా .. ఈ పనిసేసిన వాడిని నేనుకాదు మహరాయా!

దివాను: (లక్షణం కనిపెట్టి) వెయ్యి చేతిలో చెయ్యి (చెయ్యి ముందుకు చాపుతాడు)

కూలి: (రొండి డబ్బుతో చెయ్యి వెచ్చపడజేస్తూ 1) ఇదిగో పట్టండి!

దివాను: దొరగారూ! ఇతని చెయ్యివెచ్చగావుంది. ఇతడే తప్పుచేసి వుంటే ఇతడు గడగడావణికి పోతూ వుండాలిగదూ? అదీగాక బెదరిపోయి వుంటే ఇతని చెయ్యి ఎల్లా వెచ్చగా వుంటుంది?

దొర: ఇతని చెయ్యి వెచ్చగా వున్నదా! మరో లాగైతే చల్లబడి వుండేది చెయ్యి. ఇతడపరాధికాదని తేలుతోంది.

కొత్వాలు: ఇతన్ని విడిచి పెడతారా దేవరవారు?

[దివాను దొరగారి మొహం చూస్తాడు]

1. చెయ్యి వెచ్చపడజేయటం - లంచమివ్వడం. 'ముఠ్ఠీ గరమ్ కర్నా' అని హిందిలో అంటారు. —అనువాదకుడు.

దొర: ఛీ! అల్లా ఎంత మాత్రం విడిచి పెట్టడానికి వీల్లేదు. వేరే నేరస్థుడు దొరికేదాకా అయినా ఇతన్ని విడవడానికే వీల్లేదు. వేరే నేరస్థుడు చిక్కకపోతే ఇతన్ని విడిచేదెట్లా?

కూలి: శాల్లు వదులుసేసినా, యమదూతలు విప్పుకొని పోవడంలేదు. ఏం సేసేది నా తండ్రీ!

దివాను: అదిగో! అక్కడ చూస్తూ నిలబడ్డ జనంలో ఎవరైనా చేసివుండొచ్చుననిపిస్తోందా?

కూలి: (కొంచెం జీవం వచ్చినట్లై ఒక వేశ్యను చూసి) దేవరా! ఆభోగంది, ఇతన్ని చంపివుండొచ్చు.

గృహ: (స్వగతం) ఆమెకూ ఈ దొంగ వాడి మరణానికి ఏమి బాదరాయకాసంబంధం కల్పిస్తాడో ఈ అడివిగోడు పండితుడు! దొంగలకూ – వేశ్యలకూ, రాత్రికీ – మరణానికీ సంబంధం ఉన్న మాటేమో నిజమే.

దివాను: కొత్వాలూ! పట్టుకొనిరా ఆ భోగందాన్ని.

కొత్వాలు: ఈ చేయి, నేడెవరెవరిని, పట్టుకొని పవిత్రం కావాల్సి వుందో (వెళ్తాడు)

దొర: దివాన్జీ! పొద్దెక్కి పోయింది. ఆమెను రాజమహలుకు తెమ్మనమని చెప్పండి, మనం మధ్యాహ్నం భోజనం ముగించుకొని, 'వామకుక్షులమై[1] లేచిన మీదట – ఆమె న్యాయవిచారణ జరగ వలసివుంది. ఆమె భోగందే అయినా కులీనులు కూడా ఆమె సంపర్కంలోకి వస్తూ వుంటారు గాబట్టి, ఆమె కులీనురాలే అని మనం పరిగణించాలి. ఏమైనా అడదిగదా! నలుగురు గుంపు చేరినచోట ఆమెన్యాయవిచారణ జరిగింప వద్దు;

గృహ: (స్వగతం) ఇంకేం? ఏకాంతంలో ఈమెకు న్యాయవిచారణ జరుగుతుంది కాబోలు! మంచి న్యాయమే! మంచి విచారణే.

1. వామకుక్షి - భోంచేసి ఎడమపైపు తిరిగి పడుకొని విశ్రాంతి తీసుకొనేవాడు. మరాఠీలో ఈ శబ్దాన్ని ఈ అర్థంలో వాడుతారు.

దివాను : ఈ 'ఊరిబసివికి'[1] ఎందుకింత మన్నన!

దొర : వేశ్యలు, కులీనలు. అని భేదం చూపడానికి మన న్యాయమేమన్నా నాటకమా ? స్త్రీలల్లో భేద మెంచకూడదు. ఆడవాళ్లందరూ మనకు ఓలాగే.

గృహస్థు : (స్వగతం) విశ్వకుటుంబి అని చెప్పాలి, ఇంతోటి మా మహారాయలుం గారిని!

దొర : నేను చెప్పిన ప్రకారం చేయమని కొత్వాలుకు చెప్పండి. పదండి, పదండి. (అందరూ పోతారు)

## రెండవ దృశ్యం

దొర : ఏం దివాన్జీ ! ఏమంటోంది నేరస్తురాలు ?

దివాను : దగ్గిరకు వెళ్ళడమే కష్టంగా వుంటే !

దొర : దగ్గిరకు వెళ్తే గొంతు పిసుకుతుందా లేక నరికివేస్తుందా ?

దివాను : అట్లా చేయడానికి వస్తే ఖూనీ చేసేవాళ్ళ లక్షణా లిల్లాగే వుంటాయి అని ఋజువుచేసి, అక్కడి కక్కడికే శూలానికి గ్రుచ్చి పైకెత్తవచ్చు ఆమెను.

దొర : మరింకేమి చేస్తోందామె ?

దివాను : ఎవరు చూడడానికి వస్తే వాళ్ళని, మెడ కౌగిలించుకొని ఏడ్వడ మారంభిస్తోంది.

కొత్వాలు : ఔను దొరగారూ ! ఇదే చిక్కు ! కేవలం, మెడ కౌగలిస్తే చేయి విడిపించుకోవచ్చు. ఒక్క ఏడ్వడం మాత్రమే అయితే కన్నీళ్లు తుడిచి పారెయ్యవచ్చు. ఆమె భల్లూకపు పట్టు తప్పించుకోడానికి రెండు చేతులూ ఏమీ చాలిచావడంలేదు.

దొర : మా మంచి శూరవీరబహాదూరువు నువ్వు. దివాన్జీ! ఆమె ఏడ్పు ఏడ్వడం విడిచి, రెండు పదాలు పాడి వినిపించి వుంటే, కరుణా రసం పుట్టి వుండొచ్చు. ఆమెకు రాజ సౌధంలోని చెరసాలకు వచ్చామనే జ్ఞానం ఉన్నట్లే తోచడలేదు. అంతఃపురం ప్రవేశించి ఇక్కడే

1 బసివి—Prostitute in temples or mathas అని కిట్టెల్ వంటి తుడు 'ఊరిబసివి' — తెలుగులో 'వాడ వదినె' లాంటి ప్రయోగం — అను.

వుండిపోవాలనే భ్రమతో వుండేమో పాపం! ఈ మనిషిని చాలా పొద్దు ఈవిధంగా వుంచి ఉపయోగం లేదు. ఏమైనా, న్యాయంచేసి, ఆమె నొక్కసారి శూలాని కెక్కించి, విడుద్దాం.

దివాను : ఏం కొత్వాలూ ! ఆ గృహస్థు, ఉప్పరాడు, దొంగామె, వేశ్య అందర్నీ రానీ. (కొత్వాలు వెళ్ళిపోతాడు)

దొర : దివాన్జీ ! జనులు చావంటే ఎందు కింతగా బెదిరిపోతున్నారో తెల్వదు. అందరూ బ్రదుకు దొంగలే. వెనకటి కాలంలో, ప్రతి సంవత్సరమూ, యుద్ధాలంటూ అవుతూ వుండడంవల్ల చావనేది ఒక క్రీడా మాత్రంగా వుంటూ వుండేది. అదీగాక, రణాంగణంలో ఎక్కడి న్యాయం, ఎక్కడి అన్యాయం ? చచ్చినవాళ్లు చచ్చారు, మిగిలినవాళ్ళు మిగిలారు. ఇటీవల యుద్ధాలు, నిలిచి, న్యాయవిచారణ అనే పనికిమాలిన అర్బాటాలతో ప్రతి ఒకళ్లు సాధ్యమైనంతమట్టుకు చావరాదు అని ప్రయత్నిస్తున్నారు. మరి ఈ పిరికితనానికి న్యాయ మనిపేరు కూడా ! కలియుగంలో ఏమేమి చమత్కారాలు కంట పడ వలసిఉన్నాయో ?

దివాను : దొరవారు చింతామగ్నులు కారాదు. తామూ వున్నా చచ్చినట్లే వుండి వుండడంచేత జనులెవ్వరూ తాము చావంటే బెదిరిపోతున్నా రని అనుకో జాలరు. యుద్ధాలు జరక్కుండా పోవడంలో తమ తప్పేమీ లేదు. రేపే తమకు చావువస్తే నాలుగడుగులు ముందుకు పోయి, తాము చావును కౌగిలించుకొని తీరుతారు.

[కొత్వాలు, గృహస్థు. ఉప్పరివాడు, దొంగవాడి పెళ్ళాం, వేశ్య మొదలైన వాళ్ళతో ప్రవేశిస్తాడు. ]

వేశ్య : (రాగానే) దొరలపాదాలకు దణ్ణాలు. (నేలమీద పడుతుంది)

దొర : నువ్వు నామెడకు పడ్డా, చావు తప్పదు.

వేశ్య : (లేచి) ఓయింత కరుణా రసం రాకూడదా. (ఏడుస్తుంది)

దొర : ఏడ్వడమంటే తన హక్కు అని తెలిసికొన్నదేమో ఈ పిచ్చిముండ? దివాన్జీ, న్యాయం తీరనీ, ఈమెనూ తీరిపోనీ. చెప్పండి ఆమెకున్న క్షీంగతి ఉన్నట్లు.

దివాను : ఓసి అడుదానా! ఊరికే ఎందుకే ఏడుస్తున్నావ్ ? మా దొరగారి కరుణారసం నీకు తెలిసిందికాదు. నీ ఈ దుఃఖంచాలాసేపు వుండదు (ఏడుపు ఆపి వేశ్య చెవిబెట్టి శ్రద్ధగా వింటుంది) సాయంకాలంలోగా నువ్వు చచ్చిపోతావు.

వేశ్య : అయ్యో ఇదేమి పోయేకాలం! తెల్లవారు కట్టనుంచి, నాకు కూడూ లేదు నీళ్లూ లేవు. అదే కోరిక. తమకుంటే - సంజవేళకు చావు కట్టి పెట్టడం - ఈ చిత్ర హింస చేసేదానికంటె ఇప్పటి కిప్పుడే చంపే సెయ్యండి. అయ్యో దేవుడా! తప్పులేకుండా నేచంపే రాజ్య మెక్కడైనా వుంటుందా ?

గృహస్థు : భోజనానికి ఇంటికైనా వెళ్ళమనండి.

దొంగ పె : అట్లా ఎందుకు ? ఈడనే కడుపు కింత కూడుపడేస్తే తమకంటి ఎదుటే భోంచేస్తా - కూటికీ దొంగతనమేనా ?

దొర : దివాన్జీ! ఈమెను బాపనముత్తైదువ లాగా భోజనానికంటూ బొట్టూ కాటుక పెట్టి పిలిచేది లేదని తెలియజెప్పండి. చావు సమస్య విడిపిస్తుండే సమయానికి కూటిచింత తీసుకొస్తారే! - చెప్పండి. ఉన్న సంగతి దివాన్జీ!

దివాను : ఓసీ అమ్మీ! ఈ దొంగదాని మొగుణ్ని నీవు చంపివున్నావు.

వేశ్య : అదెప్పుడు ? ఎవతె ఆ నా సవతి ?

దొర : ఇక్కడ సవతి మాత్సర్యం కూడదు. దొంగ చచ్చిపోయాడుగా !

వేశ్య : ఉన్నవాళ్ల మొహం మాత్రమే చూసే మాకు దొంగ పొత్తె ఎక్క డుంటుంది ? నేనా దొంగ మొహమైనా చూడలేదు; వాడ్ని కలిసి వుండలేదు. చంపానంటే అర్థమేమిటి ?

దివాను : చంపేవాళ్లు కలవాల్సిన పనేముంది ? న్యాయంగా కావాల్సింది సాక్షి మాత్రం; సంగతి కానీ; కాకపోనీ; ఆ విషయం తెలిసి కొనే దెట్టా ?

వేశ్య : నేను చంపానని ఈ దొంగవాడి పెళ్ళాం చెబుతోందా ?

దొంగ పె : అయ్యో మాతల్లికాన ! నా కెందుకు ఆడదాని ఉసురు!

దొర : ఓసి దొంగదానా ! అమ్మ, తల్లి అంటూ చుట్టరికం కలపబోకు.

వేశ్య : ఏ మగవాడు నేను చంపానని చెబుతాడు ? ఇక్కడ నిల్చున్న వారిలో ఈ గృహస్థుడేమో సభ్యులులా కాన వస్తున్నారే.

దివాను : ఓయి ఉప్పరాడా ! ఎందుకు మొద్దుబారి నిలబడ్డావు. నోరు విడిచి చెప్పు.

వేశ్య : ఏం ? అబద్ధం పనికి ఈ దొంగ సాక్ష్యమా ?

దొర : ఓసి భోగం ముండా ! చూసిన వాళ్ళతో అల్లా చూసినట్లు మాట్లాడితే ఉరివేయడానికి ముందే ఒకటి రెండు శిక్షలు వేరే విధించాల్సి వస్తుంది.

వేశ్య : అల్లా కాదు దొరగారూ ! సాక్షి చెప్పినంత మాత్రాన వెంటనే నిజమని ఎల్లా నమ్మడం ?

దొర : అదీ అబద్ధమే ననడానికైనా మళ్ళీ సాక్షియే కావాల్సి వుంటాడు. ఇంతకీ, ఈ ఉప్పరాడు అబద్ధ మెందుకు మాట్లాడుతాడు ? నీ పని వేరు, అతని పనివేరు. అతనిది పగటి పని. నీది రాత్రి పని. అతనిది ఇల్లు కట్టే పని; నీది ఇల్లు కూల్చే పని "ఉన్నది ఉన్నట్లు చెబితే ఉలు కెక్కు" వంటారు. అతను చూసిందేమిటో చెబుతాడనే నువ్వు కణకణలాడే నిప్పుకణంలా మండిపడుతున్నావు. నీవు నేరస్తురాలవని చెప్పడానికి ఈ ఒక్క ప్రమాణం చాలు.

వేశ్య : చంపాలని చెప్పేవాళ్ళకు, చూసిందీ, చూడందీ, రెండూ ప్రమాణమే ? అది వుండనీ ఇతడు చెప్పేదైనా ఏమిటో,

దివాను : (కూలివాడితో) ఊం ! చెప్పు.

కూలి : ఏరే ఏమి సెప్పేది? ఆ దొంగోడి సావుకు నువ్వే మూలమై వుండాలి.

దొర : అవునా కాదా ?

వేశ్య : దొరగారూ ! ఇంత మాత్రానికే నేను నేరస్థురాలినని ఋజువైందా?

దొర : ఛిఛాస్టి ! అసలే ఆడుదాని నాలిక మహా చురుకు, అందులోనూ వేశ్యలది మరిన్ని అడిగే దేముంది ? అపరాధిని అయివుండడం చేతనే

1. 'కన్నదాన్ని చెబితే నిప్పు కణంలా మంట' అని కన్నడ సామెత—అను.

తప్పించుకోవాలని పెనుగులాడుతోంది. తప్పలేకపోతే గగ్గోలు పెట్టినా చచ్చినట్లు పడివుండేది. ఆమెను రెండింటిలోనూ ఓ మాట అడగండి దివాన్జీ!

దివాను: ఇదుగో విను! ఏం! చస్తావో! లేక ఆ దొంగదాన్ని పెళ్ళాడుతావో?

[ దొంగది - వేశ్య - ఒకళ్ళ నొకళ్లు చూసుకొంటారు. ]

గృహ: బలే న్యాయం!

దొర: ఏం?

గృహస్థు: (తగ్గిన స్వరంతో) మంచి న్యాయంగా వుందంటాను.

దొర: నేనూ ఆదే అంటున్నా.

దొంగది–వేశ్య: మేమల్లా సెప్పుకోలేం.

దివాను: అల్లాగైతే దొంగదాన్ని ఉపవాసంచేసి చావమను, నీవు శూలాని కెక్కిచచ్చిపో; సరేనా, మాకు ఉన్న న్యాయంలో అన్యాయం చేయ డానికి లేదు. కొత్వాలూ, గృహస్థునీ, ఉప్పరి వాణ్ణి ఇంటికి పంపిరా

గృహ: దివాన్జీ! నాగోడ గతి ఏమిటి?

దొర: ఆవేశ్య చచ్చి మన్ను ఆయిందంటే, అదేమంటితో ఈ దొంగది గోడకట్టి వేస్తుంది. వెళ్లింటికి, మించి మాట్లాడకు.

కూలి: దేవరా! పొద్దుటినుంచీ నాకు రావాల్సిన కూలీనాలీ?

దివాను: ప్రాణం సంకటంనుంచి బైట పడ్డదిగా! సత్యనారాయణ వ్రతం చేయించి, రాజసాధానికి ప్రసాదం పంపించు, పో. కొత్వాలు ఇతన్ని నెట్టు కుంటూపద. (వాట్లువెళ్తారు)

దొంగది - వేశ్య: అడ కూతుళ్లం ఇద్దరమూ చిక్కుకొన్నాం. ఇంకా ఏమి న్యాయమో! అన్నాయమో!

వేశ్య: (దొంగదానితో) ఓసి మహారాణి! నా మెడ కెందుకు చుట్టు కున్నావే! నన్నూ బదికించు, నువ్వు బ్రదుకు (దొంగది వేశ్య కేమిటో చేబుతుంది)

దొర: ఇంతలో చెవికొరుక్కో వాల్సినపని వుందా ఏమిటి?

దివాను: మంచి మాటల్తో పెళ్లి చేసుకుంటా రాలేదా?

వేశ్య: ఇది ప్రభుత్వానికి సంబంధించిన విషయం కాదుగా ?

దొర: ఈ తర్కం పెట్టుకోకు, పెళ్లి, చావు రెంటిలో ఏది కావాలో ఒప్పుకో!

దొంగది: ఆయన కోసం వేడుకొంటే ఆమెను మెడకు కట్టుతుండారా దొరవారూ !

వేశ్య: చచ్చినవాడు మగవాడు; అతని కోసం చావాల్సింది ఆడుది, ఇదెక్కడి న్యాయమో ! ఈ రాజ్యంలో చావడానికి మగవాళ్ళే చిక్కలేదా ! ఏమి రాజ్యమిది !

దొర: రాజ్యంమీద వ్యాఖ్యానం చేయవద్దు. సందర్భం వస్తే నేనూ ప్రాణం ఇచ్చేయొచ్చు.

దివాను: నేనూ ఇవ్వవచ్చు.

వేశ్య: అల్లాగైతే అల్లాగే ఎందుకు చేయకూడదు ? రాజు ప్రజల ప్రాణం. ప్రజల ప్రాణంపోతే రాజే ప్రాణం విడిచెయ్యాలి.

దొర: అల్లాగైతే గడియకో సారి చావాల్సివస్తుంది. దానికేంగాని, అది అల్లావుంచు, దివాన్జీ! పెనిమిటికోసమని పెళ్ళాం చావడం మంచి పనికాదు. వేశ్య నోటినుండి వచ్చిందంతా అబద్ధం కాజాలదు. మన ఈ దొడ్డరాజ్యంలో మగవాళ్లెవరూ చావడానికే దొరకరా: ఉన్న ఇద్దరినీ వృథాగా విడిచేసాం.

దివాను: చస్తే పీడవిఱగడై, ఇంత విశ్రాంతి చిక్కుతుందని, గడియకోసారి అనుకొనే జాతికి చెందిన ఈ ఆడుది,, తానుగాకోరి వచ్చిన చావుకు వెనకాడుతుందనిపించడంలేదు.

దొర: ముందు గతిఏమి ?

[కొత్వాలు ఒక సన్న్యాసితో పాటువస్తాడు]

దివాను: ఓసి దొంగదానా ! నీ వాడంటూ వచ్చాడు ఇంకనేం ?

దొంగ: నన్ను పానాలతో విడిసిపెట్టండి. మొగడూ వద్దు మొద్దులూ వద్దు ఈ బోగమక్కతో హాయిగా వుంటాను.

దొర: ధన్యమైంది నారాజ్యం, ఎంతటివివేకం ?

వేశ్య: ఆమెకెక్కడి సుఖం నేను ఆమెను ఎక్కడ కట్టుకొని వుండాలి, ఒక మగవాడికోసమై ప్రాణాలిచ్చే బాధ్యత ఆడదానికెందుకు? ఈ న్యాయ విచారణ కానియ్యండి మొదట.

దొర: మామంచిపేచీ యేవచ్చింది.

వేశ్య: పేచీఏమిటి? మీకు మగవాడికోసం చావడానికి మగవాడొకడు కావాలి అదిగో అక్కడ కొత్వాలు ఆ సన్యాసిని తెచ్చి వున్నాడు. తురీయాశ్రమానికి వచ్చిన వాళ్ళే చావడాని కన్నివిధాలా యోగ్యులు.

సన్యాసి: ఔను.

దివాను: ఏమిటౌను? వేశ్యలమాటలూ సన్యాసుల మాటలూ వింటే రాజ్యం నాశనమౌతుంది. వీడిని ఎందు కిక్కడికి తెచ్చావు?

కొత్వాలు: ఏం చేసినా పోవడాని కిష్టపడలా, ఏమడిగినా చెప్పనూ లేదు. చస్తావా అంటే అల్లాగే నంటూ లోపలికి వచ్చాడు.

దొర: చావంటే ఆట అనుకున్నాడు గాబోలు పిచ్చివాడు? విడిచి వెయ్యండి ఆ వేశ్యను, ఆ దొంగవాడి పెళ్ళాన్ని. మా దగ్గిర మీ దగ్గిర 'ఒక్కలిగిత్తి'[1] గా వుండనీ. కొత్వాలూ పంపు ఇంటికి. ఈ సన్యాసికి చావు చవి చూపిస్తాను.

వేశ్య-దొంగది: ఇదేం దమ్మం!

దొర: మాటలాడకండి.

దొంగది: మగ....

వేశ్య: ఇల్లు

దివాను: మొగుడూ, ఇల్లూ అన్నిటిని ఏర్పాటు చేస్తాడు కొత్వాలు. కొత్వాలూ! వీళ్ళను తోలేసెయ్యి బైటికి.

[ కొత్వాలు వాళ్ల నిద్దరినీ బైటికి తీసుకపోతాడు ]

దొర: ఏమయ్యా! సన్యాసి! చావడానికి సిద్ధంగా వున్నావా?

సన్యాసి: ఔను.

---

1. ఒక్కలిగిత్తి — ఒక్కలిగ జాతికి చెందిన స్త్రీ, కర్నాటకమున 'ఒక్కలిగిలు; కర్షకజాతికి చెందినవారు — అనువాదకుడు.

దివాను : నీ కేమీ బెదురంటూ లేదా ?

సన్యాసి : లేదు.

దివాను : నీ కేమైనా కోరిక వుందా ?

సన్యాసి : లేదు.

దొర : ఈ శుంఠకు వేరే మాటలే రావల్లే వుంది చూస్తే. అన్ని మాటలకూ "ఔను; లేదు." ఇంతే. ఒరే సన్నాసోడా! నీకు వేరే మాటలేమైనా వస్తాయిట్రా !

సన్యాసి : లేదు.

దివాను : 'ఔను; లేదు' ఈ రెండేవస్తాయా !

సన్యాసి : ఔను.

దొర : ఇటువంటి 'శుంఠకాయను' ఉరికంబానికి ఎక్కించడంలో అర్థం లేదు. వీడికి బ్రతుకు విసగకై వచ్చివున్నాడు ఇటువంటి ఈ సన్న్యాసుల కోరిక తీర్చడానికి మేము దొరలమై కూర్చోలేదు. మే ముంటున్నది శిక్ష విధించడానికి. ఇతను వచ్చి వున్నది తన పని తాను చేయించుకోడానికి. ఏమీలేదు దివాన్జీ ! కొత్వాలును పిలిచి, వీణ్ణి బైటికి మెడబట్టి గెంటించి విడిచి పెట్టండి.

దివాను : కొత్వాలూ !

కొత్వాలు : వస్తి దొరగారూ ! (వస్తాడు)

దివాను : వచ్చావు. మంచిదైంది. అయితే మరి . మరి ... సన్న్యాసిని వదలివేస్తే ఉరికంబం ఎక్కే వాళ్లెవరు ? ఆ దొంగవాడి ఆత్మ న్యాయంకోసం తహతహలాడిపోతూ వుండవచ్చు నిజానికి !

దొర : అదీ న్యాయమే ! కొత్వాలూ ! పో ఊళ్ళోకి పో. "ఈ రాజ్యంలో వుండడంకంటె చచ్చేది మేలు" అని అప్పుడప్పుడూ కూసే నక్క వెధవల్ని గురించి, మేము వింటూ వచ్చాం. ఈ సన్న్యాసిని విడిపించడానికై ధర్మార్థం చావడానికి వాళ్ళల్లోంచి ఎవరన్నా వస్తారేమో చూసి కొనిరా.

(కొత్వాలు వెళ్ళిపోతాడు.)

---

1. కన్నడంలో హుంబ — మూర్ఖుడు; శుంఠకాయ.
ఇది మరాఠీలోని శుంభ. శబ్దభవం. మరాఠీలో దీన్ని మూర్ఖ పర్యాయంగా వాడుతారు —అనుం.

దివాను : అది కాదండి దొరవారూ! చేత జిక్కిన పెద్దమనిషిని వదిలేసి, అద్దంలోని ప్రతిబింబం కోసం ఎందుకు వెంటపడాలి ?

దొర : దివాన్జీ! మీకు న్యాయాన్యాయ వివేకం సున్న – సన్యాసి అంటే నిజానికి శవ మున్నట్లే. దానికంటె సన్న్యాసి వేషాన్ని వేసికొని అటు ఇటూ తిరిగే బ్రతికున్న జనాన్ని ఉరికంబ మెక్కించడమేమో, న్యాయమనిపిస్తుంది. శవాన్ని ఉరికంబాని కెక్కించి చేసేదేముంది ?

దివాను : అల్లాకాదు; రాజ్యానికి విసిగి వేసారి చచ్చిపడివున్న వాళ్ళని, ఉరి తీసి ఏమిటి లాభం! వాళ్ళకు అపకారానికి బదులు ఉపకారం చేసినట్లే ఔతుందిగనూ ?

దొర : దివాన్జీ! మీకు 'మా పిచ్చి' పట్టింది. ఎవరూ ఉచితంగా ఇతరుల కోసం చావడానికి ముందుకు రాలేదు చూడండి కావలిస్తే ఎవరూ రాకుంటే మన రాజ్యంలో అంతా సుఖంగా వుంటోందని, తనంతట తానే ఋజువైపోతుంది.

[ కొత్వాలు వస్తాడు ]

కొత్వాలు : దొరవారూ ! రాజప్రసాదం చుట్టూవున్న వీథుల్లోంచి ఎవరూ చావడానికి సిద్ధం కావడంలేదుట. ఊళ్ళో మరి వెదకి వచ్చేదా ?

దివాను: ఒక్క మెతుకుతో అన్నం వుడికిందీ లేందీ చూస్తాం. ఎక్కువగా పిసికి చూడడంలో ఫలితం లేదు. ఇంకేమిటి చేయడం? సన్యాసి తోనే పని నెరవేరుద్దాం. ఏం దొరవారూ ?

దొర : కానియ్యి ! సన్యాసి ఆత్మ అయినా తృప్తిపడనీ. ఓరీ సన్యాసీ! నిన్ను శూలాని కెక్కించాలో, ఉరి కంబాని కెక్కించాలో చెప్పు... ఇందులోనైనా నీ కోరిక ప్రకారం జరగనీ.

సన్న్యాసి : ఔను.

దివాను : ఔనేమిటి ?

సన్యాసి : లేదు.

దొర : దివాన్జీ! 'ఔను లేద'ప్పగా కనబడుతున్నాడు విడు, పిణ్ణి చంపడం

మాటలు నేర్చిన ఇటువంటి ప్రమాదంలేని జీవకోటి జగత్తులో వుండేం ఊడేం! ఇంకోరికి కష్టం, తిండిదండుగ, భూమికి భారం. దివాన్జీ! రాజ్యం నడిపేపని సులిసూత్రమైందేం కాదు. ఈ ఒక్క న్యాయాన్ని జరిపించాలంటే ఎంత కష్టంగా వుందో చూసారా? మకుటం ధరించిన వాడికి మగత నిద్రకూడా వుండదనే మాట నిజం సుమండీ!

దివాను: ఔను దొరగారూ! తాము ఇంక విశ్రాంతి తీసుకోవాలి. రేపు ఈ సన్యాసి కోరిక నెరవేర్చ వచ్చు.

## మూడో దృశ్యం

[ జనులు గుంపులు గుంపులుగా వస్తూ పోతూ వుంటారు ]

మొదటి వాడు: ఏం గుడ్డి ప్రభుత్వంరా బాబూ ఇది ?

రెండవ వాడు: 'బోగందాని పాపం బోడితల సన్న్యాసికి' వస్తుందంటారు గదూ! ఆ కథ అయింది.

మూడోవాడు: కానీలే! ఆబోగంది చేసిన తప్పేమిటో?

మొ: ఆ కూలివాడి కంటబడిందట.

రెం: అదేమి 'యమ చూపో?'

మూ: కాదు. ఆ కూలివాడైనా పాపం, దిగ్భ్రాంతుడై ఏమో చేసివుంటాడు.

మొ: అంతే ఏమిటి? అంతా తిరుగుమరుగుళ్ళనుకో. దొంగ దొంగతనానికి రావడ మేమిటి? తానే చావడ మేమిటి? దొంగది న్యాయమడిగే దేమిటి? వీళ్ళిచ్చే దేమిటి?

రెం: ఈ దేశంలో న్యాయానికీ, అన్యాయానికి భేదముంటేగా.

మూ: ఏమిటి? కాలుదువ్వి తీసుకొనే న్యాయమే న్యాయమని తెలియదా నీకు?

మొ: ఆ సన్యాసి ఎందుకు మృత్యు గహ్వరంలో ప్రవేశించాడో?

రెం: పుణ్యాత్ముడు! పరులకోసం దేహం సమర్పించినవాడు!

మూ: తల బోడికొట్టించుకొన్నాడు గనుక సన్న్యాసి అని అనుకోవాలి. అంతే. అతని కౌను లేదు రెండే మాటలు వస్తాయిట.

మొ : కృతకృత్యులైన వాళ్ళకి, హెచ్చు మాటలతో పనేమి ?

రెం : అరెరే ! నువ్వు కృతకృత్యుడివిగానే కనబడుతున్నావు ? ప్రాణం మీద తీపి ఎవరికుండదు ?

మొ : అదిగో ! అక్కడే మృత్యు గృహం వాకిళ్లు తెఱిచికొని వున్నాయి.

[తెరలేస్తుంది. వధ స్తంభా లున్నాయి. దగ్గిరగా సన్యాసి, దివాను, దొర, కొత్వాలు, కూలివాడు, చండాలుడు మొదలైన వాళ్లు]

దివాను : కొత్వాలూ ! సర్వజనులకు తెలియజేయి. ఈ ధర్మసింహాసనం నుంచి ఏమి అన్యాయం జరిగిందో మరి :

కొత్వాలు : వినండి. వినండి. గోడ విఱిగి పడి దొంగ చచ్చాడు. దొంగ చావుకై ఇంటి యజమానిని బంధించడమైంది. యజమాని అన్నాడు ఉప్పరాడి తప్పని; ఉప్పరాడు చిక్కక, వాడి బదులు కూలివాడు చిక్కాడు. వాడికి సాయం చేసినవాడు వీడేనని పట్టుకొన్నాం. ఇతడు చెప్పాడు "అది బోగందాని తప్పు" అని. వేశ్య అందిగదా "మగ వాడి చావుకోసం మానిని మరణం కూడ" దని. ఈ సన్యాసి ఎంత చెప్పినా విన్నాడు కాడు, చావు దగ్గిరకు తానే చక్కా వచ్చాడు. దొరవారు అన్యాయం జరగకూడదని ఊరిలో వేరే ఎవరైనా దొరకు తారేమోనని వెదకించారు. ఈ ధర్మ రాజ్యంలో ఎవరూ చావడానికే సిద్ధపడ్డారుగాదు. ప్రాణానికి బదులు ప్రాణాన్నే ఇవ్వాలిసి వుంటుంది. సన్న్యాసి దానికి సిద్ధమై వున్నాడు. ఇప్పుడు వాడికి, ఉచితంగా, న్యాయం కోసం ఉరి అవుతుంది.

దొర : ఇంకా ఓసారి నేను చాటి చెబుతున్నా. ఈ కూడివున్న జనానికి. ఈ సన్న్యాసి బదులు ఎవరైనా చావడానికి వచ్చేవాళ్లుంటే ముందుకు రండి.

దివాను : మూడుసార్లుగా చెబుతున్నా. ఎవరైనా సన్యాసికోసం చచ్చే వాళ్లున్నారా ? ఎవరైనా సన్యాసికై చావడానికి సిద్ధంగా వున్నారా ? ఎవరైనా సన్న్యాసికై చావడానికి సిద్ధంగా వున్నారా ?

[ జనుల గుంపులోంచి ఇద్దరు యువకులు ముందుకు వచ్చి ]

మొ : దొరవారూ ! నన్ను ఉరివేయాలి.

రెం : ఏ డెక్కడివాడు? నన్ను ఉరి వెయ్యండి. నేను వారి పెద్దశిష్యుణ్ణి.

మొ : పెద్ద, చిన్న – అంటూ చావడంలో ఏముంది? నేను మొట్ట మొదటిగా వచ్చిన వాణ్ణి.

రెం : వస్తేనేం రహస్యం తెలిసిన మీదట? దొరగారూ! నన్ను మొదట ఉరికెక్కించి, ఆపైన అతన్ని కావాలంటే ఉరికెక్కించండి.

మొ : అహోహో! దొడ్డపండితుడు; నేను మొదట వచ్చా. నాకు మొదట ఉరికానీండి. ఆపైన నీవంతు రానీ.

దొర : చావడానికి నేను ముందా నీవు ముందా అని తగవులాడవద్దు. నా ఈ శూరవీరరాజ్యంలో ముగ్గురు మనుష్యులైనా చావుకు బెదరిపోకుండా, వీరభటులుగా నిలబడ్డారు. కాని ఈ ఉబలాటంలోని రహస్యం తెలియనిదే నేను ఎవ్వర్నీ ఉరికంబాని కెక్కించేది లేదు.

రెం : నేను చెబుతా. నన్ను మొదట ఉరివేయనీయండి. అల్లా అని వాగ్దానం చేయండి గట్టిగా.

మొ : ఎందుకని; మాట ఇస్తే నేను మాత్రం ఆ మర్మ మేమిటో చెప్పలేనా?

చేరిన జనం : బలే తమాషాగా వుంది. రణాంగణం విడిచేసిం తర్వాత ఈ మరణాంగణానికై ముందుకు వచ్చే యిటువంటి దృశ్యం ఇంకెక్కడా కనబడదు.

దివాను : మాటఇవ్వడానికి మే మెప్పటికీ సిద్ధమే!

[ ముందుకు చెయ్యి పెట్టుతాడు. ఇద్దరూ ఒకేసారి చేయివేస్తారు ]

దొర : ఇట్లా గందరగోళం చేసారా, నేను ఎవర్నీ ఉరివేయలేను.

మొ : } ఛి, ఛీ అల్లామాత్రం చేయవద్దండి:
రెం : } మీకు తెలిసినట్లుగా క్రమంగా నడపండి. ఏమైనా ఇద్దరికీ ఇక్కడ ఉరి వేయనియ్యండి.

దివాను : మా బలే వింతగా వుంది! మర్మం విప్పి చెప్పంది మరణంలేదు.

మొ : అల్లాగే కానీవండి; దొరవారు పుట్టుకతోనే ఉదార హృదయం కలవాళ్లు. మాట పోగొట్టుకునేవారు కారు. రహస్యం చెబుతున్నాం. అయితే ఉరి తప్పరాదు.

దొర : కానీ; ఏమిటా గుట్టు?

రెం : ఈ సన్యాసిగారి పాదం తాకిన రుద్రభూమిలో ఎవరు ముందు చస్తారో వాళ్ళకు చుట్టూవున్న రాజ్యం యొక్క రాజ్యపదవి. ఆ తర్వాత చచ్చేవాడికి మంత్రి పదవి, అని, వాళ్ళకీ రుద్రదేవుని వర ముంది. ఇంతవరకూ, వారు ఏ రుద్రభూమిని తొక్కింది లేదు. నేడు మా అదృష్టం కొద్దీ, ఇక్కడ కాలు పెట్టారు. మేము చిన్నప్పటి నుంచే వీరిని సేవిస్తూ వెన్నంటి వస్తున్నాం. వారు రుద్రభూమికి రావాలని నిన్నటినుంచి కాచుకొని కూచున్నాం. దొరవారు, ఇప్పటి కైనా మమ్మల్ని ఉరికంబాని కెక్కించి, పుణ్యం కట్టుకోవాలి.

దొర : దివాన్జీ! సన్యాసుల కుట్ర చూసారా! కొత్వాలూ! ఈ సన్యాసినీ, మరి వాడి ఈ తుంటరి శిష్యుల్ని తీసుకొనిపోయి బైటపారెయ్యి. ఎవరి రాజ్యానికి ఎవరు బాధ్యులో? నాకే మొదట అనిపించింది. ఇందులో చిదంబర రహస్యముండి వుండాలని. రండి దివాన్జీ, మేమూ, మీరూ ఈ రాజ్యానికి నిజమైన బాధ్యతగల వాళ్ళం. మనమే ఈ రుద్ర భూమిలో ప్రాణాలిచ్చి, రాజ్యపదవిని, మంత్రి పదవిని, తిరిగి భుక్తం చేసికొందాం.

[ జనులు, 'చాహు' మహారాజుకీ జై అంటారు ]

దివాను : ఈ రాజుగారి మంత్రినై వున్నందుకు మంచి పితలాటకమే వచ్చి పడ్డది.

[ ఇరువురూ గొంతుకి ఉరితాడు వేసికొని నిలబడతారు ]

జనులు : ఇందుకే అనవలసి వుంటుంది న్యాయ సామ్రాజ్య మని.

[ 'చాహు' మహారాజులుంగారికీ జై అని ఘోష ]

## నాల్గవ దృశ్యం

సూత్రధారుడు : పడనీ పర్దా, చాలులే ఈ పిచ్చాట.

[ లోపల చాహు మహారాజుకీ 'జై' అని కోలాహలం ]

నాటకకర్త : ఏం మిత్రుడా ? ఎల్లాగుంది నాటకం ?

సూత్ర : నువ్వు ఆడేవాళ్ళ గదిలో పడివుండకుండా, చూసేవాళ్ళ మధ్యలో కూచుని వుంటే తెలిసివుండేది.

నాటక : నువ్వు చెప్పరాదూ ? ఏమైందో ?

సూత్ర : Tragedy అయిందని.

నాటక : అల్లాగయితే నేను గెలిచానన్నమాట.

సూత్ర : గాడిదా ! నువ్వు చిత్తైపోయావు.

నాటక : ఎందుకోయి అంత కోపం ?

సూత్ర : Tragedy అయిందని.

నాటక : నేను రాసిందే అది.

సూత్ర : నీవు రాసింది 'చచ్చే ఆట' అయింది ట్రాజెడి !

నాటక : 'చచ్చే ఆట'గా వుండడమే ట్రాజెడీ. అదేమి పిచ్చాట అని అనుకొంటున్నావా ?

సూత్ర : పిచ్చాట గాదు. కోతి ఆట.

నాటక : మొదట్లో ఓ శవం, చివరికి రెండు అపమృత్యువులు. మధ్యంతా చావుమాట వుండడం, ట్రాజెడీగాక ఏమౌతుంది ?

సూత్ర : ఔను; ఇటువంటి నాటకాన్ని చూసి, జనం నవ్వాలో, ఏడవాలో ?

నాటక : నీ మాటలు విని, నేనేమి చెయ్యాలో చెప్పు మొదట.

సూత్ర : నా మాటకు మొదట జవాబియ్యి.

నాటక: 'చచ్చే ఆట' చూసి కన్నీటిలోనుండి నెత్తుర్లు చిమ్మాలి. ప్రేక్షకు లేమి చేసారో?

సూత్ర: ఒకటే నవ్వడం మొదటినుంచి చివరిదాకా. ట్రాజెడి వద్దప్పా. అది మన రంగస్థలానికి కొత్త అని చెప్పానా మరి; నువ్వు వింటేనా?

నాటక: అదిగో! మరోసారి ఈ మాట అనవద్దు. మన ప్రాచీన సాహిత్యంలో వుండేదంతా వొట్టి ట్రాజెడీయే రామాయణం, మహా భారతం, భాగవతం, భగవద్గీత, శాకుంతలం, దశావతారాలు, ఇవన్నీ ట్రాజెడీమీద ట్రాజెడీలు.

సూత్ర: అబ్బా!

నాటక: అబ్బ ఏమిటి? సీత భూగర్భంలో ప్రవేశిస్తుంది. లక్ష్మణు డుపవాసంతో చచ్చిపోతాడు. రామచంద్రు డయోధ్యలోని జనమందర్నీ గలుపుకొని వైభవంగా సరయూనదిలో జలసమాధి పొందుతాడు; ఇది రామరాజ్యంలోని పెద్ద ట్రాజెడీ; సదేహంగా, రాజ్యంతోబాటు, స్వర్గానికిపోయే సంభ్రమ సన్నాహం! శంతనుని కాలంనుంచి, సంతతికోసం, చచ్చి – చెడిపుట్టిన పీనుగుకు [1]జీవకళపోసి, పట్టానికని విడిచిపెట్టి, మోసేవాళ్లూ లేక, తమ కాలితో స్మశానానికి బైలుదేరినట్లే వీధికొక్కరూ, సందుకొక్కరుగా పాండవులు చచ్చిపోగా, కుక్క వెంబడి పడిపోయిన ధర్మరాజు, దుర్యోధనుడు స్వర్గంలో వుండేదాన్ని విని, నరకం వాసన చూడడానికీ, ముందుగా బైలుదేరడం ధర్మరాజు ట్రాజెడి, పదహారువేల పెళ్ళాల్ని ఏలి, అరవైవేల పిల్లల్నికన్న మగవాణ్ణి పెట్టుకొన్న గోకులంలోని యాదవులు, చివరికి రోకళ్ళతో దెబ్బలాడుకొని చావడం, కృష్ణరాజ్యం ట్రాజెడీ.

సూత్ర: ఒప్పుకున్నాం, ఒప్పుకున్నాం. ఇటీవలి 'దశావతారాలు' మొత్తం చూడలేక నిద్ర రావడం ట్రాజెడి అవడం కద్దు.

---

1. పరీక్షిత్తు జననంవైపు సంకేతం—అస్టు.

నాటకం: ఇంక నేనూ రాయసకాడను గదా. విజయనగర సామ్రాజ్యమో ట్రాజెడీ. మొగలుసామ్రాజ్యం ఇంకోటి. పీష్వా మరోటి. కర్నాటక ధర్మసామ్రాజ్యం అన్నింటినీ మించిన ట్రాజెడి.

సూత్ర: బడాయి చాలా కొట్టుకున్నావు. కాని 'చచ్చే ఆట'కు నవ్విపోసారు. ఇదీ ఓ ట్రాజెడీయే కదూ!

నాటక: కాకేమిటి? ఒక 'మొహం బొమ్మ' చూడు తెలుస్తుంది! ఇదిగో (చిత్రం చూపిస్తాడు) ఇల్లా చూస్తే నవ్వినట్లుగా, అల్లా చూస్తే ఏడ్చినట్లుగా. ఇల్లాంటిదే 'చచ్చే ఆట'.

సూత్ర: ఔనప్పా! ఇల్లాంటి ఇరకాటంలో బుద్ధినిరకజేసేది మరీ 'చచ్చే ఆట'.

[తెర పడుతుంది]

## పాత్ర పరిచయం :

శేషణ్ణ —— ఓ కాలేజీ విద్యార్థి

(ఈ ప్రహసనం ఏకపాత్ర ప్రధానమైంది; శేషణ్ణే ఆ పాత్ర - కాలేజీ ఫీజుకూ, పొట్టకూటికీ గతిలేక కూచున్న సమయంలో పండువచ్చి తనంతట తానే అతని చేతిలో పడ్డది. చేతికి చిక్కింది నోటికి చిక్కదనే పరాజయ ప్రవృత్తి కలవాడుకాదు శేషన్న. అంటే సాముద్రికుల ఆయుధాన్ని వంగినచ్చినవాళ్ళ తలమీద సునాయాసంగా ప్రయోగిస్తాడు. అల్లాగే సందర్భానికి పనికివచ్చే పదునైన నోటితో తన్ను తాను రక్షించుకొంటూ వుంటాడు. అతన్ని మినహాయిస్తే మిగతా పాత్రలన్నీ వార్ని వెనకతట్టున నిలబడేవే)

[జగన్నాథ పంతు, గౌడు, సాని మొదలైన ఇంకా మిగిలిన పదిమంది జనం]

# సాముద్రికుల సామ్రాజ్యం

## ఒకటో దృశ్యం

[ హుబ్బళ్లి[1] (Hubli) మునిసిపాల్టీ కచ్చేరీ తోటలో శేషన్న ఊరూరా తిరిగి చేతకాసు పీసంలేకుండా, జేబులో చివరికి మిగిలిన రెండణాలతో మురుకులు కొనుక్కొని తింటూ తోట మలుపులో కూచున్నాడు. అంచులు తీర్చిన మొద్దు ఖద్దరు బట్ట కట్టుకొని వున్నాడు. వేసికొన్నది ఒక, ఖాదీది, వదులు లాల్చి. టోపీ పెట్టుకొనే పద్ధతినే విరోధిస్తున్నట్లుగా వున్నా తల అంతా గోసాయిలలాగా పొడవైన వెంట్రుకలు పెరిగి వున్నాయి. పక్కగా ఒక దట్టమైన లావుతలగల కర్రవుంది. మాసిపోయిన ఖాదీ చొక్కా ధోతూలతో, కొద్దిపాటి అణగివున్న అతని వర్చస్సును, కర్ర, జుత్తు వెంట్రుకలూ, ప్రదీప్త మొనరిస్తున్నట్లున్నాయి. కాలిచెప్పుల్లోపడ్డ చిల్లులగుండా ఈవర్చస్సు వెలికి చిమ్మి ధారగట్టి కారిపోతుందేమోననే జంకుతో వాటిని కాళ్ళతో బలంగా అదిమిపెట్టి వుంచుతాడు. చేతిలోని మురుకుల రుచిలాగానే తుంపులూ సన్నగా అతుక్కొని వున్నాయి. ]

శేషన్న : తిరిగే బొంగరం ఎందాకా అని తిరుగుతుంది! జోరు తగ్గేటప్పటి కల్లా ఓ పక్కకు పడిపోతుంది! నా పరిస్థితి అల్లాగే వుంది. మరి ఈ మురుకుల్లో చివరి తుంపు అంటే మన బ్రతుకు బొంగరం చివరిచుట్టు అన్నమాటే! జేబులో వున్న చివరి రెండణాల మురుకులుకు మిగిలిన తుంపుల్లోని చివరి రెండు తుంపులు. ఏమైనా కానీ ఈ రెండు తుంపులు జేబులో వేస్తున్నా (అల్లాగే చేసి) ఇంకేమప్పా పని!

---

1. హుబ్బళ్ళి — హూవు + వళ్ళి = హుబ్బళ్ళి - హుబ్బళ్ళి 'పూలగ్రామం' — హుబ్లీ అని లోకవ్యవహారం.

చేతిలో ఓ కాగితం మిగిలింది. ఈ నూనెలో మునిగిన కాగితంతో ఏమిటి ప్రయోజనం? దీనికి అంటుకొన్న మసాలా నాకివేయడం మంచిది. సరే కాగితాన్ని పడవగాచేసి ఎవరికైనా పిల్లగాండ్రకు ఆడుకోడానికిస్తే మహా బాగుంటుంది. (అటూ ఇటూ విచ్చిన కళ్ళతో చూస్తూ) ఈ హుబ్బళ్లి మునిసిపాలిటీ తోట మహా అందంగా వుంది సుమా! సంజెపొద్దు అయిందో లేదో 'నావాడా' అని ఎంత మంది వచ్చి చేరారు! కుర్రగాళ్లు ఎంత కేరింతలుకొడ్తూ! ఆడుతున్నారు అయినా గుంపు దగ్గర ముష్టివాళ్ళ కేమికొరత! నేనీ మూలలో కూచోడం మంచిపని అయింది. మూలే జనంచేరితే ఏమిటి చేయడం! (మడిచిపెట్టిన కాగితాన్ని చేతితో సరిజేస్తూ) ఓసి దీని తస్సాచెక్కా! ఈ మురుకుల కాగితం ఆ ఫోర్తు రీడరుది! .... మా రొట్టి మాష్టారు చెప్తూ వుండేవారు గదూ! చాలా మజాచేస్తూ 'ది పాపర్ హూ బికేమ్ ఎ ప్రిన్స్' అని! అదేనప్పా యిది! పిల్లతనంలో ఇటువంటి కథ అంటేనే మజాగా వుండేది! ఒక బిచ్చగాడికి ముగ్గురు పిల్లలుండే వాళ్లట! వాడి ఆస్తి పంచుకొన్నప్పుడు చిట్టచివరివాడి వంతుకు ఓ చచ్చిన ఎలకపిల్ల వచ్చిందట! దాంతో వాడు రాజకుమారుడయ్యా డుట కాలాంతరంలో! నేనూ చూసారూ! మా నాయనకు మూడో పిల్లాడినే! అయితే మన పాలికి ఈ ముష్టివాడి శుభాశీర్వాదం వృథా అయిపోయింది. మా నాయన నాతోనూ అంటూవుండేవాడు 'నీ జాత కంలో దుడ్డు చాలా వుందిరా' అని. జాతకం అంటే బ్రతుకుకు ఎదురుగా నిలపెట్టి అద్దం అంటారు పెద్దలు! వొట్టిదికాదుసుమాండి! సరేగాని ఆ అద్దంలో వుండే దుడ్డు మనచేతిదాకా ఎట్లా వస్తుందా అనేదే ప్రశ్న. ఆ జ్యోతిష్కులూ! - నా కొడుకులు – మాటః ఎలా తూచి నట్టు మాట్లాడ్తా రనుకొంటున్నావ్! తా మేమో ముష్టిముండావాళ్లు జనం జాతకాల్లో దుడ్డు పారెయ్యకపోతే వీళ్ళ చేతుల్లో దుడ్డు ఎల్లా నిండి ప్రవహిస్తుంది మరి?

[అంతలో ఒక కొంటవతె అడుగుక్కోడానికై వస్తుంది ముష్టి కోసం వచ్చినా వేషం సాధారణమైన బిచ్చగత్తెకంటె బొగసు గానే వుంది!]

కొఱవతె: అప్పా! సామీ! ఉడిపి జాతరకు పోవాలని అడుక్కొంటున్నాను. బాబూ!

శేషన్న : ఉడిపి జాత్రకా! అల్లా అయితే కాస్త ముందుచూసుకొని మరిపో. అంతే మరేం లేదు. నలభైయ్యోపడి నువ్వూ దాటావు. నేనూ దాటేను మరి!

కొఱవతె : అల్లా అనరాదుసామీ! వేంకటరమణ దయవల్ల మీకు కల్యాణ మవుతుంది గాని ఓ రెండు కాసులు పడెయ్యండి బాబు.

శేష : కాసే! ఇంకోసారి అ మాటెత్తావంటే చాలు నేరుగా చెంప ఛెళ్ల అనిపిస్తాను చూడు! ఉడిపిదాకా లాభం చూసుకొని పోతూవుంటావ్! ముండకాన! జరుగు వెనక్కు; తే చెయ్యి తే! .... చేయిస్తే ఓ చెయ్యి చూసే విడుస్తా.

కొఱవతి : అయ్యో అప్పా! చేయి, చూడడానికి వస్తుందన్నమాట! శరణు వేడుతా. సామీ! నేను కొఱవంజిదాన్ని. శరణు చెప్పి వినిపిస్తా.

శేష : అరే ఏడో! తెలుగుదేశంనుంచి ఇటు కొట్టుకవచ్చినట్టుంది! మా ధార్వాడసీమ వచ్చి కన్నడం మాట దీని బుర్ర కెట్లా ఎక్కుతుంది?

కొఱవతె : నేనేం తెలుగుదేశందాన్ని అప్పా! మంది కర్నూలు సామి! అడంతా మన కన్నడం గుంపే.

శేష : అదిగాదే! కన్నడ కొరవంజి అయినా నా మాటలో. దాగున్న మర్మం తెలియడంలేదు నీకు మరి! అందుకే మనోళ్లు కర్ణాటక ఏకీకరణం కావాలంటారు చూడు! నువ్వు మా ధార్వాడసీమకు వచ్చిన మీంద ఎవడూ ఓ చెయ్యి చూసి నట్లు లేదింకా నిన్ను.

కొఱవతె : మీరే సూడండిసామీ! చెయ్యి చూసి నసీబు చెప్పావంటే నువ్వేమి విచ్చంపెట్టే ఊసెత్తక్కర్లేదు మరి- మరి నువ్వు చెప్పమంటే నేనూ రెండు శరణాలు1 చెప్పి వినివిస్తా (చేతులు చాచి) సామీ! నా చేతిలో ఉడిపియాత్ర వుందో! లేదో!

1. ఓచెయ్యి చూచుట — అనుభవించుట, భోగించుట అని లాక్షణికార్థం — అనువాదకుడు.

1. శరణము—కన్నడ భక్తిరచనా విశేషము. తెలుగు 'విన్నపా'ల్లాంటివి —అనువాదకుడు.

శేషన్న : టికెట్టు రొక్కం వుంటే ఆ బస్సు వాడిచేతిలో వుంది ఊడిపియాత్ర-పో యింక!

కొఱ : గీత సూసి సెప్పుసామి!

శేష : (ముందుకు చాచివుంచిన ఆమె చెయ్యి వెనక్కు తోసి) ఆ గీతల గీత నాకు తెలిస్తే ఈడ ఇలా కూకుంటానా నేను! ఎవళ్ల ఇంటికైనా పోయి పడ్డావంటే ఓ రెండు గీతలు పెరుగుతాయి కూడాను. ఊడిపికి పోయినమీంద సేతినిండా పైసా సిక్కుతుంది! నడు నడు ఇంక! (కొరవంజి సగం కోపంతో సణుగుకొంటూ పోతుంది) అబ్బా! ఆదేందో అంటారుగదూ! ముండకు ముండను చూస్తే తిన్నంత సంతోషమని! నేనే వొర్తి చేతుల్తో కూచొని, ఇంక ఇటువంటి ముష్టి వాళ్ళని చూస్తుంటే కొంచెం మనశ్శాంతిగా వుంటుంది. అయితే బిచ్చగాడికి మరితర బిచ్చగాళ్లను చూస్తే మాత్రం వొళ్ళంతా కంపర మెత్తి బరుక్కొన్నట్లొతుంది. [1]నాకూ అల్లాగే వుంది చెప్పొద్దూ!

(అంతలో ఒక పల్లెగౌడ చేతిలో అయిదు అరటిపళ్లగుత్తి పట్టుకొని భయభక్తులతో వస్తాడు.)

గౌడ : దొరా! శరణు సామీ! ఈ అరటిపళ్ళూ, మరి ఈ అయిదణాలు దచ్చినా! (చెయ్యి చాపుతూ అనుమానంతో కూడిన నవ్వుతో) సామీ! నాదీ ఓయింత చెయ్యిచూసి సెప్పండి సాములు! మా సెడ్డ సింతై పోతుంది పానానికి!

శేషన్న : ఏమంటావ్! ఆ అట్లనా! నీదీ ఓ చెయ్యి చూడాలా: నువ్వు ఇదంతా ఏమిటిచేసావు! ఈ పిళ్లెందుకు ఈ పైసాలెందుకు?

గౌడ : చాలా విసుగుపడ్తారేమి సామీ. మరి ఇప్పుడేగా ఆ ఆడకూతురి సెయ్యి సక్కంగ చూసి చెప్తుండారు సాములు! ఓళ్ళకోటి ఇంకోళ్ళ కోటి సాయరాదు ఆచారసాములు! ఇంకా దచ్చినకావాలంటే బదణా కాసులింకా ఇచ్చుకొంటా. (ఉత్తరయ్యం ముడినుంచి తీసి మరి బదణాలుంచుతాడు) ధార్వాడసంతకు నేను బుద్ధితక్కువోణ్ణి రెండు గిత్తల్ని అమ్మకం పెట్టాలని బైల్దేరాను బాబు! నిన్న రాత్రి ఈ హుబ్బళ్ళికటుపక్క 'తిరకరామనకేరి' దగ్గిర బసచేసాను సామీ!

1. యాచకో యాచకస్య శత్రుః - అని సంస్కృత లోకోక్తి —అను.

శేష: ఏమిటి కథ? 'తిరకరామనకేరా? ఓహో! ఈ హుబ్బళ్ళి జంక్షన్, ముష్టిముండాకొడుకుల జంక్షన్‌లా కనబడుతోందే! ఇక్కడి చెర్వుకూ ముష్టివాళ్ళపేరే పెట్టాలా! అట్లానా గౌడా! ఆ ముష్టివాళ్ల చెర్వులో వున్న తర్వాత ఇంక నా దగ్గిరకెందుకు రావడం? మొదటే పంచ నామా ఏర్పాటు చేసుకోడానికి వస్తివా? పోపో!

గౌడ: పంచనామా ఎందుకంఢి! ఇంకా చిక్కందే!

శేష: మూడు దినాలు గడిచినమీంద సిక్కుతాయి లేవయ్యా!

గౌడ: మూడురోజులు తర్వాత సిక్కుతాయా నా సామి! మీ నోటి దీవెన వల్ల నా గిత్తలు సిక్కాయంటే ఇంకో అయిదు రూపాయలు మీ పాదాల కడ పడేసాననుకో. సాములు మాచెడ్డ, సురుక్కుగా కానొస్తారు! సెయ్యి సూడకుండానే ఇంత సెప్పేసుండ్రు! సాముద్రికమంటే ఆ సాస్తరం మా దొడ్డది సాములు! మరి నా గిత్తలు సిక్కడం కాయమే గదూ!....? ఓ యింత గీతచూసి ఏమల్లా విస్తుపోయావు, ఏ రండ ముండాకొడుకు తీసుకపోయాడో సెప్పు సామీ! మీ మాట సత్తెమైతే, ఐదురూపాయలు కచ్చితంగా పారేస్తా! మా 'అదరగుంజెప్ప' యాత్రకై మిమ్మల్ని అదే గిత్తలుకట్టిన బండిమీద కూసోబెట్టుకపోతా. జాతరఅలా వుంచు సామీ! కోరినంత దచ్చిన .. మళ్లీ రూపాయి తెమ్మంటే నీ ముందు ఘల్లు మనిపిస్తా.

(పోతాడు)

శేష: (ఎదురుగావున్న పళ్లు, పైసా పరిశీలించి) మురుకుల కాగితం నాకడం మిగిలిపోయింది. అంతలో ఐదు అరటిపళ్ళూ, పదణాలు రొక్కం తమంత తాము నా ఎదుటికి వచ్చిపడ్డాయి. ఈ జనంతమంత తాము నాకు అంటగట్టిన వేషం, వేయకుండా గత్యంతరం కనబడడం లేదు. కానీ! చూద్దాం పడవ ఏ ఒడ్డుపట్టుతుందో! (గౌడ వెనక్కు తిరిగి రాగా) ఏం గౌడా! ఎందుకో! ఐదురూపాయలు మాట తప్పవు గదూ మరి!

గౌడ: పల్లె జనం గొంతుకోసినాసరే సామి! అబద్ధాలు సెప్పరు బాబూ! ఇప్పుడు నీ ముందు రెండే పనులు పెట్టా. ఇంకా నాలుగైదు సంగ

తులు అడగాల్సిన వున్నాయి! (ఐదు రూపాయలు తీసి ముందు పెడుతాడు)

శేషన్న : (అనుభవశాలియైన సాముద్రికునివలె నటిస్తూ) గౌడప్పా! ఎక్కడ! తే! చెయ్యి ఇక్కడే చూద్దాం! కూచోండి, సక్కంగ కూకోండి! ఏమీ అడ్డులేదు (అతని చెయ్యిపట్టుకొని కళ్ళుమూసి) ఓం, హ్రాం, హ్రీం, హ్రూం, మహాకాళీ, మహామాయా! భగవతీ! చాముండికే! గండభేరుండవాహనే! రుండమాలాధరే! పుండచండాటకే! ఓం హ్రాం, హ్రీం, హ్రూం .. కశ్చిత్కాంతా విరహగురుణా .. ప్రచండ సూర్య స్పృహణీయచంద్రమా! ఉత్కంఠాకంఠ కోలహల . 'కొందరు శక్తిశాలురు గూర్తురు కొందరు మత్తేభవిక్రీడితంబు! (కళ్లుతెఱచి)— మరేమయ్యా గౌడ! నీ గిత్త చూడు, పెద్ద వెడల్పైన వంకరకొమ్ముల్తి కాలిబందం వేసావు దానికి; ఔనా?

గౌడ : అవునవును సాములు! అచ్చరాలా నిజం సెప్పారు సాములు!

శేషన్న : ఓ కాలు మీదికుంటుంది; రంగు సామాన్యం బూది రంగు.

గౌడ : నిజం నిజం సాములు! ఓ వైపు తెలుపుతోడి నలుపు ఓ వైపు బూడిద రంగు నిజమే! రెండోదానికి పొట్టమీద ...

శేషన్న : గౌడప్పా! ప్రశ్న చెప్పేవాడిని నేనా నువ్వా! అంతదాకా కొంచెం సుమ్మా ఉంటావాలేదా? (చెయ్యి బాగా పరీక్షిస్తాడు)

గౌడ : అల్లాగే కానీ అప్పా! మీరే సెప్పుకోండి.

శేషన్న : పొట్టమీద వాత . వేస్తే – మచ్చ పడింది గదూ!

గౌడ : ఔనప్పా! వాతలు పెడితే మచ్చలు పడ్డాయి.

శేషన్న : నేను చెప్పానా లేదా మచ్చలు పడ్డాయని (ఇంతలోకి, మరి ఇద్దరు ముగ్గురు చుట్టూచేరి నిలుస్తారు, వాళ్ళను చూసి, కేకరించి ఎక్కువ గంభీర భావంతో – నిక్కి కూచుని) ఇదిగో గౌడ, అంతా గడగడా చెప్పేస్తున్నా. ఇంకా జనం వచ్చి పడుతున్నారు: అంతా మెల్లిగా వినుకో!

గౌడ : అల్లాగే సామీ!

శేషన్న : మీ ఊరుచూడన్నా. హంబ్బళ్ళికి దక్షిణం మూల. నీ గిత్తలు 'అక్కడినుంచి మొన్న పశ్చిమం మూలగా నేరబైల్దేరి పోయాయి. ఇప్పు

డవ్వి ఇక్కడినుంచి, రెండు మైళ్ళ దూరంలో ఉన్నాయి .... నీ వైరి మంచి తెలివైనవాడు. వాడు చేసినపని యిది! అయితే నా మాటమీద నమ్మిక ముంచప్పా! ఇంక మూడు రోజుల్లో గిత్తలు నీ వున్నచోటికి వాటంతటవి వచ్చేస్తాయి — నీ వైరి పూరా బజీమ అయిపోతాడు.

గౌడ : ఔననుకోండి; వాడైతే కూసునాగే ననుకోండి .... నా కెంతో గాత (నష్టం) చేసాడా మరి! ఎంతోటి పున్నెం గట్టుకొన్నారు సాములు! బంగారంలాంటి మాట సెప్పారు! గిత్తలు రెండు మైళ్ళలో పున్నాయా! అల్గా అయితే ఈడున్నవాడి నున్నట్లు వెతుక్కొనివస్తా. మీ మాట పున్నాన మీ రన్నట్లై కావాలి బాబూ! మరి! ఇంకో మాట! అడగనా మరి! మళ్ళీ .... (చుట్టూవున్న జనాన్ని చూసి అనుమా నిస్తూ) మీరు అడగమంటే అడుక్కొంటా.

శేషన్న : తెలిసిందప్పా నువ్వడగబోయేది. నీ చేతిలో అంతా నాకు సొట్టంగా కనబడ్తూనే వుంది. నువ్వడగాలనుకొనేది ఇంట్లోవాళ్ళను గురించి!

గౌడ : కండితంగా సాములు! పుట్టుపూరోత్తరాలు అన్నీ తెలిసినంత మట్టుకు చెప్పండి. ఇంత సంటి ఈడులోకూడా మీ అనుబం, గ్యానం మా దొడ్డవి! (కొంచెం దగ్గిరసా జరిగి) (అప్తాలోచన ధోరణిలో) సాములూ! మళ్ళీ ఏమంటే .. నేను ఎదకులాడి తెచ్చిన పెళ్ళాం బాబూ!

శేషన్న : ఔను. నేను చెప్పడం లేదూ! పెళ్ళాం మాటని! గౌడా! అటు వంటి మాటలకు మరి కొంచెం సేపు జమాయించి కూచోవాలి. తెలిసిందా? ఈ సంజెవేళ సరియైంది గాదు. నీ గిత్తల పని అయిం తర్వాత మళ్లీ చూద్దాం! చూడడం లేదా, ఇంకా ఎంతమంది కని పెట్టుకొని వున్నారో! (ఇంతలో మరింతమంది జనం గుంపుగా వస్తారు)

గౌడ : అల్లాగే కానీండి సాములు! పొద్దున్నే తెల్లవారు జాముల మంచి వేళ కదూ! మీరు సెప్పినట్లు, గిత్త దూడలు సిక్కితే ఊరికి తోలి మళ్లీ వస్తానప్పా! మీ నోరు మా సుద్దమైంది బాబు! దేవుడివే నువ్వు! (కాలు ముట్టికొని వంగి భక్తిగా నమస్కారం చేసి వెనక్కు తిరిగి వెళ్ళిపోతాడు. శేషన్న రొక్కం జేబులో వేసుకొని పళ్ళను

పక్కకు సర్దుకొంటాడు. ఇంతలో ఇంకా ఎక్కువగా జనం నేను ముందు నేను ముందంటూ తోసుకుంటూ వుంటారు)

శేషన్న : (ఆర్భాటంగా) ఏమ్రా! ఇదేం సంత అనుకొంటున్నార్రా! మీ వెర్రికాలా! ఇటు చూడండ్రా ఇటు! (చేతి ఐదు వేళ్లు చూపించి) తెలిసిందా లేదా? పంచ .... పంచ తెలిసిందా? (జనం గుద్దు లాడుకొంటూ వుండగా, ఓ బలిష్ఠమైన వాడు ముందుకు తోసుక వచ్చి, శేషన్న ఎదుట రొక్క ముంచుతాడు)

దృఢకాయుడు : ఎంతండి శాస్త్రిగారూ! ఐదణాలా! ఐదు రూపాయలా!

వేరొకడు : ఇవిగో తీసికోండి ఐదు రూపాయలు.

ఇంకోడు : నావి ఇవిగో ఐదు రూపాయలు!

దృఢ : ఏం మొదట వచ్చినాళ్లెవరో! నేను మాత్రం ఐదు రూపాయ లిచ్చుకోలేనా శాస్త్రుల్లు గారికి. జరగండి వెనక్కి. శాస్త్రులుగారూ! ఏమండోయి నే నీసారి లోకల్ బోర్డు కంట్రాక్టు తీసుకొంటున్నా ...

వేరొకడు : నే నీసారి పత్తివేసా—వానా? పైరు?

ఇంకోడు : నా గోవా లాటరీ సంగతి చెప్పాదురూ! ఆచార్యులుగారూ!

మరోడు : నా రేసు టిక్కట్టు .... నా పిల్లాడి పరీచ్చా

వేరొక్కడు : ఈ తడవ పుగాకు ధరవరలు ?

[ ఈ విధంగా మళ్లీ గందరగోళ మవుతూ వుంటుంది, ఓ పార్సి వాడు తన సారాయి వ్యాపారాన్ని గూర్చి, ఓ ముసల్మాను తమలపాకుల వ్యాపారం గురించి, ఓ సిపాయి జమాదారు అవ దాన్ని గురించి, చేతిలో డబ్బుపెడుతూ ప్రశ్నలడుగుతూ గుద్దు లాడుకొంటూ వుంటారు. దృఢకాయుడు లేచి నిలిచి అందర్నీ వెనక్కు నెట్టిపారేసి నిలుస్తాడు. పోలీసూ, ముందుకు వచ్చి జనాల్ని వెనక్కు నెట్టి నిలుస్తాడు. ]

శేషన్న : చూడప్పా! వినడం లేదా? ఈ సాముద్రిక మంటే అన్ని శాస్త్రాలలోకి గొప్పది. మీ రిల్లా గుద్దులాడుకొంటూ వుంటే, ఎవరి పనీ పూర్తిగాదు. మా ముఖ్య శిష్యులు కొంత మంది పిల్వనంపితే సరే

గదా అని ఈ ఊళ్లో నాల్గురోజులపాటు వుందామని వచ్చా. ఇప్పుడు సాయంకాల మైపోయింది. అంతా శాంతంగా వుండండి; ఇదేమి సినిమా టిక్కెట్లు ఇచ్చే కిటికీ అనుకుంటున్నారా ఏమిటి ? స్టేషనులో చూసారో లేదో; బుకింగ్ ఆఫీసు దగ్గిరలా, వరుసగా పంక్తిలో నిల బడివుండే దృశ్యం చూసి వుంటారుగా; ఆ విధంగా నిలబడండ్రా!

దృఢ :
సిపాయి : } బానాను; శాస్త్రుల వారి మాట మా బాగుంది; అందరూ వరుసగా నిలవండ్రా! జరగండి, జరగండి లైనుగా నిలుచుకోండి.

[చుట్టూ వున్న జనం లైనుగా నిలబడతారు. దృఢకాయుడు అందరికంటె ముందు తాను నిలబడి, జనం పంక్తిని వెనక్కునెట్టి రెండు చేతులు వెనక్కు చాచి, ఎవరూ ముందుకు రాకుండా కనిపెట్టి వుంటాడు. సిపాయి జనాన్ని సర్దుతూ వుంటాడు. ]

శేషన్న : ఏం సిపాయి! నీ పేరేమప్పా! ఆం! ఏమన్నావ్! బెంజామిన్ ఎలిజాన్ అనా....ఏమీ అడ్డు లేదు! ఈ జనాల్ని ఒక్కొక్కళ్ళి ఇక్కడికి పిలుచుకొని రా! ఎవరెవరు దక్షిణ ఇస్తారో వాళ్ళ పేరు నెంబరు వారిగా రాసుకో. (జనం వైపు తిరిగి) ఇప్పుడు చూసుకోండి. రాత్రి అవబోతోంది. అందరూ మీ మీ యోగ్యతకు దగ్గట్టుగా .. ఐదైదు....దక్షిణ పెట్టి పేరు రాయించి రేపు రెండు గంటల కిదే జాగాకు నెంబరు వారీగా రండి. తెలిసిందా లేదా! ఇంకా ఎవరైనా మరీ దరిద్రులుంటే ఐదుపైసలిచ్చినా చాలు, ఓ నమస్కారం పడేసినా చాలు. మాకేమీ దుడ్డే కావాలి అనే ఆశ ఏమీ లేదు; లేనే లేదర్రా! తెలిసింది గదూ! మా ఈ సర్వ శ్రేష్ఠమైన శాస్త్రంతో జనసేవ చేయడమే మాకు కావాల్సింది. రేపు వచ్చేటప్పుడు పండూ ఫలం, మీకు తోచింది చేతపుచ్చుకొని మరీ రండి! ఏం సరేనా ?

[దృఢకాయుడు మొదలైన వాళ్ళందరూ చెప్పినట్లే చేసి, సాముద్రిక శాస్త్రిర్లు "ఎంత మంచివారు" "ఎంత ప్రామాణికులు" "ఎంత స్వార్థత్యాగి" "ఎంత గుణవంతుడు" "ఎంత సత్యసంపన్నుడు" ఇత్యాదిగా పొగడుకొంటూ పోతారు. ]

సిపాయి : మాదేమంత పని....స్వాములు !

[ జేబులో చెయ్యి పెడుతాడు ]

శేష : నువ్వేమీ డబ్బు ఇచ్చే పనిలేదు; నువ్వు అడిగే ఏ ప్రశ్నకైనా సరే బరాబరిగా జవాబు చెప్తూ పోతాను. రేపు మధ్యాహ్నం. ఇప్పుడు చీకటి పడబోతోంది. ఏం? ప్రస్తుతానికి పదప్పా! రేపు చూసుకొందాం.

[చేరిన డబ్బులు జేబులో నింపుకొంటూ వుండగా తెర పడుతుంది]

## రెండో దృశ్యం

[హుబ్బళ్లి రాజవీధిలో శేషన్న మంచి ఇస్త్రీ చేసిన బట్ట కట్టుకొని పైన శాలువ కప్పుకొని, చేతిలో ఒక పుస్తకాల కట్ట పట్టుకొని, దీప్తి స్ఫూర్తులతో, ఉల్లాసంతో మహాఠీవిగా ప్రవేశిస్తాడు. ]

శేషన్న : సాముద్రిక మంటే ఇదేమీ సామాన్యం కాదనేది నాకూ నమ్మకం కుదిరింది. లేకపోతే ఐదు రోజుల్లో ఏభై రూపాయల ఐశ్వర్యం వస్తే మన అదృష్టంలో ఏమీ దోషం లేదు. ఆ మన 'అదరగుంచి' గౌడ ఐదో ఎక్కం బాగా వల్లె వేసాడు!

ఇప్పుడు అదరగుంచి యాత్రకు పోదామంటూ కలిసాడు. వాడి గిత్తలు రాత్రి పారిపోయి వచ్చి ఎవరి పొలంలోనో మేస్తున్నాయట! కొండవాడకు తోలారట! నిజానికి నా పుణ్యం వల్లనే గిత్తలు సిక్కాయట! దీవెనేలేమో దీవించాడు! అతని గిత్తలమూలాన మనకూ వ్యాపారం బాగా నడిచింది. చేతినిండా డబ్బు వచ్చింది. ఇందులో జన మందరిదీ తెల్వితక్కువతనం హెచ్చో, నాశాణాతనమే హెచ్చో నాకే తెలియకుండా పోయింది. జనాన్ని తెల్వితక్కువవాళ్ళని చెప్పి వాళ్ళందరికీ సామాజిక దోషాన్ని అంటగట్టడంకంటె, నా తెల్వి చేటలే గొప్పవని తెలుసుకోవడం సమయోచితంగా కనుస్తోంది ఎందుకంటే జనమేమో అంటూనే వున్నారు; నాకేమో ఫాయిదాకానే అయింది! మరి నేను తెల్విగలవాడనని నేనే తెలుసుకోలేకపోతే ఎట్లా?

జగత్తులో ఆత్మవిశ్వాసం లేకపోవడంచేతనే, సగంమంది జనం 'పనికిరాని పెద్దన్నయ్యా' లౌతారు. ఇంటరు ప్యాసై ఓ కాలేజి స్కాలరు షిప్పు కొట్టామంటే బి.ఏ; ఎం. ఏ. రెండు పట్టాలూ చేతికొస్తాయని లెక్కవేసికొన్నా, నిజమే. కాని అయితే నామీద నాకే విశ్వాసం కుదరలేదు. ఆపైన ఈ రెండో టర్మ్, రొక్కం లేకపోవడంలో చక్కా పోయింది. ఇప్పుడు ఈ వైపు డబ్బుసంచి నిండిపోతూవుంటే, ఆ వైపు నుంచి ఆత్మవిశ్వాసమనే ఆకాశంబుట్టేమో నిండిపోతూ వుంటుంది బంగారం పొగతో! దుడ్డంటావా సగం ఆత్మపదార్థమని, అనిపించు కోడానికి అర్హత సంపాదించుకుందీ రోజుల్లో.

గౌడ : (ప్రవేశించి) శరణు శరణు సాములు! గిత్తలు రెండూ విడి పించుకొని వచ్చా, ఇరవై రూపాయలు జల్మానా చెల్లించి, మీ నోటి మాట పున్నెమా అని అంతా మీరు సెప్పినట్లే అయింది .... మరి .... నా కట్టుకొన్న పెళ్లాం మాటా ....

శేషన్న : నడిబజారులోనా, ఆమాట తెచ్చేది? నేను మీ 'అదరగుంచి'కి వస్తున్నాగా .... ఏం మించుకుపోయింది.

గౌడ : మాటగట్టి నంటారా! పున్నమికి పిలవడానికి వస్తా మళ్లీ గాడి కట్టుకొని. వెళ్ళివద్దాం అల్లాగేనా! శరణు సామీ! (వెళ్లుతాడు)

శేషన్న : (మాట్లాడకుండా గౌడుని కనుసన్నతోనే పోయిరమ్మనమని చెప్పి పంపిన తర్వాత) ఊం! ఇప్పుడు శ్రీగ జనార్ధనుని వనితావస్తు భాండారానికి వెళ్లేవేళ అయింది. ఇన్ని రోజులూ, ఈ గ్రంథం మోయడంతో తల దిమ్మెపోయింది. ఇప్పుడు పొద్దు గడవడమంటే లేతకాళ్ళ గుర్రాన్ని ఎక్కినట్లే అయింది – పెద్ద పెద్ద ఆఫీసర్లకంటె మన రైంకు కిమ్మత్తు ఎక్కువ. ఎందుకంటే ఇప్పుడు ఆ మంచి మంచి ఆఫీసర్లు అనేవాళ్ళు నా చేతిలో లాభం పొందడానికి చేరు తున్నారు. ఈ ఊరి కలెక్టరు, ఇంటికి పిలిపించాడు. కేశవలాల్ మార్వాడీ, ఇంపీరియల్ బ్యాంకు చెక్కు ఇరవై రూపాయల దానితో బాటు ఈ శాలువా కూడా ఇచ్చాడు. మొదటి మూడు రోజులూ, మ్యునిసిపాల్టీ తోటలో ఉన్నప్పుడంటే అక్కడే జనం యాత్రకు చేరి నట్లు చేరేవాళ్లు. చీఫ్ ఆఫీసరుది చెయ్యి చూడనే చూసా. మరి మునిసి

పాలిటే మనదిలా అయిపోయింది. అంతలో ఉడుపీ సీనప్ప "మా హోటలుకు రండి; ఉండటానికి భోజనానికి మొత్తం ఏర్పాటంతా చేసాను" అని కలుసుకొని పిలుచుక చక్కాపోయాడు. అంతా ఊరికేనే అనుకొని "లేచాడు జోగీ అంటే భుజాలమీద లేడిచర్మం అన్నట్లు బైల్దేరాను. కాని అయితే "సెట్టి దిగినచోటే పట్టణం" అని చెప్పినట్లు హోటలు సీనప్ప మా 'హరామీ' గాడు. తనకు డబ్బు దస్కం ఖర్చు లేకుండా, ఊరికే అడ్వర్టైజుమెంటు కానీమని, ఎత్తు ఎత్తాడు. నేను వెళ్ళినప్పటిమంచీ, అతని హోటలు, అడిగారూ — చీమల పుట్టల్లే అయిపోయింది. ఓహో ఇతనా! స్మరించేటప్పటికల్లా ఈ జనార్దన పంతు లిటుప్రక్కకే వచ్చిపడుతున్నాడే! (అతను రాగానే) మరేం పంతులూ! జోరుగా బైల్దేరారు! నేనూ వస్తూనే ఉంటినిగా అంగడీవైపు.

పంతు: ఓహో శాస్త్రుల్లు వారా? రండి రండి వేగంగా. నేనూ మీ దరిశెనం కోసమే బైల్దేరా. ఇవ్వాళ ఓ అసలు సిసలు గిరాకి తెస్తిని మీ దర్శనానికి. ఇదే ఇప్పుడు ఆ ఆకాశం రంగు కారు పోయిందే చూడలేదా? హాఁ! అదే చూడండి! అటువైపు చూడండి. కారు మా అంగడిముందే నిలబడ్డాది. నేను కొంచెం ముందుపోతా. మీరూ లగెత్తుకొని రాండి. ఏం! (తొందర తొందరగా పోతాడు)

శేషన్న: ఈ పంతులుపెట్టె ముందంగ ఆకాశాన్ని అంటేటట్టు కాన వచ్చింది. నేను సీనప్ప హోటల్లులో ఉండడం చూసే ఈ కొంటె, లెక్కవేసి వుంటాడు. ఈయన అన్నాడుగా ఉదయం పూట మూడు గంటలు హోటల్లో ఉన్నారుగా: సాయంకాలం రెండు గంటలు మన వనితా వస్తు భాండారానికి రాండి, నేను కుర్చీ, టేబిలు, సోఫా, కోచి అన్నీ ఏర్పాటు చేస్తా" అని. ఈ రెండు రోజులూ ఆ పెటీకోటు వనితా వస్తు భాండారంలో ఓ గంటసేపు కూచుంటే, ఆడోళ్లు గుంపులు గుంపులుగా వచ్చేస్తారు! అదో స్పెషలు జనానా మ్యాటినీ లాగుంటుంది! నే నొక్కొక్కళ్లకు చేయిచూసేదాకా అంటే, జనార్దనం పంతులు తమ అంగడి సాగిస్తూ వుంటారు. అల్లాగే మరి! "పర

1. "లేటికి లేచింది ప్రయాణం" అని తెలుగు సామెత.

స్వరం భావయంతః'' అనిగదా నడుస్తుంది వ్యవహారం! వ్యాపారం బాగా నడిస్తే కమిషన్ వేరే ఇస్తానంటాడు పంతులు. పొద్దునపూట హోటల్లో సాయంకాలం పూట ఈ అంగడిలోనని అనుకొంటుంటే నిన్నటినుండే, 'వంటమురి' వకీలుగారి సిఫార్సుతో మధ్యాహ్నం రెండుగంటలసేపు బార్ రూముకు వెళ్లాల్సిన పనికూడా పట్టింది. నిన్న ఈపొద్దుకంటే బార్ రూములోనే మరో యాభై రూపాయలు కలిసివచ్చాయి. ఈ విధంగా సమయం మన చేతిలోకి రెక్కలు గట్టు కొని వస్తోంది. ఈ పొద్దు ఈ జనార్దన పంతులు చెప్పి పంపాడు "ఓ అరగంట పెందరాడి రండి, ప్రత్యేకమైన గిరాకి తగుల్తుంది" అని. అందుకే బారు రూము పని ఆవతలకునెట్టి బైల్దేరాను. అటు వంటి నిఖార్సు మనుషులుంటే మొత్తం ఓటరం ఫీజు కొట్టేసానన్న మాటే. అంటే మిగతా నూరు రూపాయలు ఈటరం ఖర్చుకు జనార్దన పంతులు కమిషను ఇస్తే పరీక్ష ఫీజు వచ్చేసినట్లే! కావా లంటే ఈసారి బొంబాయి సెంటరు పెట్టినా పెట్టవచ్చు. ఆపైని ఎం. ఏ; పి హెచ్ డి కావలిస్తే ఇంగ్లాండు దేశానికే వెళ్ళిరావచ్చు. కానీ! ప్రస్తుతం వనితా వస్తు భాండారానికి పోదాం. మూడు కొట్టింది. జనార్దనం పంతులు దారిచూస్తూ వుంటాడు! (వెళ్తాడు - తెరలేస్తుంది - రంగస్థలం ఓ ప్రక్కకు జనార్దన పంతు అంగడి భాగం. ఇంకో ప్రక్క సాముద్రికుల ఆస్థానం. టేబిలు కుర్చీ, చుట్టూ సోఫా ఇత్యాదులు పెట్టబడి వున్నాయి. పైన ఎలక్ట్రిక్కు ఫాను తిరుగుతూ వుంది సోఫా మీద ఒక్క అందమైన యువతి కూచుని వుంది. వెనకపక్క జనార్దనం పంతులు బీరువాలో సామాను సర్దుతూ వున్నాడు. ఇంతలోకి శేషన్న వచ్చిచేరాడు.)

శేషన్న : బైట 1943 మోడల్ ఫోర్డు కారు నిలబడి వుండటం చూస్తే ఈ పొద్దు గిరాకి బాగా హైక్లాసుది వుండి వుండొచ్చు - (తిరిగి యువతిని చూసి, వెంటనే ఆగి) ఈ జరీ చీరె డాబు చూస్తే మన కబురు అందే జాడే కనబడడం లేదు ఊం! (కనుబొమలు పైకెత్తును)

పంతు : (ఇంతలోకి ముందుకు వచ్చి) ఏం మహానుభావా! మీ దారి చూసి చూసి కళ్లు, కాయలు కాచాయనుకోండి. అటు చూడండి ఎవరు

వచ్చారో! మా హుబ్బళ్ళిలో కెల్లా పెద్దతలకాయ ఈ హనుమాసాని!
(యువతి చిర్నవ్వుతో వయ్యారం వొలకబోస్తుంది.)

శేషన్న : ఓహ్హో! ఆ బాలబ్రహ్మచారి పేరు పెట్టుకొన్నదా ఈసాని! సరి సరి! లక్ష్మీ హేర్ కటింగు సెలూను అన్నట్లుంది! ఈ సాముద్రిక సాగరంలో ఈదులాడే మన పడవ చుక్కాని ఇల్లాగే తికుగుతుందో యేమో! సరే కానీ! చూసుకొందాంలే (ముందుకు వచ్చి తన కుర్చీలో కూచుని పుస్తకాల కట్ట విప్పుతాడు. యువతి సర్దుకొని కూచుంటుంది. పంతులు తిరిగి తన పనిమీద చక్కాపోతాడు.)

పంతు : హనుమాసానికి, దేవతలూ, బ్రాహ్మలూ, సాముద్రికం, జ్యోతిషం అంటే చాలా నమ్మకం. మనమీదా ఆమెకు వుంది పూరా మర్జీ – అమెకంతా భవిష్యత్తు విప్పిచెప్పండి ఏం! (కొంటె నవ్వు నవ్వుతూ తన పనివైపు బోతాడు)

శేషన్న : మరోమాటా! నీకేమి కావాలి? ప్రశ్న అడుగుతావా? పొద్దు సమయం వీనిమీద లెక్కగట్టి చెప్పమంటావా? ముఖకవళికలు చూసి చెప్పేదా?

సాని : ముఖకవళికలు చూస్తే చూడండి; (ముందుకు ముఖం పెట్టి నవ్వు విసురుతుంది) మళ్లీ చేయిచూస్తారుగా ఇదిగో పట్టుకోండి! (జరిగి జరిగి ఒయ్యారంగా మరీ దగ్గరగా వచ్చి కూచుంటుంది.)

శేషన్న : (ఆమె ఇంగితాన్ని తెలుసుకొని, చిటికెన వ్రేలితో ఆమె చేయి పట్టుకొని) 'ఆహా! .... ఉండనీ. ఏమీ అడ్డిలేదు. నీ మనసులో చాలా రోజుల్నుంచి, మాట పెట్టుకొని కూచున్నావ్. అయితే ఆ స్థితిలో కాయంగా ఏమైనా ఏర్పాటు చేసుకోవచ్చా అని?

సాని : (తన ఇంగితాన్ని ప్రకటనరుస్తున్నట్లు నవ్వి) ఔనండి!

శేషన్న : నీ పనికి దుడ్డు చాలా పడుతుంది.

సాని : కానీండి; ఏమీ అడ్డులేదు. మరి ముందు ఫాయిదా అవుతుందిగా! ఇదిగో ఈ ఉంగరం మీకు దక్షిణ ఇస్తున్నా. (ఉంగరం ఇవ్వబోతుంది.)

శేషన్న : ముందు లాభం వచ్చే గీత ఇంకా సూటిగా పీర్పడలా, అయితే, మేము ఉంగరం, గింగిరం తీసుకునే వాళ్ళం కాము - మాకు కావాల్సింది నగదు రొక్కం.

సాని : అల్లాగే కానీండి. ఇంటికిపోయి పంపించేస్తా (ఉంగరం తిరిగి తీసుకొంటుంది.)

శేషన్న : మరి నీ వొకరిమీద కన్నేసి వున్నావు ?

సాని : అదికూడా చెప్పడమెందుకండి ? (అతని కళ్ళల్లో కళ్ళుపెట్టి వ్యథ చిత్తురా లౌతుంది.)

శేషన్న : అయితే ఆయనమీద ఇప్పుడో దొడ్డదెబ్బ వచ్చిపడింది.

సాని : ఎటువంటి దెబ్బ వచ్చినా, నేను ఆయన్ను విడిపించుకొంటాను లెండి !

శేషన్న : అయితే అయన నీ చేతికి చిక్కేఘటం కాదు. నీ చెయ్యే ఆయన చేతికి చిక్కిపోతుంది (ఇద్దరూ సాభిప్రాయంగా నవ్వుకొంటారు) ఇప్పట్లో నీ మీద శనిదృష్టి పడివుంది. దానికి పరిహారం చేసుకొంటేనే గాని, ముందు నీ పని కలిసరాదు మరి !

సాని : దానికి ఇంకా ఎన్నాళ్లు పట్టుతుంది ?

శేషన్న : నీ పేరేమిటి మరి ?

సాని : హనుమాసానండి.

శేషన్న : హ ..... ని .... సా .... మా .... ఉత్తరాషాఢ నక్షత్రం, ప్రథమ చరణం (గుణించినట్లు నటించి) ఇంకా ఓ నెల పోవాలి; అందాకా కేశవాపురంలోని హనుమప్పదేవరకు మొక్కుకో ! ఇంకా ఏమి కావాలి ? సాయంకాలం లోపల దక్షిణ పంపించివేయి ! సరేనా ?

సాని : ఔను అల్లాగే నండి. కానైతే ఓసారి, మా ఇంటికి దయచేసారా అంటే బాగుంటుంది. మీరు సెలవిస్తే కారు పంపిస్తా. మా చెల్లెలు కూడా ఓ అమ్మాయి వుంది. చాలా అందమైన పిల్ల. ఆమెను సినిమా పనికి పిలుస్తున్నారు. మరి ఆమెనుకూడా ఓసారి మీకంట పడవేద్దామని వుంది.

శేషన్న : చాలా సర్వోత్తమమైన అభిప్రాయం మీది! అయితే నీ మీద శని దృష్టి వున్నంతకాలం, నేను రావడానికి వీల్లేదు. మాకూ నీకు గృహ దోషం వుంది.

సాని : మీ చేతిలో సాముద్రికం, జ్యోతిషం రెండూ వుంటూవుంటే ఏ గరహం మాత్రం ఏంది చేస్తుంది? నా మనస్సు కిప్పుడే తట్టింది .. మా సందులో మాదే ఓ ఖాళీ ఇల్లు వుంది. నడివీధిలో నలుగురూ వచ్చేపోయే చోట! దాన్నే మీకు ఇచ్చేటట్లు చూస్తా. అది నాల్గు బజారులు కలిసే చోటు. ఇహ చూసుకోండి. మీ సాస్తరం అక్కడ బాగా నడుస్తుంది. మీరింకా పడుచు వయస్సు వాళ్లు. మా సందులో మీకు ఏవిధంగా చూసినా లాభమే లాభమనుకోండి.

శేషన్న : (మెడ త్రిప్పుతూ) ఔనౌను. అందరూ తమ తమ వ్యాపారాలు చూసుకోవాలా అక్కర్లేదా! అయితే అయిందిగాని, నీమీద శనిదృష్టి తొలగిపోనీ, ఆమీద వస్తాను. ఇప్పుడు ఈ వీధిలోనే కావాల్సినంత పని పడివుంది. మా జనార్దనం పంతులు విడిచిపెట్టాలిగా ఇంతకూ!

పంతులు : (నిద్రతో తూగుతున్నవాడు హఠాత్తుగా లేచి) ఔనౌ శాస్తుర్లు వారూ! మా అంగడి వదలిపెట్టి వెళ్ళడానికి వీల్లేదండి అరునూరైనా!

సాని : చూసారా మరి! మీ రన్నట్లు అందరూ తమతమ వ్యాపారాలే చూసుకుంటారు! (కళ్లుపెట్టి ఇద్దర్నీ చూస్తుంది.)

శేషన్న : ఔను! ప్రపంచ వ్యవహారమే అటువంటిది! కానీలే; ఇప్పుడు మళ్ళీ వేరే జనం వచ్చేవేళ అయింది; మీకు మునిమాపు ఎటు వంటిదో మాకు మధ్యాహ్నం అటువంటిది!

సాని : ఆ మునిమాపువేళ రావాల్సినవాళ్లు రాకపోతే మాపని మధ్యాహ్నమే అవుతుంది!

శేషన్న : నే చెప్పానుగా హనమప్ప దేవరను వేడుకోమని. అల్లా చేసి చూడు. మళ్లారా. ఇప్పటికి వెళ్లు. (ఆమె మెల్లిగా లేచి ఒయ్యారంగా వెళ్ళిపోతుంది.)

పంతులు : (ఆవిడ వెళ్ళడం చూచి) ఎల్లాగుంది గిరాకి? ఈ ఊరిలోకంతా ఘంటి ఘటికురాలు అంటే ఈమే! ఇటువంటిది మీ చేతిలోపడిందా

అంటే అన్నివిధాలా లాభమే లాభం! ఎందుకంటే .. హ్హా: హ్హా: (నవ్వుతాడు) ఏం శాస్తుర్లువారూ? గడబిడగా లేస్తున్నారు?

శేషన్న : ఔను. బార్ రూముకు వెళ్లాల్సి వుంది. ఈ ప్రొద్దు ధార్వాడ నుంచి జడ్జి దొరవారు వస్తున్నారుట. వారిది కూడా చెయ్యి చూడాల్సి వుంది. మీరు మరి మరీ కబురు చేసారని వచ్చా—

పంతులు : మరి సామాను అంతా జాగ్రత్తగా కట్టుకొన్నారుగా! ఆ సాని వీధికి మాత్రం పోకండి ఏం! (అతడు పోతూ వుండగా) తుళ్ళీ రాండి! మీ రిక్కడ వున్నంతసేపూ, మా వ్యాపారం దివ్యంగా సాగుతూ వుంటుంది. (శేషన్న ముందుకు రాగా మధ్యలోని తెర పడుతుంది)

శేషన్న : సముద్రంలోని చిన్న పురుగూ, పుట్రా తిండానికి చేపపిల్ల లుంటాయిట. ఆ చేపల్ని తినడానికి తిమి చేప లుంటాయిట! మరి వాటిని తిండానికి తిమింగిలాలుంటాయిట! మరి ఆ తిమింగిలాల్ని తిండానికి తిమింగిలగిలగిలలూ వుంటాయిట – ఇది విన్నమాట సుమండీ! కాని, సంఘంలో మాత్రం, ఇవన్నీ గిలాలూ ఉంటాయనేది ఇక్కడీ పొద్దు బైటపడింది. అందరినీ, జేబులో వేసుకోడానికిగా, సాముద్రికం చెబుతానని వెల్లడించుకొంటున్నా. కాని నన్ను చంకలో పెట్టుకోడానికి ఈ పంతులు వేసిన పంథా. మమ్మల్ని ఇద్దరినీ బురుడీ కొట్టిద్దామని ఆ సానికూతురు .. తిమింగిలంలా .... వచ్చింది. ఇంకా ఆలస్యం చేస్తే ఈ సాముద్రిక సముద్రంలో, నేనే మునిగి చక్కాపోతాను. లేక ఈ హనుమాసాని ఈ సముద్రాన్ని దూకినా దూకేస్తుంది! నేను కాలేజి విద్యార్థిని, చేతిలో మూటలేకపోయినా, కుంటుతూ, కునుకు పాట్లు పడుతూ అల్లాగే ఇంటర్ దాకా దేకాను. ఇప్పుడంటారా చేతిలో నాల్గు పిక్కలు చేరాయి చాలు! అల్లాకాకుండా ఈ బ్రహ్మ ముడిలో[1] పడడం బాగోదు. ఈ వేషం ఇహచాలు. నేను సాదా ఖద్దరు మనిషిని. ఈ శాలువా, దుప్పట్లు ఇవన్నీ ఎందుకు? (అవన్నీ తీసి పారేస్తాడు) అయితే; ఇది మాత్రం నిజం! ఈ సాముద్రికమే నన్ను

1. బ్రహ్మముడి — విడదీయరాని బంధం,

ప్రదికించిందనడం అబద్ధం కాదు. దీన్ని ఎమర్జెన్సీ పావరు అనే అంపకాదిలో పెట్టి వుంచితే, ముం దెప్పుడైనా అవసరమైతే పనికి వస్తుంది. ఇంకా విదేశాలకి వెళ్ళాలనే కోరికోటి పుడుతోంది ఈ సాముద్రికం సాధించింది మొదలు. అన్నట్లు, ఈ కళను నేనెట్లా సాధించాననుకొంటున్నారు! అనుభవంలేని వ్యవహారం గలిసిరాదు! అయితే నేను ఆటలాడుతూ, హేలగా సాముద్రిక శాస్త్రజ్ఞుణ్ణి అయి కూచున్నా. నోరు మూలధనం కాకుంటే మరేం మూలధనమున్నా విం లాభంలేదు. జనం చెప్పేమాటకంటె ఓ అడుగు ముందే వుండడం నేర్చుకుంటే చాలు, సాముద్రిక సిద్ధి పొందినట్లే. ఇంక మాట తప్పి పోతే పంచభవతి, పంచ నభవతి అనే డి. ఐ. ఆర్. నియమంలా చెబితే సరిపోతుంది. దానికీ మించి, మీదికి వస్తే 'వచ్చిన వేళ మంచిది కాదు .... లేక .... శనిగాడు కుజుడితో కూడివున్నాడు' అని స్పెషల్ ఆర్డినెన్సు జారీచేస్తే సరిపోతుంది! అయితే ఓ మాట మాత్రం నిజం. ఈ సాముద్రికులు అంటే మనస్తత్వ శాస్త్రజ్ఞులే అని చెప్పాల్సి వుంటుంది. అందుకే ఒక్కొక్కసారి అనిపిస్తుంది నాకు — ఎం. ఏ లో సైకాలజీ తీసుకోవాలని. దానికి మొదలు ఇంటరు దాటితే గదా బి. ఏ. ఎం. ఏలు! ఆపైని టైం బారవుతుందంటే ఆ ప్రిన్సి పాలు పీనుగుకు ఈటరమ్ "ఫీ" మొహాన పడేస్తా! పేరు తీసేసా మని బెదిరిస్తాడు కాబోలు! ఇదిగో ఆ ముసుకుల నూనె అంటుకున్న కాగితం ఇంకా పెట్టుకొనే వున్నా. ఇదే మన పర్సు, ఇందులోనే రొక్కమంతా చేర్చివుంచా. పైన ఇవిగో రెండు ముసుకుల ఎండి పోయిన తుంటలు. వీటినీ ఉండనీ మంత్రాక్షతలులా (జేబులోంచి నూనె కాగితం తీసి రెండు చేతుల్తోనూ సరిజేసి, దానిలో, రూపాయల్ను చుట్టి పొట్లంగా చేస్తుంటే తెరపడుతుంది.)

[ ముగిసింది ]

పాత్రల పరిచయం :

| | | |
|---|---|---|
| బుక్కరాయలు | — | ఆనెగొంది సంస్థానం రాజు |
| చలువ రంగారాయలు | — | కుమారుడు |
| వీరభద్రనాయకుడు | — | సేనా నాయకుడు |
| లింగణ్ణ మంత్రి | — | అమాత్యుడు |
| చన్న నాయకుడు | — | కిరాత నాయకుడు |

# అనుగ్రహం

[ ఆనెగొంది రాజుల సభా మందిరం. ప్రధాన స్థానంలో ఎత్తయిన రత్న సింహాసనం మెరిసిపోతూవుంది. అటువైపు ఇటువైపు మంత్రిగారి ఆసనమూ, సేనానాయకుని ఆసనమూ వున్నాయి. సింహాసనానికి కుడివైపు, సామంత నృపులకూ, ఎడమవైపు రాజకీయాధికారులకు, ఉచితాసనము లమర్చబడి వున్నాయి. భిత్తికల పైభాగాన కన్నడ సంస్కృతియొక్క మాహాత్మ్యాన్ని వెల్లడించే కొన్ని చిత్రాలు చిత్రితాలై వున్నాయి సింహాసనం పైభాగాన విద్యారణ్యస్వాములవారి ధ్యాన ముద్రలో గూడిన చిత్ర మొకటి కనులవిందు చేస్తూవుంది. తెర పైకిలేస్తూవుండగానే లింగనమంత్రి, సేనానాయకుడైన వీరభద్రుడూ పరస్పరంమాటాడుకుంటూ వస్తారు. లింగన మంత్రిది అపర వయస్సు. కాని వింటి నారి లాంటి చేవదేరిన శరీర యష్టి. శుభ్రంగా, నిరాడంబరంగా వున్న తెల్లని ఉడుపులు ధరించి కటిభాగంలో రత్నఖచితమైన ఖడ్గాన్ని ధరించి వుంటాడు. సేనానాయకుని వయస్సు 40 దాకా వుండవచ్చు. ఎత్తయిన వ్యక్తిత్వం, దృఢమైన శరీర యష్టి, దేహభారంచేత ఏనుగులా తూగాడుతూ, నడిచే అతని నడకతీరు, కంఠంలో మెరిసే ముత్యాల సరం; చాలా విలువైన వస్త్రాలు ధరించాడు ముఖంమీద ఎడమకంటి దగ్గరలో కపోలం సగం చీల్చుకొని పోయినట్లుగా వున్న కత్తివేటు గురుతు కనబడుతూ వుంది. ]

లింగన్న: (యోచిస్తూ) ఈనాటికీ చిక్కరాయల సమాచారం ఏమీ తెలిసింది కాదు.

వీర : అయితే ఇహ ముందు గతి?

లింగన్న : మహారాజులుంగారి హృదయాందోళన చెప్పడానికి వీల్లేదు. మూడు నెలలనుండీ ఒకేతీరున అన్నాహారాల్ని వదలిపెట్టి, కుమారునికై అటమటిస్తున్నారు.

వీర : ఈ ప్రొద్దు ఎందుకుగా సభను పిలిపించారు.

లిం : మంచి చెడ్డల్ని చర్చించడానికి గానని తోస్తూవుంది. సేనాపతీ! మీవంటి అరితేరిన యుద్ధవీరులు సంస్థానంలో వున్నా యువరాజులు ఆ ముసలి సింహాన్ని వేటాడడానికి వెళ్ళవలసి వచ్చింది.

వీర : నా ఓటమి మీ సంతోషానికి ప్రేరకమైంది కదూ! మంత్రిగారూ! ప్రభువుల సేవలో జీవితాన్ని వెచ్చించి, మలెనాటి పాళయగాండ్ర బిరాలన్ని వీటబుచ్చింది, ఇంతలోనే మఱచిపోయారు కాబోలు. నడిచే వానికి ఎవనికీ జారుపాటులుండవు గనుక! కూర్చొని రాచకార్యాలు నిర్వహించడ మేమంత కష్టమైన పనికాదు. కాని కత్తి చేబట్టి రణకేళికై నిలిచినప్పుడు కదా క్షాత్రధర్మ నిర్వహణమందలి గుట్టు మట్టులు బైటపడేది?

లింగ : దండనాయకా! నాకు వయస్సు పడమటి పొద్దుకు తిరిగింది గదా అని మనస్సుకు తోచినట్లు ప్రేలుతున్నారా? మాకుగల సాహస శౌర్య ధైర్యాలు మీకేమి ఎఱుక? మీ మెప్పుదలకై మేము మా క్షాత్ర రహస్యాన్ని ప్రదర్శింపవలసింది లేదు. మేం, మాదీ, అనేదంతా 'రత్న సింహాసన' సేవకేగాక, బైటి ఆడంబరానికి కాదు. మన మెంతటి వాళ్ళం! కాని రాజ్యానికి భవిష్యత్ప్రభువులైన యువరాజుగారిని, మృత్యుదంష్ట్రికలముందు పడద్రోసి, మనం నేడు మన బలాబలాల్ని గురించి తర్కించుకుంటూ కూచున్నాం (కంపిస్తూ) ఈ ముదుసలిని ఒక్కసారి లెస్సగా కన్నెత్తి చూడు సేనాపతీ! (కత్తిని ఒఱనుండి దూసి) క్షాత్రధర్మంలోని అంతస్సారం బైటపడిందికదూ! సంస్థాన సేవ పేరెత్తితే చాలు, ఎంతటి తారుణ్యం పొంగివస్తుందో, చూసారా? (కత్తిని ఒఱకాన్చి) ఆ పరుషవాక్యాల్ని దూరంగా పెట్టండి. మనలో మనకు పోరెందుకు? స్వయూథ కలహమేగా! కులానికి దేశానికి కుఠారంలా దెబ్బతీస్తుంది?

వీర : (మోకరించి నమస్కరించి) తప్పైంది మంత్రివర్యా! మిథ్యా జ్ఞానంచే నేనాడిన మాటల్ని క్షమించండి. నలభై వేల సైన్యంతో దండెత్తి వెళ్ళినా, ఆ బోయవాని తలవెంట్రుకకైనా వంచలేకపోయాం. ఇది నా మిథ్యాదంభానికైన భంగపాటుగా కనవస్తుంది.

లింగ . చింతించకండి. సేనాపతీ! పంపా ప్రభువుల అనుగ్రహం వచ్చే వరకూ మనం ఏం చేయడానికౌతుంది? కాని ఇప్పుడు మహారాజులుం గారిని సమాధానపటిచే విధం ఏమిటో! వారికి దుఃఖం, బుద్ధి విభ్ర మణం కలుగజేస్తూ వుంది. ప్రాణప్రదంగా చూసుకునే యువరాజు గారిని, ప్రభు ధర్మానుగుణంగా యుద్ధభూమికి పంపించారు. కానైతే ఇప్పుడు, పుత్రప్రేమ వారి ప్రేగుల్ని కోతపెడుతూ వుంది!

వీర : ఇదిగో! మహారాజులుంగారిటే వస్తున్నారు!

[ ఇద్దరూ మౌనగంభీరంగా నిలబడతారు. బుక్కరాయలు ఉద్వే గంతో ప్రవేశిస్తారు. వయస్సు దేహాన్ని వడలచేసినా ఉత్సా హాన్ని సడలించలేదు. సాదా దుస్తులతో వున్నారు. నడుమున రాజఖడ్గం.... ]

బుక్క : లింగన మంత్రివర్యా! సభాసమావేశానికింకా సమయం కాలేదా?

లింగ : మహాప్రభువులుద్వేగంతో ముందే విచ్చేసారు. సభాసదులకు కూడా వెంటనే వార్త పంపుతున్నాను.

బుక్క : వద్దు. వద్దు. సావకాశంగానే రానీయండి. ఈ అలజడి పరిస్థితుల్లో ఎవరిపాట్లు ఎట్లా వుంటాయో! చచ్చేవారెవరో! బదికేవారెవరో? ఈ స్థితిలో మృత్యు ముఖంలోకి వెళ్ళడానికి తొందరపాటెందుకు? రండి. రండి. ఆసీనులు కండు. (అందరూ తమ తమ స్థానాల్లో కూచుంటారు.) మంత్రివర్యా! యువరాజులనుండి ఏమైన వార్త లందినవా?

లింగ : (లేదని తలత్రిప్పుతాడు.)

బుక్క : సేనాపతీ! మీరు సాధించిన రహస్య వార్తలు?

వీర : నిష్ఫలమైంది మహాప్రభూ! కానైతే ....

బుక్క. కాని ఏమిటో!

వీర : బెళినాడు సీమకు చెందిన 'భానువళి' లోని హరిహరేశ్వర దేవాలయాన్ని ఎవరో అపరిచితులు కొలది దినాలకిందటనే, జీర్ణోద్ధార చేసారని మాత్రం వార్త లందాయి.

బుక్క : దాంతో మనకేం ప్రయోజనం చేకూరినట్లు?

లింగ : అది యువరాజుల పనేనని సేనాపతుల ఊహ మహాప్రభూ!

బుక్క : (సంతోషంతో) అట్లాగా! అట్లా అయితే చిక్కరాయలు విజయశీలురై వుండవచ్చు కదూ! బోయ సింహాన్ని వలలో పడేసి యుండవచ్చునా? మంత్రులారా! ఈసారి యువరాజు లీ మృత్యుగండం నుంచి బైటపడితే ఆయనకు పట్టంగట్టి మేము నివృత్తులమై హంపిలో విరూపాక్ష దేవుని పాదతలంలో దినాలు గడపడానికి నిశ్చయించుకొని వున్నాం. మీ కందరికీ సమ్మతమేనా?

వీరభద్ర : ప్రభువుల చిత్తమే మా మనస్సు. మే మంటే ఎవరు ప్రభూ! తమ అంగోపాంగములే కదూ!

లింగ : చక్కగా చెప్పారు! సేనాపతీ! (ప్రభువు వైపు తిరిగి) మా దొరలు, గురువు, దేవుడూ, సమస్తమూ మీరే. నేటిది ఏపాటి గండం మహాస్వామీ! తమ చిరంజీవులైన యువరాజులుం గారిని ఏ మృత్యువు ఎదురించగలదు? సింహం కడుపున సింహకిశోరమే కదూ ఆశ్రయాన్ని సంపాదించేది?

బుక్క : మమకారం పెరిగిన కొలదీ, భయంకూడా పెరుగుతుంది. మంత్రులారా! గండాలకు గుండెల్ని చూపించనివా డెటువంటి క్షత్రియుడు అని మనస్సు చెబుతోంది; మరుక్షణమే పితృవాత్సల్య మనే

మోహం దేహాన్ని భయంతో దుర్బలం చేసివేస్తోంది. నిజానికి చిక్క రాయల కెట్టి ఆపదైనా సంభవించ కలదా ?.... సేనాపతీ! ఆ చెన్న నాయకు డెటువంటి వాడు ? చిక్కరాయలు చెఱలో పడితే ఏం చేస్తాడు ?

వీర : అతన్ని గురించి మన మింతగా హీనంగా తలపోయకూడదు ప్రభూ! వీరుల్లో వీరుడు. బోయవాడైనా వర్చస్వి. యుద్ధనీతిని పాటించకుండా మోసంతో కయ్యానికి కాలుదువ్వే ఘటంకాదు. మిక్కిలి గౌరవంతో వ్యవహరింపదగ్గ మంచి శత్రువు. ఆ ప్రాంతాల్లో చుట్టుప్రక్కలనున్న బీదా బిక్కీ ఆయిన పల్లె జనమంతా అతన్ని దేవతగా పూజిస్తూ వుంటుంది. చిక్కరాయలవారికి నొప్పి కలిగించే, ఏ పనికిగాని, బహుశః అతగాడు చేయిచేసుకోడనే అనుకుంటాను.

లింగ : (కోపంతో) అంత గట్టిగా వక్కాణించి చెప్పడానికి లేదు సేనా పతీ! దాడులు, దోపిళ్లు, హత్యలు వీటిమధ్య పెరిగిన చన్ననాయ కుని కరాళకీర్తి ఒక్కసారిగా ఇంత వేగంగా పున్నమచందురుని పోలే ధవళ కీర్తులు వెదచల్లుతోందనుకోడం సాధ్యంకాదు. యుద్ధం, ఆపద, వివాహం మొదలైన సమయాల్లో, మహాప్రాజ్ఞులైనవారికి కూడా వివేక శూన్యత అనే మబ్బు తెరలు క్రమ్ముకోడం సహజం; ఇహ అడవి బోయవానిమాట చెప్పేదేముంది ?

బుక్క : చన్ననాయకునికి సంబంధించి ఎన్నో మంచి విషయాలు మేము వినే వున్నాం. కాని అతగా డొనర్చిన అసంఖ్యాకాలైన హత్యలు, దాడులూ, వీనిని మనం ఎలా అర్థం చేసికోవాలి ? మన రాజ్యపు పొలిమేరలలోని వ్యాపారమంతా ఇతని మూలాన ములిగిపోయింది. దేశంలోని భాగ్యవంతులంతా శూన్యహస్తాలతో బికారులైపోయారు. పెరిగి పెద్దవై కోతకు సిద్ధంగావున్న పైరుపంటలు భస్మీ భూతా లైనాయి. దీనికేమంటారు సేనాపతులు ?

లింగ : సేనానాయకులు చన్ననాయకుని పక్షం వహించి మాటాడ లేదు మహాప్రభూ ! తమకు తెలిసిందాన్ని అమాయకంగా తమకడ విన్న వించుకున్నారు.

[ వీరభద్రుడు సకృతజ్ఞంగా లింగన మంత్రివైపు చూస్తాడు ]

బుక్క : (ఆలోచించి) మంత్రివర్యా! మా గుండెలు దడదడా కొట్టు కుంటున్నాయి. రేపు సూర్యోదయంలోగా చిక్కరాయల సమాచారం తెలియకుంటే, మిగిలిన సైన్యం తీసికొని చన్ననాయకుని మేమే ఎదిరిస్తాం. ఆ విధంగా ఊరిలో చాటించండి.

లింగ : చిత్తం ప్రభూ ! (దూరంగా కొమ్ముబూరా – కాహళుల మ్రోత. దాంతోబాటు గుర్రపు డెక్కల చప్పుడు వినవస్తోంది.)

బుక్క : ఏమిటా గందరగోళం! అంగరక్షకుల పటాటోపమా ఏమిటి ? చూడండి సేనాపతీ ! అట్లాఅయితే, రాజసభలోకి సభాసదుల్ని రప్పించండి.

[ వీరభద్రుడు కొంచెంసేపు పిమ్మట పట్టరాని సంతోషంతో రాయలకు వంగి నమస్కరిస్తాడు. ]

బుక్క : ఏం వార్తలు! సేనాపతీ!

వీర : గొప్ప శుభవార్త మహాప్రభూ! చిక్కరాయలవారు విజయశ్రీ సమేతులై వేంచేసి వున్నారు. నగరంలోని పుణ్యస్త్రీలు మంగళా రతులు పట్టుతూ వున్నారు. ప్రభువుల సమక్షానికి రావడంలో ఆలస్య మైనందుకు ఆగ్రహింపకూడదు అని నా ద్వారా మీకు చెప్పంపారు.

బుక్క : (సింహాసనం నుంచి దిగివచ్చి) సేనాపతీ! ఎంత మంచి సమా చారం వినిపించారు! మా మనస్సు ఆనందంతో ఎగిరి గంతులు వేస్తూవుంది (అని ముందుకు వచ్చే సమయానికి 'కర్ణాటక రత్న సింహాసనాధీశ్వర మహారాజాధిరాజ బుక్కమహారాజులుంగారి కుమా రులు కంఠీరవ చలువరంగారాజా! పరాక్! పరాక్! బహుపరాక్!' అనే ఘోష వినవస్తుంది. తండ్రిని చూడగానే కుమారుడు అమాంతం వచ్చి కౌగిలించుకుంటాడు. కొంతసేపటి తర్వాత పొంగి పొరలి వస్తూవున్న ప్రేమతో కుమారుని, వెంట పిలుచుకొని, సింహాసనం మీద, కూచోబెట్టి తామూ ఆసీనులౌతారు. చిక్కరాయల పరివారమూ, ఇతర సభాసదులూ, తమతమ స్థానాల్లో కూచున్న మీదట.)

బుక్క : (కంచు విగ్రహంలా నిల్చున్న చన్ననాయకుని చూచి) ఇత డెవరు యువరాజా !

రంగ : వీరే మన బందీయైన చన్ననాయకులు మహాప్రభూ !

లింగ : చేతికి సంకెళ్ళయినా లేకుండా, ఠీవిగా సర్వతంత్ర స్వతంత్రుని వలె నిలబడ్డ చన్ననాయకుడా !

రంగ : ఔను అమాత్యవర్యా ! సాధారణ కోటికి చెందిన ఖైదీలకు చేతికి సంకెళ్లు ! ... ఈయన బందీ అయినా మనకు మాన్యుడైన అతిథి. తమ ఆసనాన్ని వీరికి దయచేసి ఇవ్వగోర్తాను. (లింగన్న తన పీఠాన్ని ముందుకు తెచ్చి చన్ననాయకుని ముందుంచి తాను నిల బడతాడు.)

చన్న : (కూచుంటూ) మీ మేలు మరువరానిది. యువరాజా ! (వీరభ. గుర్తించి) వీరు మన సేనాపతులు గదూ !

వీర : ఔను. చన్ననాయకులు నన్ను జూచి పరిహాసమాడుతున్నారు కాబోలు !

చన్న : వీరుడైనవాడు మరియొక వీరుని ఎన్నటికీ హాస్యమాడడు. సేనా పతీ ! ఆనాడు మీరు పోరాడిన సొగసు తీరు నేటికీ స్మృతిలో నిలిచి వుంది. నిజానికి ఓ విధమైన ఆత్మీయత రెక్కొన్నది. ఆ ఆనంద భరంతోనే మీ పేరు ఉచ్చరించి వున్నా. నా యెడల అపరాధముంటే మన్నింప గలరు.

బుక్క : ఎంతటి వినయశీలి ! సభాసదులారా ! మనకు బందీగా వచ్చిన చన్న నాయకుల న్యాయవిచారణ ఇప్పుడు జరుగవలసి వుంది. వారితో పోరాడి, వారిని గెలిచి చెరగొని తెచ్చిన మన యువరాజులే ఈ విచారణ నడిపించాలి అని మా ఆశయం. తమ అందరి అభి ప్రాయ మేమిటో ?

అందరు : అట్లేకాదగు, ప్రభూ !

చిక్క : (లేచి నిల్చుని) మహాప్రభూ! నేను తమ ముందు పసివాడను. ఇంతటి గొప్ప గౌరవానికి అర్హుడను కాను నేను. దానికి తగిన యోగ్యత నాయందు లేదు. ధర్మమూర్తులైన తమరు చేయదగిన ఈ గురుతర కార్యభారాన్ని వహించడానికి నేను సమర్థుడను కాను. అదీగాక, చన్ననాయకుల కదన కౌశల్యాన్ని చూచి, వారియందు నాకు గురుభావ మేర్పడింది. ఈ అభిమానం న్యాయనిర్ధారణకు ప్రతిబంధకం కావచ్చు. తాము న్యాయవిచారణ చేయవలసిందిగా ప్రార్థన. (చిక్కరాయలు కూర్చుంటాడు.)

చన్న బాగు బాగు! కన్నడ కేసరీ! బాగు బాగు! వీరత్వంతోబాటు వినయశీలాన్ని కూడా పెంచుకొన్నారు మీలో.

బుక్క : చన్ననాయకా! యువరాజుల మాటలకు కట్టువడిపోయి మేమే తమకు న్యాయవిచారణ నడిపిస్తాం. మావలన మీకు న్యాయం జరుగుతుందనే నమ్మకం మీకుందా?

చన్న : (లేచినిలబడి) మహాప్రభూ! తమరు ధర్మాత్ములూ, జగద్వంద్యులూ నైన రాజన్యచక్రవర్తులు. కర్నాటక మందున్న పవిత్ర రత్నసింహాసనాధీశులు. గురువర్యులైన మాధవమునుల అనుగ్రహానికి, పాత్రులు. తమరుచేయు న్యాయవిచారణ సమ్మతమేకాదు. శిరోధార్యం కూడా.

బుక్క : సేనాపతీ! తమ వినయమూ, సుసంస్కృతమైన నడవడీ, మమ్మల్ని కరగించి వేస్తున్నాయి. తమరిని చూడగానే తమర్ని గురించి లోగడ నేను విన్న అనేకవార్తలు వట్టి బూటకాలు అని అనిపిస్తోంది. తమరిమీద దాడి, దోపిడీ, హత్య మొదలైన నేరాలు మోపబడి వున్నాయి. ఏమంటారు మరి?

చన్న : మహాప్రభూ! వానిలో కొన్నిమాత్రమే సత్యం. అనేకం అసత్యం బీదల్ని దోచి, హింసించి, వారి జీవితాల్ని శూన్యంచేస్తూవున్న అధికారులను, శ్రీమంతుల్ని వర్తకులను, నేను దోచుకుంటున్నది నిజమే. కాని దానిలో ఒక్క చిల్లిగవ్వైనా నా స్వంతానికి వాడుకోలేదు. నేను నేల దున్ని, విత్తి పెంచిన రాగులనే తింటాను. నా భార్యా, పిల్లలూ,

వడికి నేసి ఇచ్చే ఈ మొరటు బట్టలనే ధరిస్తాను. హింసకులను దోచి, సంపాదించిన దాన్ని ప్రభువు పేరిట బీదకు, బిక్కికి, వారి ఆకలి మంటల నార్ప ఉపయోగిస్తూ వుంటాను మహాప్రభూ !

లింగ : అట్లా ఆయితే సేనాపతి నరసింహనాయకుల చీల్చి, రాజమార్గంలో ఒక చెట్టుకు వేలాడదీసిన వాళ్లెవరు ? తమరు కారా ?

చన్న : నేను కాదు. నా దగ్గిర వుండేవాడు. తప్పు వానిది కాదు. నాది. నేనే ఆజ్ఞాపించి ఆ ఘోరమైన హత్యను చేయించా.

లింగ : ఈ హంతకునికి మరణదండన విధించాలి ప్రభూ ! నరసింహనాయకులు మన సైన్యంలోని మహావీరుల్లో ఒకరు. ఈ రాజ్యానికి ఏక దీక్షగా సేవచేసిన వారు. అట్టివారి హత్య కొడగట్టిన ఈ నాయకునికి మరణదండనమే తగిన శాస్తి.

బుక్క : దీనికేమిటి చెబుతాడు నాయకులు !

చన్న : కావచ్చు మహాప్రభూ! కాని నరసింహనాయకులు చాలామంది కుల స్త్రీల మానమర్యాదల్ని మంటగలుపుతూ అపహరిస్తూ వచ్చాడు. రాజ్యసేవ అనే నెపంతో ప్రపంచాన్ని దోచి, కొల్లగొట్టుతూ వచ్చాడు. తనకు అడ్డంగా వచ్చినవాళ్ళ ఇండ్లనూ, వాకిళ్ళనూ, పైరు పంటల్ని దగ్ధపటలంచేసి సంతోషంతో పళ్లికిలిస్తూ వుండేవాడు. అట్టి నీచుడు తమ రాజ్యానికి ఎక్కడలేని కంటకస్వరూపుడూ అని భావించి నేను రాజదండం వహించినమాట నిజమే ప్రభూ !

బుక్క : మీ రింత రాజభక్తి కలవారైతే, మాతో కదనానికి తలపడడం ఎందుకో ?

చన్న : ఆ సంగతి వీరభద్ర నాయకులే విశదీకరింపగలరు.

వీర : స్వామి సేవను, ఎటువంటి వీరులైనా దూరంనుండే ఏకనిష్ఠగా చెల్లిస్తూ వుంటారని చూపించడమే ఆయన ఉద్దేశం ప్రభూ ! మేం వారి చెరలో బద్ధప్పుడు, ఎంతో మర్యాదతోనూ, మన్ననతోనూ మమ్మాదరించి, ప్రభువుల్ని దర్శించి, కప్పం, కానుకలూ చెల్లించాలని చెప్పి ఊవ్వి ళ్ళూరాడు ప్రభూ !

బుక్క : ఆ సంగతి మీరు ముందే ఎందుకు చెప్పారుగాదు ?

వీర : ఓడి వచ్చింతర్వాత కట్టుకథ ఏదో చెబుతున్నాననే అపనమ్మకం మీకు కలుగవచ్చుననే భయంతో....మహాప్రభూ! సేవకుని అపరాధాన్ని మన్నించాలి!

బుక్క : ఇందుకు యువరాజులేమంటారు ?

రంగ : మాకు విజయశ్రీ లభించింది నాయకుల దయచేతగాని మా సాహసం వల్లకాదు, ప్రభూ! సాహసమే ముఖ్యమైతే నలభైవేల సైన్యానికి విజయం దొరకకుండా వుంటుందా? నాయకులు ప్రభుదర్శనాకాంక్ష జేసి తామే ఓడిపోయి, మనలను ఈ విధంగా తమ అంతఃకరణంతో గెల్చివున్నారు. విజయకీర్తిని కట్టబెట్టిన వీరికి, మనకు గెలిచే అవకాశమిచ్చినందుకు హృదయపూర్వకమైన కృతజ్ఞతను ప్రకటిస్తున్నాను. మహాప్రభూ!

చన్న : యువరాజుల మాటను నిజమనుకోకూడదు మహాప్రభూ! నా వయస్సుకూ, ఏనుగులా పెరిగిన ఈ దేహానికీ, గౌరవం చెల్లించాలనే కోరికతో తమరిని తాము కించపరచుకొని మాట్లాడుతున్నారు. అంతే. దిడనూరు దగ్గిర యువరాజకేసరి పోరాడిన తీరు చూస్తే తమ కెంతటి నేత్రపర్వంగా వుండేదో! చెప్పతరం గాదు. ఏమి ఆ హస్త నైపుణ్యం! ఏమి చమత్కారం! ఏమి ఖడ్గ చాలనం! ఆ దృశ్యాన్ని చూస్తూ ముప్పదేళ్లుగా కత్తిని నాట్యమాడించిన ఈ కిరాతునికి నోటివెంట మాట పెగిలిందికాదు మహాప్రభూ! "ఆప్పాజి! నువ్వు ఇల్లాగే దొంగతనం, దాడీ చేస్తూవుండు నీతో పోరాడి, నిన్నోడించి, రెక్కలు విరిచికట్టి మహారాజు దగ్గిరకు తీసుకొని పోతాను" అని చెబుతుండేవాడు. నీచుడైన నరసింహనాయకుడు, విషాన్నం పెట్టి, నా పైని కోపాగ్నికి, నా బిడ్డను బలిగొన్నాడు. నా బిడ్డ కోరికను యువరాజులు తీర్చారు. అతని ఆత్మకు శాంతి గూర్చి, అతని ముసలి తండ్రి హృదయానికి ఆనందపర్వాన్ని చేకూర్చారు. నా జన్మ, నిజానికి, ఇప్పుడు సార్థకమైంది.

బుక్క : లింగన మంత్రివర్యా! ఈ రాజవిరోధికి ఎట్టి శిక్ష విధిస్తాం

లింగ : ఈతని ప్రభు ప్రేమ అనన్యాదృశమైంది. క్షమించడమే ఇతనికి తగిన శిక్ష అని నా మతం. అయినా లోక సంగ్రహార్థం ఈతడు 'బోయకోట'కు తూర్పు దిక్కులో స్థాపించి వున్న రణస్తంభంమీది శిఖరభాగాన్ని తెగగొట్టివేద్దామని నా ప్రార్థన.

చన్న : (గంభీర ముద్రతో) ప్రభూ! అది సరికాదు. నా రణస్తంభం తలకు బదులుగా నా తలనే అర్పించడానికి సిద్ధంగా వున్నా. అంతేకాని ఆ స్తంభాన్ని ముట్టకూడదు. అది నా విజయ యాత్రలకో పరిపూర్ణమైన సంకేతం. నాకు దీనులయెడ గల ప్రేమకు మాసిపోని గుర్తు అది! నా కుమారుని సమాధిమీద కట్టిన రణస్తంభం అది!

బుక్క : ఒప్పుకున్నాం—చన్న నాయకా! చింతింపకు. మీ రణస్తంభాన్ని అత్యంత గౌరవబుద్ధితో కాపాడుతూ వస్తాం.

చన్న : అనుగృహీతుడను ప్రభూ! అనుగృహీతుడను. దానికి బదులుగా 'నాయకుడు' అనే బిరుదాన్ని నా యీ పచ్చరంగు జెండాను, నాకు అయాచితంగా ఈశాన్యమూలగా లభించివున్న ఏడు బంగరు కలశాల్ని వీటి అన్నింటినీ, మీ చరణాల ముందర్పిస్తున్నాను. ప్రభూ!

బుక్క : ఇది అందరికీ సమ్మతమేనా?

అందరు : సమ్మతమే ప్రభూ!

చన్న : (తన కత్తిని ఒఱనుండి తీసి) ప్రభూ! మాహేశ్వరదేవునికి దగిన పరమౌదార్యం కదూ మీది! నా అనంతాపరాధాల్ని మన్నించారు. ఈ పామరుని భక్తిని స్వీకరించి రక్షించాలి ప్రభూ! (కత్తిని సమర్పించి నమస్కరిస్తాడు)

బుక్క : నాయకా! మీ రాజభక్తి అనుకరణీయమైంది. (తన కత్తిని ఒఱ నుండి తీసి) మీరు దీన్ని స్వీకరించి మన యువరాజులకు ప్రధాన అంగరక్షకులుగా వుండాలని మా కోరిక.

చన్న : (తటపటాయిస్తూ క్షణకాలం ఊరుకుంటాడు)

రంగ : ఇంకా ఆలోచిస్తూనే వున్నారా చన్న నాయకా ! మాత్రై స్వీకరింప కూడదా ?

చన్న : (రంగరాయల ముఖంచూసి నవ్వుతూ) చిత్తం ప్రభూ ! దేవర చిత్తం.

బుక్క : మాకు చాలా సంతోషమైంది. నేటికి సభ ముగిసినట్లే !

[బుక్కరాయలు రత్న సింహాసనమందుండి వెడలిపోతారు. వారి వెన్క యువరాజులు; అందరూ గంభీరముద్రతో నిలబడి వుండగా, యువరాజులు చన్న నాయకుని చేయి కలిపి పట్టుకొని, లోపలికి తీసుకొని పోతారు.]

(తెర వాలుతుంది)

# ఈ సంగ్రహంలోని నాటకకర్తల గురించి

సంస:

కన్నడ సంస్కృత భాషలు రెంటిలోనూ, చక్కని పాండిత్యం గడించిన వీరు మైసూరు రాజుల చరిత్రను పరిశ్రమపూర్వకంగా అభ్యసించి, 'విగడ విక్రమరాయ' 'సుగుణ గంభీర' మొదలైన నాటకాల్ని రచించిన దివంగతులు ఎ. ఎన్. వెంకటాద్రి శర్మగారు. తమ చారిత్రక నాటకాలకుగాను ఒక ప్రత్యేక శైలినే నిర్మించుకొన్నారు. కొంతకాలం వీరు మైసూరు శారదా విలాస హైస్కూలునందు ఉపాధ్యాయులుగా వుండి వున్నారు.

కైలాసం:

కన్నడంలో ఆధునిక సామాజిక నాటకాలు రచించడంలో మొదటివారైన దివంగత శ్రీ టి. పి. కైలాసంగారు 'టొళ్ళుగట్టి' 'హోం రూలు' వీనిచేత ప్రసిద్ధులైనారు. మాటల కూర్పుతోనే నాటకాల సంభాషణ నడిపించడానికి ప్రయత్నించడం వీరి ప్రత్యేకత. రామాయణ మహాభారతము లందలి కొన్ని సన్నివేశాల్ని తీసికొని, వీరు Purpose, Karna మొదలైనవి ఇంగ్లీషులో కూడా రాశారు.

స్వతః నటులు, యూరోపులో విద్య నభ్యసించేటప్పుడు అచ్చటి నాటకాల ప్రభావముద్ర వీరిమీద పడింది. తమ హోదాకు రాజీనామా నిచ్చి నాటక కర్తలై–విలాసరంగానికి పెంపు కూర్చారు.

శ్రీరంగ:

ఆర్. వి. జాగీర్దారు అనే పేరితో ధార్వాడ కర్ణాటక కాలేజిలో సంస్కృత అధ్యాపకులుగా పని చేసారు. లండనులో భాషాశాస్త్ర పదవి పొంది రంగభూమి ప్రభావానికి లోనై, కన్నడంలో కొత్తరకమైన సామాజిక నాటకాలు రాసి, ప్రదర్శిస్తూ వచ్చారు. కాలేజీ

ఉద్యోగానికి తిలాంజలి ఇచ్చి, ఆద్య రంగాచార్యులైనారు. సంస్కృత నాటకోత్పత్తి వికాసాల్ని గురించి, మౌలిక గ్రంథాన్ని రచించారు. ధార్వాడలో 30 సంవత్సరాలు ముందు కన్నడ నాట్యవిలాస సంస్థ, బెంగుళూరిలో అద్యతన నాట్యసంఘాన్ని స్థాపించి, ఇంకా నాటక రచన. రంగభూమికి సంబంధించిన ఆందోళనలలో నిమగ్నులై వున్నారు.

కె. వి. పుట్టప్ప :[1]

కు. వెం పు. అనే కలంపేరితో వ్రాసే వీరు నేటి కన్నడభాషా కవులలో శ్రేష్ఠశ్రేణికి చెందినవారు. వీరి 'రామాయణ దర్శన' మహాకావ్యానికి (అధునిక కన్నడ మహాకావ్యములందు మొదటిది) సాహిత్య అకాదమీవారి బహుమానం లభించింది. అనేక పద్యనాటకాల్ని, విమర్శాత్మకములైన వ్యాసాల్ని రాసిన వీరు మైసూరు విశ్వవిద్యాలయంలో కన్నడ భాషకాచార్యులై పిదప అదే విశ్వవిద్యాలయానికి వైస్‌ఛాన్స్‌లరుగా కూడ ఉద్యోగించి, పదవీవిరమణ చేసారు.

పు. తి. నరసింహాచార్ :

సంగీతజ్ఞానం, కావ్యప్రతిభ వీని రెంటి అపూర్వమిశ్రణంగా వ్యక్తిత్వాన్ని నిర్మించుకొన్న వీరు, మైసూరు ప్రభుత్వ లెజిస్లేచరు విభాగములో దుద్యోగించి పదవీ విరమణ చేసారు. లాలిత్యం, మార్దవం, ఇవి రెండూ, ప్రయోగంలో తేగలిగిన శబ్దసామర్థ్యం, వీరి లేఖిని కుండడంచేత, 'హరిణాభిసరణ' వంటి గేయ నాటకాలు వీరిచే రచింపబడినాయి. ఉత్తమకవులుగా వీరు కన్నడిగులకు సుపరిచితులు.

జి. పి. రాజరత్నం

నేటి కన్నడానికి ఒక అపూర్వ కృతి సమర్పించిన 'రత్న' 'ఎండకుడుక' అన్న బిరుదుగలవాడై, 'రత్నత్రయం' కంటె వేరైన వ్యక్తి.

1. కన్నడంలో ప్రప్రథమంగా భారతీయ జ్ఞానపీఠంవారి పారితోషికం పొందారు—అనుం.

మైసూరు ప్రభుత్వ కళాశాలయందు కన్నడాధ్యాపకులైన వీరు విమర్శా త్మక రచయితలుగూడ నైయున్నారు. 'పురుష సరస్వతి' అన్న వీరి మహాకావ్యం వీరి వ్యంగ్యశక్తికి బలమైన సాక్ష్యం.

## ఆర్. యస్. ముగళి

సాంగ్లె విలింగ్డన్ కాలేజిలో సంస్కృత కన్నడ భాషలకధ్యాపకులైన వీరు ప్రస్తుతమక్కడనే ప్రిన్సిపాలుగా వున్నారు. 'రసికరంగ' అనే పేరితో ఉత్తమ కవులుగా పేరు పొందారు. నవలలు, ఏకాంకికలు, పద్యనాటకాలు, అన్ని రకాల సాహిత్యమూ, వీరి లేఖిని ద్వారా వెలు వడింది. 'కన్నడ సాహిత్య చరిత్ర' అనే వీరి స్వతంత్ర గ్రంథానికి సాహిత్య అకాడమీవారి బహుమతి లభించింది.

## శివరామ కారంత :

పుత్తూరులో మెట్టజీవితాన్ని గడిపిన వీరు నాటకాలు, ఏకాంకికలు, గేయాలు, నవలలు, బాల ప్రపంచం, విజ్ఞాన ప్రపంచం, నృత్య యక్ష గానాలు, ఈ ప్రకారం వివిధరంగాల్లో విహరించినవారు. వీరి 'యక్ష గాన' పుస్తకానికి సాహిత్య అకాడమీ వారి పారితోషికం లభించింది. వీరు 'బెట్టదజీవ', 'చోమనగదుడి', 'మరళి మణ్ణిగె' మొదలైన అనేక నవలలను రచించి వున్నారు. నేటి కొద్దిమంది ఉత్తమ నవలాకారుల్లో వీరిది అగ్రస్థానం.

## ద. రా. బేంద్రె :[1]

'అంబికా తనయదత్త' అనే పేరితో కన్నడ సహృదయులకు, ప్రేమ పాత్రులై సుపరిచితులైనవారు నేటి ఉత్తమ కవులలో ఒకరు. వీరి 'అరళు-మరళు' సంకలనమునకు సాహిత్య అకాడమీవారి బహుమతి లభించింది. జానపద సంగీత ధోరణిలో తమ వృత్తాల్ని నడిపించడం వీరి ప్రత్యేకత. వీరు కొన్ని ఏకాంకికలను, కొన్ని నాటకాల్ని, విమర్శ వ్యాసాల్ని రచించి వున్నారు.

---

1. దత్తాత్రేయ రామచంద్రబేంద్రె అని వీరి పూర్తి పేరు. వీరి మాతృభాష మరాఠీ. జ్ఞా. పీఠం వారి బహుమతి వీరికిపీ లభించింది—అనుం.

కృష్ణకుమార కల్లూర :

బొంబాయిలో ఒక పారిశ్రామిక విద్యాసంస్థయందు ముఖ్య అధికారులైన వీరు మొదట్లో కన్నడ ఆందోళనచేత ప్రభావితులై మంచి 'చిన్న కథల్నీ' 'ఏకాంకిక'లునూ రచించారు. 1942 వ సంవత్సరం లోని ఆందోళనానికి సంబంధించిన తమ 'జాగృత రాష్ట్ర' అనే నాటకం ద్వారా వీరు లోకప్రీతి సంపాదించుకున్నారు. తరువాత ఆ కన్నడాభిమానమే వీరిని ఏకీకరణకు సంబంధించిన అనేక ఆర్థిక, ఔద్యోగిక సమస్యల గురించి గంభీరమైన అధ్యయనానికి పురిగొల్పింది.

౫. కృష్ణారావు :

మొదట, నాటకాలు, ఏకాంకికలూ, చిన్న కథలూ, రాసిన శ్రీ అ.న కృ నేడు కన్నడంలో లోకప్రీతి సంపాదించుకొన్న నవలాకారులుగా స్థిరపడిపోయినారు. కళ, కళాకారుల గురించి పరిచయ వ్యాసాల్ని రచించి వున్నారు. 'సంధ్యారాగ' అనే ఉత్తమ నవలను సృష్టించిన దాదిగా వీరి లేఖిని ఎక్కువగా నవలలవైపే మొగ్గు చూపించి. ఇటీవల భారతీయ సంస్కృతి, దర్శనం అనే సంగ్రహ గ్రంథాన్ని మైసూరు ప్రభుత్వంపక్షాన వీరు సంపాదించి వున్నారు.

# ఏకాంక సంగ్రహం

ఏకాంకిక కన్నడానికి కొత్త అని చెప్పడంలో దాని అర్థమే వేరు. నేటి మన ఏకాంకిక పూర్తిగా మన ఈనాటి జీవిత విధానంచే ప్రేరితమై వుంటుంది. నేటి జీవితాని కది ప్రతిబింబం. నేటి మన మను గడలు కొత్తదనము ప్రోది చేసుకున్న మేరకు మన ఏకాంక ప్రక్రియయు కొత్తదే; మన బ్రతుకు తెన్నులు ఏవిధమైన వినూత్నతను సంపాదించు కొన్నవో దానిని ప్రతిబింబింపజేయునదే నేటి మన ఏకాంక సాహిత్యం. అటువంటి ఉత్తమశ్రేణికి చెందిన ఏకాంకికలు ఈ పుస్తకంలో సంగ్ర హింపబడినవి.

ఇట సంకలితాలైన పదకొండు ఏకాంకికలు 'ఏవంగుణ విశిష్టా లైన' కళాకృతులని చెప్పలేము. లేక ఈ పదకొండు ఏకాంకికలను మినహాయిస్తే, మరి యితర ఏకాంకిక లీదృశమలైనవి లేవనీ కాదు. కన్నడంలో ఏకాంక రచన చేసేవారు ఇంకా పలువురున్నారు. అయి నప్పటికీ, ఏకాంకికలను వ్రాయుటలో చేయి తిరిగిన సిద్ధహస్తుల రచనల నిస్సీ, అవి కన్నడ ఏకాంకంలోని వైవిధ్యానికి నిదర్శకాలు కాగలవ నిస్సీ, ఈ పదకొండు ఏకాంకములను ఈ సంగ్రహంలో చేర్పడ మైనది. ఈ ఏకాంకికల రచయితలు ఆధునిక కన్నడ సాహిత్య ప్రపం చంలో తమకో విశిష్టస్థానాన్ని సంపాదించుకున్నవారే.

కన్నడంలో ఏకాంకం వివిధరూపాలు వహించింది.

ఏకాంకికల రంగభూమి అనగా నాట్యవిలాసాల కనువైన రంగ భూమి సువ్యవస్థితమై పేరుపెంపు లందినట్టిది కాదు ఏకాంకికల పెంపు దలకు జాగరూకమైన విమర్శ ఎంతైనా అవసరం. అది కూడా ఇంకా తలెత్తలేదు. అయినప్పటికీ అనేకులు ఏకాంకికా రచనపై మక్కువ చూపుతున్నారు. వారి ఈ ఆసక్తి భవిష్యత్తుకు ఆశాదాయకం. ఏకాంకం కన్నడంలో జీవకళతో వికసిస్తోందని చెప్పడానికి ఈ సంగ్రహంలోని ఏకాంకికలే నిదర్శనం.